64138

కొత్త

# మోతి స్యాండల్ సబ్బు

NEW
TATA'S
MOTI
LUXURY BATH SOAP
SANDAL

మీకోసం...
మీ మేని కోసం...
మోతిలో మిళితం చందనపు
గుణాలు మోతిలో మొత్తం
చందనపు సౌరభాలు

మీ మేని వన్నె
ప్రతిబింబం

టాటా ఉత్పాదన

CLARION/BT/47/254 TEL

## వీక్లీ పోస్ట్

### ఎదురు చూపులు

"అసలు చూపుల కన్న ఎదురుచూపులే మిన్న" అని అన్నాడో కవి. అలాగే ఎదురు చూసి చూసి ఒకేసారి ప్రేయసి కనపడితే ప్రియుడు ఏ విధంగా అనుభూతి పొందుతాడో, చాలా రోజుల తర్వాత పిల్లలు తల్లి దండ్రులకు కనపడితే ఎలా ఆప్యాయతను అనుభవిస్తారో అలాగే పాఠకులకు పత్రిక చాలా రోజుల తర్వాత కనపడడంతో అలాంటి ఆప్యాయతే ఎదురైంది. 4-5-90 సంచిక ఇన్ని రోజుల తర్వాత మెరుపు తీగ "కుష్బూ" ముఖ చిత్రంతో రావడంతో ఉబ్బి తబ్బిబ్బై పోయాం. ముఖ్యంగా చల్లావారి "లవ్‌గేమ్" రసవత్తరంగా నడుస్తోంది. నవ్య, స్వాగత్‌ల ఎత్తులకు పైఎత్తులతో పాఠకులను ఉత్కంఠ ఊపిరి బిగపట్టేలా లాగిస్తున్నారు. ప్రతివారం సస్పెన్సులతో చక్కని మలుపులతో 'నవ్య' పాత్రను చక్కగా మలుస్తున్న శ్రీ చల్లాగార్కి సాహితీ నమస్సులు.

శీర్షికల విషయంలో ప్రత్యేక శ్రద్ధ కనపరచడం ముఖ్యంగా కవితా! యువతా చక్కని శీర్షిక. చాలా మంది పాఠకులు పాల్గొనే విధంగానే కాకుండా ముగ్ధమనోహరంగా పత్రిక రావడం సర్వదా హర్షామోదం. వీరాజీగార్కి వందనములు.

– పోలోజు వెంకటాచారి, బోడుప్పల్

### కథల కాణాచి

మీరు ఈ మధ్యన కథల కాణాచి శీర్షికలో ఆంధ్ర సచిత్ర వారపత్రికలో లోగడ ప్రచురితమైన కొన్ని విశిష్టమైన కథలను ప్రచురిస్తున్నారు. బహుశా కథలకాణాచి శీర్షికను నిలిపి వేయకుండా కొనసాగిస్తారని, కొనసాగించాలని ఆశిస్తున్నాను.

– గుమ్మా ప్రసాదరావు, జబల్పూరు




## పదండి లోపలికి

విడిప్రతి వెల నాలుగు రూపాయలు

ముఖచిత్రం :

"మహాజనానికి మరదలుపిల్ల"లో నిరోషా



**పై వారం :**

**టానా బహుమతి కథ "మంగా మంగా"**




ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తనమనంబునకగు దా నొరులకునవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్

THE ANDHRA PATRIKA GROUP OF MAGAZINES

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు

సంపుటం 82 సంచికలు 40 – 47

విజయవాడ
25 మే–13 జూలై 1990

శక సం. 1912 ఆషాఢమాసం 22వ తేదీ

PRINTER, PUBLISHER & SANCHALAKUDU:
CHAKRAPANI

EDITORS:
VEERAJI
M. MADHAVA RAO

ASSOCIATE EDITORS:
POTLURI VENKATA RAO
Dr. GUMMANURU RAMESH BABU

SUB-EDITORS:
P. PRAMEELA
K. S. B. TILAK
BHISETTY LAXMANA RAO

ARTISTS:
KASI
CHALAM

PRODUCTION & ADMINISTRATIVE MANAGER:
M. THYAGARAJ

SENIOR ADVERTISEMENT MANAGER:
K. RAMACHANDRAIAH

CIRCULATION MANAGER:
S. APPADORAI

Printed and Published for Nageswara Rao Estates Ltd., by VAMARAJU CHAKRAPANI at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-520 003,
Editor: VEERAJI
Phones: Business: 61247, 61248,
Editorial: 75667.

## సంపాదకీయం...

# రైలుబండ్లు: నేరమూ-శిక్షా

**భా**రతదేశంలో ప్రభుత్వరంగంలో గానీ, ప్రైవేట్‌రంగంలో కాని రైల్వేలకన్నా పెద్ద వ్యవస్థగాని, పరిశ్రమగానీ మరొకటి లేదు. సుమారు 7500 స్టేషన్ల మధ్య దూరాన్ని చెరుపుకుంటూ భారాన్ని మోసుకుంటూ, అటూ యిటూ ప్రయాణీకుల్ని, సరుకుల్ని చేరవేస్తూ, యేటా 400 కోట్ల మంది ప్రయాణీకులకి రాకపోకల సదుపాయాన్ని కల్పిస్తున్న మన రైల్వేలు ఆశియాఖండంలోనే అతిపెద్ద వ్యవస్థ. 1853 లో 'బొంబాయి' నుంచి 'థాణా'కి ఒక చిన్న రైల్వే లైను -దాని నిడివి 34 కి.మీ-పడడంతో ప్రారంభమయిన యీ రైల్వే వ్యవస్థ 62 వేల కి.మీ. నిడివికి యివాళ దేశమంతా అల్లుకుపోయింది. అయితేనేం రైలుబండి యెక్కిన ప్రతీ ప్రయాణీకుడూ కూడా తను పడ్డ అవస్థలనే వర్ణిస్తూ వుంటాడు. ఆధునిక సదుపాయాలు, సాంకేతిక పరిజ్ఞానం పెరిగినకొద్దీ సురక్షితం, సుఖప్రదం కావలసిన పొగబండి ప్రయాణం దురదృష్టవశాత్తు కష్టనష్టాలకు మారు పేరయిపోతున్నది. దీనికితోడు టెర్రరిస్టుల అగడాలకి అరచేతిలో ఉసిరికాయలాగా లభించే 'లక్ష్యం'కూడా రైలుపట్టాలు, రైలుబళ్లు మాత్రమే!

రైల్వేవ్యవస్థలో ప్రజాస్వామ్య భారతదేశ ప్రభుత్వం-రైలుఛార్జీలని పెంచడం ద్వారా ఒక కొత్త దనాన్ని ప్రవేశపెడుతూ వుంటుంది. దేశంలో యేదైనా తగ్గుతుందేమో గానీ రైలుఛార్జీల, బస్సుఛార్జీల పెరుగుదల మాత్రం నిత్యనూతనం.

ప్రత్యామ్నాయ రోడ్డు మార్గాలు ప్రైవేటు రవాణా వ్యవస్థలు అంతంత మాత్రంగా వుండడంతో మన దేశంలో రైల్వేల జెండా పర్రు పర్రున ఎగురుతూ వస్తోంది.

ఈ జూలై ఒకటవతేదీ నుంచి భారతీయ రైల్వేల చరిత్రలో వచ్చిన కొత్త మార్పుని చర్చించడం కోసమే మన రైల్వేల మీద యీ చిన్న 'కాంపోజిషన్' రాయవలసి వచ్చింది. 1890 నుంచి అంటే వందసంవత్సరాల పాతదయిపోయిన అమలులో వున్న రైల్వేచట్టాన్ని యిప్పుడు 1990 రైల్వేచట్టం త్రోసిరాజన్నది. ఈ చట్టం వల్ల రైల్వేమండలాలకి చట్టబద్ధమైన ప్రత్యేకగుర్తింపు, పరిపాలనా వ్యవహారాలలో ప్రత్యేక స్వేచ్ఛ లభించాయి గనుక రైల్వేల యంత్రాంగం కొంత కొత్త 'కళని' సంతరించుకుంటుందని ఆశించవచ్చును కాని ప్రయాణీకులకి సంబంధించి వచ్చిన మార్పులే మనకి ముఖ్యం.

రైలుప్రమాదాలు యిటీవల కాలంలో సంభవిస్తే పెద్ద ఎత్తునే సంభవిస్తున్నాయి. రెండు రైళ్లు ఢీ కొని తుత్తినియలు అయిపోయి వందలాది మంది బలయిపోవడం లేదా రైలుపట్టాల క్రింద వంతెనలు విరిగిన కారణంగా రైలు మొత్తం నదీ ప్రవాహాలలో పడి కొట్టుకుపోవడం యిటువంటి భారీస్థాయి ప్రమాదాలే ఎక్కువ జరుగుతున్నాయి. వీటికి భయపడి ప్రయాణీకులు దూరాభారం వెళ్లడం మానుకోలేరు కదా!

కొత్తచట్టం రైలు ప్రమాదాల్లో గాయపడ్డ వారికి మరణించిన వారికి పరిహారం నగదు రూపంలో పదహారు వేల నుంచి రెండు లక్షల రూపాయల దాకా చెల్లించటానికి అంగీకరించింది. బహుశా రైల్వే ఛార్జీలు పెంచిన దామాషాలోనే యీ పెంపుదల కూడా చేసి వుంటారు!

అక్రమ ప్రయాణీకులు సాధారణంగా రైలుబండిలో-నూటికి తొంభై కేసుల్లో రైల్వేసిబ్బంది సహకారంతోనే టికెట్టు కొన్న ప్రయాణీకుల కన్నా ఎక్కువ సదుపాయాలు దబాయించి మరీ అనుభవిస్తూ వుంటారు! ఇప్పుడు యీ అక్రమ ప్రయాణీకుల 'స్టేటస్' పెంచారు. టిక్కెట్ లేకుండా ప్రయాణం చేస్తే పట్టుబడ్డప్పుడు లేదా పట్టుకోబడ్డప్పుడు పడే జరిమానా పదిరూపాయల నుంచి ఒక్కసారిగా అయిదురెట్లు పెంచారు. రైలుబండ్లు సాధారణంగా స్టేషన్లలోనే ఆగాలి. కానీ విద్యార్థులు, ఉద్యోగస్థులు, సీజన్ టిక్కెట్లు వున్నవారు, సీజన్‌టిక్కెట్లు వుండవలసిన వారు వీటిని వారి వారి అవసరాలను బట్టి 'గొలుసులు' లాగి ఎక్కవడితే అక్కడ ఆపి, దిగి చక్కాపోతుంటారు. గొలుసు లాగితే వెయ్యిరూపాయల జరిమానా లేదా యేడాది జైలుశిక్ష అంటోంది కొత్తచట్టం. రైలుబళ్లలో పందిరి మంచాలు కుక్కపిల్లలు కూడా తెచ్చుకొనే అమాయక ప్రయాణీకులు ఎప్పుడూ వుంటారు. నాటుబాంబులు, బరిసెలు, బాణాకర్రలు తెచ్చేవాళ్లు కూడా వుంటారు. ప్రమాదకరమైన వస్తువులు పట్టుకొని రైలెక్కేవారి మీద కొత్తచట్టం కఠినమైన శిక్షలు విధిస్తున్నది. ఇటువంటి వారికి, వారిని రైల్వేసిబ్బంది పట్టుకోగలిగినప్పుడు వెయ్యిరూపాయలు 'ఫైన్' విధించి మూడు సంవత్సరాల దాకా జైల్లో పెట్టమని నిర్దేశిస్తున్నది. కానీ వీరిని పట్టుకోగలిగేదెవరు? శిక్ష విధించే వారెవరు? అయితే కొత్తచట్టం రైలుబండ్లలో పొగ త్రాగడాన్ని, ముష్టివాళ్ల గానకచ్చేరీలని యింకా యిటువంటి 26 రకాల నీచమైన జాడ్యాలని గట్టిగా నిషేధిస్తూ కొత్తచట్టాన్ని చేసింది. రైల్వే రిజర్వేషన్ టిక్కెట్లలో జరుగుతున్న దగా, మోసం వీటిని అరికట్టడానికి కూడా జరిమానాల రేటుని దండిగా వడ్డిస్తోంది. కానీ 'కంచే చేను మేసే' మన దేశంలో కంచెను మాత్రమే పటిష్టంచేస్తే సత్ఫలితాలు అంతంతమాత్రంగానే వుంటాయని రైల్లో టిక్కెట్ లేకుండా ప్రయాణం చేయలేని పిరికివాళ్లు అనుకొంటారు. అలాగే "మామూళ్లరేటు" బాగా పెంచేసినందుకు యీ చట్టాన్ని అక్రమ ప్రయాణాలకలవాటుపడ్డ 'ధైర్యశాలురు' కూడా తిట్టుకుంటారు. ఏదియేమైనా కొత్తరైల్వే చట్టానికి స్వాగతం చెపుదాము! ○

# పెట్రోల్ పొదుపు



ప్రగతి అన్న మాటని మన పొలిటీషియన్స్ అరిగిపోయేలాగ వాడుతున్నప్పటికీ-దాని 'గతి' మాత్రం అధోముఖంలోనే వుంటుంది మనదేశంలో... చక్రాలకీ ప్రగతికీ అవినాభావ సంబంధం వుంది. చక్రం కనుక్కున్న తరువాతనే మన ప్రపంచంలో కదలిక సాధ్యం అయింది. మనుషులు-జంతువులు చక్రాలు త్రోసి త్రోసి - విసిగి యంత్రాలు వాటిని నడిపే రకరకాల యింధనాలు వచ్చాయి. పెట్రోలు సరుకులు మనిషి పరిశోధించి నేల నుంచి త్రవ్వుకున్న అపురూపమైన అమోఘమైన



"కాణాచి". కాని యివాళ దానికి బదులు మరో యింధనం కోసం మనిషి అన్వేషించే స్థితికి దాని అవసరాలు పెరిగి పోయాయి. భారతదేశంలో రత్నాలు దొరికేవిట-కాని యిప్పుడు 'గ్యాస్' బోలెడు ఉబికి ఉబికిపైకి ఎగసి వస్తున్నది-దానికి విరోధా భాసంగా, మనిషి నిత్యావసర వస్తువులలో ఒకటైన పెట్రోలు కొరత-అన్నిరకాల గవర్నమెంట్ లలోను, అన్ని ప్రణాళికా కాలాలలోనూ కూడా 'కామన్' అయిపోయింది!-

బియ్యం ధర పెంచి పొట్ట మీద, పోస్టల్ రేట్లు తెగపెంచి నెత్తి మీద, పెట్రోలు ధరలు విపరీతంగా పెంచి కాళ్ల మీద కొట్టిన వి.పి. సింగ్‌గారి గవర్నమెంట్ యిప్పుడు పెట్రోలు పొదుపుకి- "వార్ టైమ్" చిట్కాలు కొన్ని ప్రయోగించింది! ఇది ఎవరి బుర్రలో మెరిసిన మెరుపో కాని గొప్ప "ఛైల్డిష్" అయిడియా!-వెనకటికి సోమవారాలు రాత్రి హోటళ్లలో 'అన్నం' వండటం మానేశారు. అది మంచిపని-ఎందుకంటే సోమవారం నాటి 'అన్నం' ఆదివారంనాడే భుజించిపొట్టలో ఎవ్వడూ దాచుకోలేడు కనుక అది మంచి "శాస్త్రీయ"మైన పద్ధతి కాని పెట్రోలు ఆదివారం లీటర్ పట్టించాల్సిన అవసరం ఉన్నవాడు ఇప్పుడు శని వారమే రెండు లీటర్లు పట్టించి-పూటుగా దాచేస్తాడు-దెన్ వ్హాట్? బద్ధకస్తుడు ఆదివారంనాడు 'బ్లాక్'లో కొంటాడు-దీని కోసం కావాలంటే అప్పు చేస్తాడు-బంక్ బంకుకీ నిఘా వేసి- చెకింగ్ చేసి, ఈ అదనపు సిబ్బంది కోసం అదనంగా ప్రజాధనాన్ని వ్యయం చేసే బదులు-గవర్నమెంట్ మొదట ప్రభుత్వ వాహనాల వాడకం మీద 'నియంత్రణ' పెట్టి ఉంటే సరిపోయేది! టెలిఫోన్ రేట్లు పెంచడానికి ముందుగా టెలిఫోన్ డిపార్టుమెంటుల వాళ్లు చేసే దుర్వినియోగం మీద అడ్డుకట్ట కడితే అసలు టెలిఫోన్ వాడకందారుకి నామమాత్రపు బిల్లు మాత్రం పడుతుంది. కాని ప్రభుత్వం ఇలాంటి పనులు చేయదు-ప్రజల డబ్బుతో ప్రజల పేరిట ప్రజల్నే 'పిండు'కు తింటానంటుంది. అది ప్రజాస్వామ్యం! - కులం, మతం ఈ రెండు అంశాల మీద తప్ప-మరే అన్యాయం మీద కూడా ఈ దేశం



ప్రజలు నోరెత్తరు-చెయ్యి అసలే ఎత్తరు! బద్ధకస్తులు-అదే బుద్ధుడిదంతమో ప్రవక్త కేశమో, రాముడి జన్మభూమియో అయితే సై! రై!! అంటూ లేస్తారు-అంచేతనే పెట్రోలు మీద అదుపు-పెట్రోలు శకటాల ఉత్పత్తికి మదుపుగా ఉంది మన గవర్న మెంటు తీరు.

## స్థాయి ఏదైనా చర్చలు ముఖ్యం

పాకిస్తాన్‌లో శ్రీమతి బేనజీర్ పరిస్థితి పూగిసలాటలో ఉన్నందువల్ల-కాశ్మీర్ విషయంలో ఆమె సొంతంగా తీసుకోగల నిర్ణయం ఏమీ ఉండదు. కాశ్మీర్‌లో గవర్నర్లను మార్చిన వెంటనే వాన వెలసినట్లు టెర్రరిస్టు ఆగడాలు సమసిపోతాయనుకోవడంలోను అర్థం లేదు-అక్కడ ప్రజలలో భయమో-భక్తియో ఏదైతేనేం టెర్రరిస్టుల



పట్ల గాఢంగా నాటుకొని ఉన్నాయి. అది తొలగించకపోతే పరిస్థితులు ఎట్లా చక్కబడతాయి-మన దేశం వచ్చిన ప్రతి విదేశీ ప్రముఖునికి భాజాభజంత్రీలతో స్వాగత సత్కారాలు చేసి-ఆనక అతని చేత లేదా ఆమె చేత "సిమ్లా ఒప్పందపు పరిధి లోపల కాశ్మీర్ సమస్యను పరిష్కరించుకొంటే బాగుంటుంది" అని చిలకపలుకులు పలికించి వదిలిపెడుతున్నారు. ఈ "సిమ్లా ఒప్పందం" అనేదేమిటో దాని భావం ఏమిటో-దాని పరిధి ఏమిటో ఇన్ని సంవత్సరాల తర్వాత కాశ్మీర్ లోయలోని సామాన్యులకుగాని - స్వయంగా శ్రీమతి బెనజీర్ భుట్టోకిగాని-అవగాహన అవుతోందా? అని.

అటు పాకిస్తాన్ కూడా ప్రచార 'బాకా' గట్టిగానే ఊదుతున్నది. ఇటీవల ఇస్లాం దేశాలలో పర్యటించి పాకిస్తాన్ తొలి మహిళా (బహుశా చివరి మహిళ కూడా) ప్రధాన మంత్రి ఇండియా మీద దుమ్మెత్తిపోసింది. పాకిస్తాన్ విదేశాంగ మంత్రి షాహబ్జాదాఖాన్ యాకూబ్ గారు-ఐక్యరాజ్యసమితి భద్రతా మండలికి ఫిర్యాదు కూడా చేశారు. ఈ ఫిర్యాదు పత్రాన్ని-సభ్యత్వం గల దేశాలన్నింటికి పంపాలని ఆయన కోరిక-భారత దేశం దమననీతి ప్రయోగం చేస్తున్నదని పాకిస్తాన్ ఫిర్యాదు-కాశ్మీర్ సమస్య మీద ఇస్లాం దేశాలను ఒక 'ముఠా'గా చెయ్యాలని పాకిస్తాన్ ప్రయత్నం చేస్తున్నది-ఈ దశలో పాకిస్తాన్ ఏడు అంశాల ప్రతిపాదన ఒకదానిని తయారు చేసింది. ఈ రెండు దేశాల మధ్య ఉద్రిక్తత తగ్గించాలన్న ప్రయత్నంలో భాగంగానే-విదేశాంగశాఖ కార్యదర్శుల స్థాయిలో చర్చలు పెట్టుకుందామని పాకిస్తాన్ భారతదేశానికి సూచించింది. జూలై 14వ తేదీ తరువాత యీ 'ఇస్లామాబాద్'లో విదేశాంగ కార్యదర్శుల మధ్య సంభాషణలు జరగాలని పాకిస్తాన్ అడిగింది. కాశ్మీర్‌లో ప్రజల ఊచకోతని తగ్గించే ప్రయత్నంలో భాగంగానైతే దీన్ని మనం హర్షించవచ్చును గాని భారతదేశం పాకిస్తాన్ మనతో "యుద్ధానికి తలపడితే గుణపాఠం చెబుతాం" అంటుంది. తలపడటం అంటే పేరే శంఖాలు పూరించి బాజాలు వాయించి ఉండదు. కాశ్మీర్‌లోను, పంజాబ్‌లోను చేస్తున్నది పరోక్ష యుద్ధమే. పాకిస్తాన్‌ను నేరుగా యుద్ధంలో ఓడించడం కూడా దానికంటే అన్ని విధాలా బాగా బలమైన దేశానికి కూడా వెంటనే సాధ్యం కాదు- ఉదాహరణకి పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌లో సోవియట్ సేనలతో కూడా గెరిల్లా యుద్ధాలు చేసి నిలబడ్డది. అయితే భారతదేశానికి కలిగే నష్టం కన్నా మన దేశానికి యుద్ధం వస్తే చాలా ఎక్కువ నష్టం వస్తుంది అని బలాబలాలు బేరీజు వేసి చూస్తే తెలుస్తుంది. యుద్ధం ద్వారా చాలా కాలం పట్టే సమస్యని చర్చల ద్వారా కొంతయినా ఉపశమింప జేస్తే ఉభయతా రకంగా ఉంటుందని మధ్యవర్తి దేశాలు సూచించితే బాగుంటుంది కాని 'కాశ్మీర్' సమస్య మీద ప్రకటనలు జారీ చేసినంత మాత్రాన -అక్కడ రక్తపాతం ఆగదు. రక్తపాతం ఆపడానికి చర్చలలో షరతులు పెట్టుకోడమే మేలు-నిజానికి పాకిస్తాన్ సింధ్‌లో జరుగుతున్న అల్లర్ల మూలంగా భారతదేశంతో వెంటనే తలపడి తట్టుకోగల శక్తితో కూడా లేదు.

○




గూర్ఖాలకన్నా బాగా కాపలా కాస్తాయని పేరు బడ్డ కుక్కలు- పోలీసులకన్నా బాగా నేరస్థుల్ని పట్టుకోగలవు అన్న సత్యాన్ని కూడా అవి ఒక హంతకుణ్ణి పట్టుకోవడం ద్వారా ఋజువు చేశాయి.

న్యూఢిల్లీలో "కిషన్" అనే నాల్గవ తరగతి ఉద్యోగస్తుడు ఘోరమైన హత్యకు గురి అయినాడు. అతని నెత్తిమీద ఎవరో చావు దెబ్బ కొట్టారు. ..... కాని సాక్ష్యం చెప్పటానికి ఎవ్వరూ లేరు. కానీ ఢిల్లీ పోలీసుదళంలో రెండు శునకాలున్నాయి. వీటి పేర్లు "రెక్స్", "సిల్వర్". రత్తన్‌చంద్, గోవిందసింగ్‌లనే యిద్దరు కానిస్టేబుల్స్ వీటి సంరక్షణ చూస్తుంటారు. ఆ యిద్దరూ తీసుకొని రాగా, యీ శునకాలు- హత్య జరిగిన చోటుకు వచ్చాయి. హంతకుడ్ని, పరిసరాలనీ బాగా వాసన చూశాయి. నేరస్థుణ్ణి పసిగట్టడానికి సిద్ధమే అన్నట్లు పోలీసుల్ని లాక్కుంటూ ముందుకి బయలు దేరాయి. మొదట "సిల్వర్" ఒక్కటే దారి తీసింది కదా! అని "రెక్స్" ని వెనక్కిలాగి పట్టుకొని సిల్వర్‌ని ముందుకు పోనిచ్చారు. అది పోయి పోయి ఒక వీధి మలుపు తిరిగి- ఒక యింట్లోకి దూరింది. "చమన్‌లాల్" అనే వ్యక్తిని వాసన చూసి నేరస్థుడిగా పసిగట్టి మొరిగి- అతని చొక్కా పట్టుకొని పోలీసులకి అప్ప చెప్పింది. అటు తరువాత "రెక్స్" రంగంలోకి దిగింది- "రెక్స్" కూడా సిల్వర్ లాగే వెతుక్కుంటూ- వాసన చూసుకుంటూ ముందుకి పోయింది. కానీ యీసారి "చమన్‌లాల్"ని పోలీసులు పదిమంది మధ్య వరుసలో నిలబెట్టారు. అయినా రెక్స్ మొదట అతని ఇంట్లో దూరింది. తర్వాత అతణ్ణి గుంపు మధ్య నుంచి యివతలకి యీడ్చి మరీ అప్పగించింది. దీనితో "చమన్‌లాల్" కుప్పకూలిపోయి "నేనే బాబు హంతకుణ్ణి" అంటూ కథంతా చెప్పేశాడు.

1986-87 మధ్య గడచిన సంవత్సర కాలంలో ఢిల్లీ పోలీసు కుక్కలదళం కనీసం అంతుచిక్కకుండా వున్న 10 కేసులను పట్టుకొని పోలీసు బలగానికి సాయపడ్డాయి. కుక్కలు పసిగట్టిన 10 కేసులలో చాలా ముఖ్యమైనవి ఉన్నాయి. 1986 ఫిబ్రవరి 4వ తారీఖునాడు 'కొత్త సేమాపురి' అనే కాలనీలో పెద్ద దొంగతనం జరిగింది. పోలీసు కుక్కని తెచ్చారు. దొంగతనం జరిగిన గదిని అంతా వాసన చూశాక యీ కుక్క పోలీసు అధికారులని రెండు కిలోమీటరుల దూరం దాకా లాక్కొని వెళ్ళింది. అక్కడ ఒక ప్యాంటుని పట్టుకొంది. ఈ ప్యాంట్‌ని నోట కరుచుకొని మరో కిలోమీటర్ దూరం వెళ్ళిందాకుక్క. ఒక పాడుబడ్డ యింట్లోకి దారితీసి అక్కడ దొంగలు అందులో దాచిన నగలను బైటపెట్టింది.

అట్లాగే మరోసారి 'రెక్స్' మరో రెండు కుక్కలతో కలిసి మూడు కిలోమీటర్ల దూరం పారిపోయిన దొంగల జాడ పట్టుకొన్నాయి. అంతేకాదు- దొంగలు చంపి వదలిపోయిన ఒక నిర్భాగ్యుని శవం కూడా ఈ అన్వేషణలో దొరికింది.

1986 అక్టోబర్‌లో "షీరూ" అనే పోలీసు శునకం- సుమారు ఒక మైలుదూరం దాకా మనుషుల్ని లాక్కెళ్ళాక అతిదారుణమైన ఒక హత్యకేసుకు సంబంధించి ముగ్గురు హంతకుల్ని అరెస్టు చేయడానికి తగిన సాక్ష్యాధారాలు దొరికాయి. అట్లాగే "సిల్వర్" "ప్రిన్స్" అన్న కుక్కలు- దొంగలు పట్టుకుపోయి పాతిపెట్టిన నగలను మారుమూల ప్రాంతాల్ని వెతికి పట్టి నగలను నగదును త్రవ్వి బయటికి లాగి పోలీసులకి సాయపడ్డాయి. పోలీసులు మనుషులే- పోలీసు కుక్కలు కుక్కలే. అందువల్లనే పోలీసులనే మనుషులకన్నా కుక్కలయిన "షీరూ" "సిల్వర్" వగైరాలకి 30 వేల రెట్లు 'వాసన' పసిగట్టే ఘ్రాణేంద్రియ శక్తి వుంది. రెండోది వాటికి లంచాలు ముడుపులు దాచుకోవడానికి జేబులుండవు.

- వీర జైకిరణ్

# నడుం నొప్పి నుండి విముక్తి పొందండి. నిబ్బరంగా ముందుకు సాగండి.



స్త్రీ జీవితం అంటేనే సంతోషం, దాంతోటే బాధ కూడా... ఈ బాధలు ఒకటైతేనా. ప్రత్యేకించి వెన్నునొప్పి, పట్టుకుంటే వదలకుండా, పీడిస్తూ, విసుగెత్తిస్తూ ఉంటుంది. అది పురుడు పోసుకున్న తర్వాతేగానీ, లేదా ప్రతిరోజూ ఇంటి పనుల ఒత్తిడీ, శ్రమానేగానీ ధైర్యంగా ఉండండి. మీ అందుబాటులోనే నిజమైన ఉపశమనం ఉంది. ''మూవ్'' – దీనిలోని ప్రకృతి సహజమైన ఆవిరిగా మారే నూనెలూ, దాంతోబాటే మాన్పే గుణంగల కషాయాలూను, రాయగానే లోపలికి చొచ్చుకుపోయి, త్వరగా పనిచేసి, నిలిచి ఉండే ఉపశమనమూను దాంతో మీకిక. అవును, ఇది నిజంగా పనిచేస్తుంది. మీకోసం ఒక ట్యూబ్‌ని తెచ్చికోండి. వెన్నునొప్పి మర్చిపోండిక. నిబ్బరంగా ముందుకు సాగండి.






## మూవ్

**కీళ్ళ నొప్పుల నుంచి ఉపశమనం**

**సరియైన ఉపశమనం ఇచ్చే వాగ్దానం**

**శీతల వాయువు.చర్మం చిల్లులు పడేలా 'ఘూ'మని వీస్తోంది. ఆ సముద్రపు అలలకి అలుపు లేనట్లుగా ఇంకా ఆడుకుంటూనే ఉన్నాయి. కెరటాలు తనివి తీరా తీరాన్ని స్పర్శించలేక వచ్చిన క్షణానే వెనక్కి మరలి పోతున్నాయి.**

ఇంకా తెల తెలకవ కావడానికి మరో గంట సేపు పట్టొచ్చు. అక్కడి నుండి చూస్తే సముద్రం ఆకాశం ఒకేలా ఉండి కలిసి పోయినట్లుగా అగుపిస్తోంది. ఆ సముద్రపు ఒడ్డునే ఉన్న జాలర్ల తాళపూడిగూడెం ఇంకా నిద్ర ముసుగులోనే ఉంది.

కోళ్ళింకా కూయనే లేదు. కూర్మాడికి కునుకొగ్గేసినట్టుంది. ముసుగు తన్నిన దుప్పటి తీయబోయి, చేరువగా పడుకొని వున్న పెళ్ళాం ముఖాన్ని చూసాడు. చంద్ర బింబంలా ముద్దొస్తోంది. దగ్గరగా కళ్ళు పెట్టి చూసాడు కూర్మాడు. తన దుప్పటి తీసి ఆమె ఒళ్ళంతా జాగ్రత్తగా కప్పాడు.

తరువాత పాకలోంచి పైకొచ్చి ఆకాశం వంక చూసాడు. పంచె బిగించి, గళ్ళ లాల్చీ తొడుక్కొని తలకి పాగా చుట్టాడు. మూలన పడి వున్న వలను, బుట్టను పట్టుకొని తలుపు దగ్గరగా చేరవేసి పైకొచ్చాడు.

"ఒరే సింగన్నా, రామిగా... రండి రా తెల్లారిపోతంది" అంటూ పక్క గూడు తలుపు తట్టేడు కూర్మాడు.

"సలేత్తందోరి కాసేపు పోని" లోపలి నుండి కంఠం వినిపించింది.

"అనాగే పడుకో మా సెల్లిలు తెగిసి నాలుగొడ్డిస్తే..." తలుపు దగ్గర నిలబడి పెద్దగొంతుకతోనే అరిచాడు కూర్మాడు.

"వచ్చినపుడు దీపం బుడ్డి అట్టుకురండి... మర్సిపోకురో రామిగా" అంటూ మరో కేకేసి కూర్మాడు ఒడ్డు దాటి తీరం చేరుకున్నాడు.

పాకలో పడుకున్న పశువుల మందలా ఉన్నాయక్కడి పడవలు. ఇసుకలో పాతిన కొయ్యలకి చేంతాళ్ళతో కట్టబడి ఉన్నాయవి. ఒక పడవ పక్కన మరో పడవ ఉండి డెబ్బై పడవల దాకా ఉంటాయి. తాళపూడి గూడెం జాలర్లకి ఆ పడవలే దేవతలు. వాటి మీద పొద్దుటనగా పోయి పడ్డ చేపల్ని బట్టి పొద్దుగూకే లోగా ఇళ్ళు చేరుకుంటారు. మగాడి లాగే ఆడాళ్ళు కూడా కష్టపడతారు. ఇంటి దగ్గర పిల్లలు ఇష్టమయితే



# తుఫాను వెలిసింది

## బమ్మిడి జగదీశ్వర రావు

పారుగూరు బడికెళ్తారు. లేదంటే ఇరుగూపొరుగుతో ఆడుకొని గిల్లి, కజ్జాలు తెచ్చి పెట్టుకుంటారు. పడవ దిగిన వెంటనే ఆ పిల్లలు ఫిర్యాదులు చేస్తారు. చేపలు పడి మనసు బాగుంటే ముద్దులాడుతారు- అలా గాని కాకపోతే వాళ్ల వీపులు చీరేస్తారు ఆ తలిదండ్రులు.

కూర్మాడు పడవల్ని మామూలుగా దాటేసి తీరాన్నే నిలుచున్నాడు. అతని కళ్ళలో గంగమ్మ తల్లి. మనస్సులోనే నమస్కారం చేసాడు. ఒక కెరటం అతని పాదాల్ని కడిగేసింది. తీరం దాటి మళ్ళీ ఇవతలకి వచ్చి గూడెం దిశ వేపుగా చూసాడు. ఎవరూ వస్తున్న జాడ కనిపించలేదు. ఇంకా రాకపోయి నందుకు పైకే తిట్టుకున్నాడు.

కూర్మాడు తన పడవను సమీపించాడు. కొయ్యకు కలిపి కట్టబడిన త్రాడు విప్పేడు. పడవ ఓ చివర పట్టుకొని సులువుగా లాగాడు. ఇన్నాళ్ళంత భారం అనిపించలేదు. ఆశ్చర్యం వేసింది. పడవ వేపు పూర్తిగా చూడకుండానే మరికొంచెం ముందుకు జరిపాడు. పడవ అతిసులువుగా జరుగుతోంది. అంతలోనే నీట మునుగుతున్నట్లనిపించి తృళ్లి పడ్డాడు కూర్మాడు.

అప్పుడు పడవ వేపు చూపు సారించాడు. ఆ మసక వెలుతురులో పడవ రెండు భాగాలయినట్లు అస్పష్టంగా కనిపిస్తోంది. గుండె ఆగినంత పనయింది కూర్మాడిక. 'ఓరి దేవుడో' అసంకల్పితంగా ఆర్తిగా మాట వచ్చింది. తన చేతులతో పడవ చెక్కలను తడిమి చూసాడు. అనుమానం లేదు.

అదే సమాయాన సింగన్న వాడి వెనకాలే రామిగాడు వచ్చారు. ఇద్దరి చేతుల్లో రెండు లాంతర్లు ఉన్నాయి.

"ఒరే కూర్మాడా ఏటి సేత్తున్నావు" అంటూనే ఇద్దరూ కూర్మాడిని సమీపిస్తూ పడవలను చూసారు. కూర్మాడి పడవే కాదు ఆస్తి పడవలు రెండు ముక్కలుగా కోసేసి ఉన్నాయి.

వారి ముగ్గురి నోళ్ళూ పెగల లేదు. మాటలు రాని మూగ వాళ్ళయి పోయారు. భూమి ఆకాశం తలక్రిందు లయిపోయినట్లని పిస్తోంది.

కాళ్లను తాకిన నీళ్ళు కాల సర్పమై కాటు వేసినట్లుగా కళ్ళు తిరిగి గుండెలు నీటయి వారిపోతున్నాయి. ఎన్నో క్షణాల నిశ్శబ్దం.

అనంతరం రామిగాడు లాంతరు వెలుగులో మరోసారి పడవల్ని పరిశీలించాడు. నిజమే! కలకాదు కదా! అంటూ తన చర్మాన్ని తానే గిల్లుకున్నాడు.

ఇంతలో గూడెం నిద్ర వదలి ఒళ్ళు విరుచుకుంటోందేమో జాలర్లు లేగిసినట్లున్నారు. కుప్ప కూలిపోయిన కూర్మాడు, సింగన్న, రామిగాడు అక్కడే లాంతర్లు వదిలి కేకలతో గూడెంకు పరిగెత్తారు.

"మ.... మన... పడవల్ని కోసేసిన్రు."

"అవును. మద్దికి రెండు ముక్కల్లాగ కోసేసి న్రోరి నాయనలారా"

"సూసేసరికే ఎవడో మన బతుకుల్ని నరికింర్రు!"

ఆయాస పడిపోతూ చెప్పారు ముగ్గురూ. మళ్ళీ ఆ ముగ్గురూ పడవల దగ్గరకు పరుగు తీసారు. వాళ్ళ వెనుకే గూడెం మిగతా జాలర్లంతా పరుగు తీసారు. చిన్నా పెద్దా, ముసలీ ముతకా, ఆడా మగా అందరూ అక్కడికి చేరుకున్నారు.

అప్పుడే తెల తెలవారు తూండడంతో ఆ పల్చని వెలుగులో కోసేసిన పడవ ముక్కలను చూసి విలవిల్లాడి పోయారు.

"ఓలమ్మో.... మా బతుకులు బుగ్గి సేసేసిన్రు.... మా బతుకులు కాల్సేసిన్రు.... మే మెవళకి ఏమపకారం తలపెట్టినామని? ఓరి దేవుడో నువ్వు ఏటిసేస్తున్నావయ్యా? కళ్ళు లేవా?... నీ కళ్ళు గప్పి ఏ నా కొడుకులు దొంగ బాడుకావులు... ఆల్బిమ్మలు బడిపోను... ఆళ బుర్రలు బద్దలయిపోను... ఎంత పని సేసారు...."

శోకం సంద్రమే అయింది. వారి తిట్లు తూటాలే అయ్యాయి. వాళ్ళంతా శాపనార్థాలే పెట్టారు. నోళ్ళు పీకి పోయాయి. గుండెలవిసి పోయాయి. కన్నీళ్ళింకి పోయాయి. వాళ్ళ రోదనలు మధ్యాహ్నం వేళకు మసి బారిపోయినా గుండెలు మండుతూనే ఉన్నాయి. కళ్ళు చింతనిప్పులయి ఉన్నాయి.

ఆ రోజు గూడెమంతా కలసి పిల్లా పిచ్చుకని లేకుండా అంతా ఆకలితో అలమటించారు.

అలజొద్దేళకి పారుగూరి నుండి ప్రెసిడెంటు, విలేజ్ డెవలప్మెంటు ఆఫీసరు ఇంకా పెద్దలంతా వచ్చి పరామర్శించారు. తమ సానుభూతిని పత్రికల ద్వారా రేడియోల ద్వారా తెలియ జేసారు. గ్లిజరిన్ లేకుండానే రెండు కన్నీటి చుక్కలు రాల్చి 'ప్రభుత్వాన్ని అర్థిద్దాం' అంటూ పోబోయారు.

"ఎవడు చేసాడో ఆడు కూడుకీ గుడ్డకీ దూరమైపోడూ బాబూ" అంది ఓ ముసలమ్మ వారికి వినపడేటట్లుగ.

"ఎందుకు తిడతావ్! ఎవడో కావాలని మీ గూడెవోళ్ళే చేసిన పని ఇది. ఎక్కడి నుండి ఎవడో వచ్చి ఆ పని చేస్తే వాడి కేమిటి లాభం?" ప్రెసిడెంటు అడుగులు వెయ్యడం ఆపి అన్నాడు.

"లాభం... హుం... మా పొట్ట కొట్టడం పల్ల

అళ్ళకేం లాభం లేదు. కాపోతే మా గూడెపోళ్ళు సేసారంతే నమ్మను. ఎవడి కడుపు మీద ఆడే కాల్చుకుంటాడా? అన్ని పడవలూ కోసేసిరుగదా" జవాబిచ్చారు కూర్మాడు.

"అదే మీ తెలివితక్కువ తనం. కాపోతే ఏంటి? ఒక పగవాడింటికి నిప్పు పెట్టాలంటే మొత్తం వీధే తగుల బెట్టాలన్నట్టు ఒకడి పడవే కోస్తే అనుమాన మొస్తుందని అంతమందివీ కోసేసుంటారు. అందులో ఆ కోసినోడిది కూడా ఉండొచ్చు" మధ్యలో అందుకున్నాడు విలేజసిస్టెంట్.

"ఏటి బావు మాకేటి అర్థం కాడంలేదు" ఓ ముసలి తాత పైకే అనేసాడు.

"ఇప్పుడు ఏది కారణ మన్నది కాదు ప్రశ్న! వెంటనే ప్రభుత్వానికో అభ్యర్థన పత్రం పంపించాలి. వీలుంటే కొంత డబ్బున్నా ఖర్చు పెట్టి తొందరగా మర పడవల్ని తెప్పించు కోవాలి" విలేజ్ డవలప్‌మెంటాఫీసర్ బుచ్చి రామయ్య అన్నాడు.

కొంత సేపటికి ఆ అతిరథ మహారథులంతా వెళ్ళిపోయారు. నేలకు కూలబడి పోయిన సైనికుల్లా ఆ జాలర్లంతా చలనం కోల్పోయినట్టయి పోయారు.

"రేపటి నుండి తాము ఏం చేయాలి? ఎలా బ్రతకాలి?" అంతే ఆ ఆలోచనతో భవిష్యత్ అంధకారమే ననిపిస్తుంటే- ఇళ్ళు కాలిపోయిన బాధితుల్లా సముద్రపొడ్డునే జాగరాలు చేసారు.

తెల్లవారింది. ఆకలి ఆకాశమంత ఎత్తు కెదిగిపోయి వారి పొట్టల్లో ఒదిగి పోయింది. పసి పిల్లలు తట్టుకోలేక పోయారు. ఏడుపులూ గోల ఒకటే రద్ధాంతం చేసేస్తుంటే చిటపట లాడుతూ రెండు దెబ్బలు వేసి, చివరికి విసిగి అన్నం వండారు ఆ ఆడాళ్ళు.

"ఎవరు చేసిన పనిది?" అని ఆలోచిస్తూనే ఉన్నారు మరి కొందరు.

# తుఫాన్ వెలిసింది

కూర్మాడు, సింగన్నా రామిగాడులతో పాటు మరో అయిదారుగురు కలసి పొరుగూరులో ఉన్న పంచాయితీ ఆఫీసు దగ్గరకు వెళ్ళారు. సూర్యుడు నడినెత్తిన ఎక్కుతున్నాడనగా ప్రెసిడెంటు, విలేజసిస్టెంటు, ఎగ్జిక్యూటీవ్ అంతా నవ్వుకుంటూ వస్తున్నారు.

అక్కడే చెట్టు నీడన కూర్చున్న జాలర్లంతా గౌరవప్రదమైన భక్తి భావంతో లేచి నిలుచున్నారు.

"దండాలండీ" అంతా నమస్కారం చేసారు.

"నమస్కారం..." అంటూ క్షణమైనా ఆగక ఆఫీసు గదుల్లోకి దూరారు. ఏదో చెప్పాలనుకున్న వాళ్ళంతా చల్లబడి పోయారు. పైకి మరల వస్తే చెపుదామని నిరీక్షిస్తూనేఉన్నారు.

సమయం మధ్యాహ్నం ఒంటి గంట దాటింది.

ఇంతలో ప్యూన్ బయటకు వస్తుంటే నమస్కారాలు చేస్తూ వాడి చుట్టు ముట్టారు కూర్మాడి బృందం. ఆఫీసరు ఠీవిలో ముఖం పెట్టి 'ఏంటి' ఛీదరంగా అన్నడా ప్యూన్.'

'మరి ప్రెసిడెంటు బావు...' రామిగాడన్నాడు.

"కలవాల్నా" అడిగాడు ప్యూన్.

అవునన్నట్టు తల ఊపారంతా.

"ఇప్పుడు కుదర్దు. ఇది భోజనాల టైమ్. లంచవర్ తెలుసునా. ఏలాపాలా లేదేటి. సాయంత్రం నాలుగ్గంటలకయితే ఖాళీగా ఉంటారు" చెప్పి వెళ్ళిపోయాడు ప్యూన్.

"ఆకలేస్తుంది. మరేటి గూడేనికి ఎళ్దాం? సోడా తాగుదాం రండి." కూర్మాడి మాటతో అంత అక్కడినుండి కదిలి రోడ్డు వారగా ఉన్న బడ్డీకొట్టు దగ్గరకు చేరుకున్నారు.

మనిషి ఒక్కో సోడా, రెండేసి అరటి పళ్ళు తిని ఆకలి తీరిపోయినట్టుగా త్రేన్చారు. మళ్ళీ అక్కడినుండి పంచాయితీ ఆఫీసు దగ్గరకు చేరుకొని చెట్టు నీడన కూర్చు...

"ఒరే సింగా, ఆ బావులన్నట్టు మన పడవల్ని మనూరోల్లు కొయ్యరుగానీ నాదొక అనుమానం..." అంటూ విషయం కదిపి ఆగిపోయాడు రామిగాడు.

"ఏటి అనుమానం... కూర్మాడు అడిగేడు,

"మన పొరుగూరు లంక పేటలోని ఇళ్ళు రెండు దపాలు తగలబడిపోయినాయికదా..." చెప్ప బోయాడు రామిగాడు.

"అవును. అయితే ఏం" ఆతృతగా అడిగాడు సింగన్న.

"ఆ రెండు దపాలూ తగలడిపోయినప్పుడు ఎవరు సేసారంతే ఎవరు సేసారంటూ అంతా అనుకున్నారు. అప్పుడు మనూరోళ్ళమే పడక, అగ్గి ఎట్టేసామని కూడా అన్నారు. అదెవుడు సేసినాడో గాని మనమీదే అనుమానంతో ఇప్పుడు పడవలు..." రామిగాడి మాట పుర్తి కాలేదు.

"సేసె వల్లకో అదేం మాట... అంత నీఛానికి ఎవడూ ఒడిగట్టకోడు. అళ్ళూ మనలాగ కష్టపడి బతికేనోళ్ళే" ఓ ముసలి తాత అన్నాడు.

"అదికాదు... అప్పుడు ఇల్లు తగలడిపోతే మనమే తగలెట్టేసామనీ అన్నారు. లేదు. ఎవుడో సెడుపు పెట్టేసాడనీ అన్నారు. సివరకి పట్నం పెద్దలెవరో సముద్ర పొడ్డున ఒటేలు కట్టడానికి ఇల్లు పీకించడానికి ఆ నాటక మాడినారని తెలిసింది కదా. అది లోక మెరిగిన సత్తెం" అన్నాడు కూర్మాడు.

"నిజమే. ఛ అది లంకపేటోళ్ళ పనికాదు. ఈసారి మనమీద కూడా ఎవడో లాభమాసించే చేసుంతారు" సింగన్న అన్నాడు.

"ఏటో భగవంతుడికే ఎరిక" మరో నడి వయసుక్కుడు అన్నాడు.

అలా వారి మాటలమధ్య కాలం కరిగిపోయింది. సాయంత్రము కావస్తుందనగా పెద్దలూ, అధికార్లూ ఆఫీసులో నుండి పైకి వచ్చారు. కూర్మాడి బృందం లేచి వారి వేపుగా చేతులు నలుపుకుంటూ వెళ్ళి నిలపడ్డారు.

"రేపు రండి" అనేసి అధికారదర్పంతో వెళ్ళి పోయారు ఆ పెత్తందార్లు. నిరాశతో కాళ్ళీడ్చు కుంటూ జాలరిపేట చేరుకున్నారు జాలర్లు. "లమ్డీ కొడుకులు ఇంతదాక ఉంచి పొమ్మన్నారు" పైకే తిట్టేసాడు రామిగాడు.

అలా పది రోజులుగా తిరుగుతూనే ఉన్నారు. ఇళ్ళలోని సరుకులంతా అయిపోయింది. మరో వారంలో గిన్నీ ముంతా అమ్మితేకాని కడుపు నిండని పరిస్థితులు అలముకున్నాయి. పడవలు లేకపోవ టముతో చెయ్యి కాల్చుకున్నట్టయింది. కొందరు కూలి పనులకి పొరుగూరు పయనమయ్యారు.

"ఎప్పుడొస్తాయి" ఆగలేక అడిగేసాడు కూర్మాడు ప్రెసిడెంటుని.

## శ్రీ బమ్మిడి జగదీశ్వరరావు

'తుఫాన్ వెలిసింది' కథానిక రచయిత శ్రీ బమ్మిడి జగదీశ్వరరావు వయస్సు 24 సంవత్సరాలు. వీరు తనను పరిచయం చేసుకుంటూ-

"నేను కలం పట్టి 8 ఏళ్లు అయినా అనుకున్నది సాధించలేకపోయానే అనే వ్యథ నను చుకుని ప్రయత్నిస్తూనే వున్నాను. ఇప్పటి వరకు సంఖ్యకు మించి వ్రాసిన చిన్నా, పెద్దా ప్రచురణ, ప్రసారం కలిపి 27 కవితలు, 16 కథలు, ఓ నాటిక, కొన్ని జోక్సు, మరి కొన్ని వ్యాసాలు వెలుగు చూసాయి. ప్రముఖ పత్రికలలో మరికొన్ని కథలు రానున్నాయి. శ్రీశ్రీ, చెరబండరాజు నా అభిమానులు. వాస్తవికత, ప్రయోజనం రచనలంటే యిష్టం. నా ఆదర్శబాట అంధకారం అలముకున్నా అభ్యుదయం వేపు అడుగులు తడబడకుండానే వేస్తున్నాను.



వృత్తి విద్య మోటారు మెకానిక్, డిగ్రీ ప్రైవేటుగా చేస్తున్నాను.

నా మొదటి కథ 'బాలరంజని'లో రావడం, మొదటి బహుమతి కూడా ఆంధ్రపత్రిక ద్వారా రావడంతో పత్రికకి ఋణపడి ఉన్నాను. నన్ను ప్రోత్సహించే మిత్రులకు, బహుమతి నిచ్చి బాధ్యత పెంచిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక-టానా వారికి కృతజ్ఞతలు అంటున్నారు.

"మనిషో రొండొందలెక్క పట్టుకు రండి. డబ్బుతోనే పని. లేకపోతే పై ఆఫీసుల్లో ఫైళ్ళు కదలవు. మీ ఇష్టం. రొండందలు సూసుకుంటే సంవత్సరమైనా ఇంకా ఇదిగో ఇచ్చేస్తాం అదిగో ఇచ్చేస్తాం అంటారేగానీ, మన చేతికి రావు" చెప్పాడు ప్రెసిడెంటు.

"మీ ఇష్టం. లోకమంతా జరుగుతున్నదే. డబ్బు లేనిదే ఏ పనీ కాదు. తరువాతొచ్చి కాళ్ళవేళ్ళ పడితే మేమేం చెయ్యలేం" విలేజసిస్టెంటు అన్నాడు.

"ఇప్పుడంత డబ్బు ఎలా తేగలం" అన్నాడు సింగన్న.

"దానికి మేమేం చెపుతాం" వీడీవో అన్నాడు.

"ఎలాగో చేసి తెస్తాం" రామిగాడు అన్నాడు.

"చూడండి. అందరి డబ్బులు అయిందాక చూడొద్దు. ఎవరి దగ్గర ముందుంటే వాళ్ళు క్కక్కల్లా తెచ్చి ఇచ్చేయండి. వారం రోజుల్లో చూడండి" చెప్పాడు విలేజసిస్టెంటు.

వస్తాం బావులూ అంటూ మరోసారి చేతులు జోడించి దండాలు పెట్టి తిరుగుముఖం పట్టారు.

"అంత డబ్బు వారంలో ఎలా సంపాదిస్తాం. ఒట్టప్పుడులాగ ఇప్పుడు పడవాలేదు. కష్టపడినా కూలి డబ్బులు ఆరోజు గెంజికే సరిపోతున్నాయి" అన్నాడు బాధగా కూర్మాడు.

"ఏదో అమ్మి! ఏదో చేసి ముందు డబ్బులు కడితే పడవలొచ్చాక తీర్చేసికోవచ్చు" రామిగాడన్నాడు.

జాలర్లంతా ఇళ్ళలో డబ్బులు కోసం ఏమి చేయాలా? అని మెదడు తీగలు తెగిపోయేలా ఆలోచిస్తున్నారు. గూడెమంతా ఒక్కలాటిదే. ఒకడి కొకడు అప్పిచ్చేవాడెవడూ ఉండడు. ఉన్న ఒక్క కోమిటి బడ్డీ వోడు అంతమందికీ ఎలా అప్పిస్తాడు. సామానులు తనకా పెట్టాలి. కొన చెవ్వులు. అడ్డు గమ్మిలు... కడియాలు.. బేసర్లు... ఒకటేమిటి ఎవరి దగ్గరున్నవి వాళ్ళు పట్నం పోయి అమ్మేసి డబ్బులు జమచేయడానికి అల్లుకుల్లాలయి పోతున్నారు.

ఇక్కడ – ప్రెసిడెంటు, విలేజసిస్టెంటు, వీడీవో లెక్కలు వేసుకుంటున్నారు. డెబ్బై అయిదు మందికిస్తే పదిహేను వేల దాకావస్తాయి. అంటే ముగ్గురికి వాటాలు వేస్తే అయిదు వేలు చొప్పున వస్తాయి. అయిదువేలు చాలా చిన్న మొత్తంలా కనిపించింది వారికళ్ళకు. రేటు పెంచితే ఆలోచిస్తున్నారు.

"ఎవరు ముందిస్తే, ఎక్కువ ఇవ్వజూపితే వారికే ముందర ఇస్తామని చెపుదాం" వీడీవో అన్నాడు.

"అందరూ గొత్తితోక బెత్తుడుగాళ్ళే" అన్నాడు ప్రెసిడెంటు.

"ఈ సారికి అడ్జెస్టు అవుదాం. అయినా ఒట్టిపోయిన గేదె సూలుతో ఉన్నట్లయింది. అందుకు మనం సంతోషించాలి. ఎందుకంటే అప్పుడు పడవలు పంపిణీ చేసినప్పుడు సాంఘిక సంక్షేమ మంత్రిదగ్గరుండి మరీ అంతా చూసుకున్నారు. మనకేమి ముట్టలేదు. అప్పుడు ఎంతో బాధ పడిపోయాం. అది పూడ్చుకోవడానికే ప్లాన్ చేసి రాత్రికి రాత్రే రంపాలతో మనోళ్ళని, ము తాని తెచ్చి కోయించేసాం. ఇప్పుడు ఆ జాలర్లంతా మన కాళ్ళ చుట్టూ కుక్కల్లా తిరుగుతున్నారు. మన ప్రయత్నం ఫలించింది...." గతాన్ని గుర్తు చేసాడు వీడీవో.



## పాపం, చుంకీపాండే!

నటుడు చుంకీపాండే ఫైట్ సీనులలో కూడ డూప్ లేకుండా నటించి మంచి గుర్తింపు తెచ్చుకోవాలని ఆశ. ఒకసారి పోలీస్‌వాలా షూటింగ్‌లో సోనమ్ తను క్రొత్తగా నేర్చుకున్న కరాటే కిక్ చుంకీకి రుచి చూపించేసరికి, సెట్స్ నుండి నేరుగా వచ్చి హాస్పిటల్లో పడ్డారు. ఈ మధ్య తీరికగావున్న ఒక ఆదివారం సాయంత్రం చక్కగా, సరదాగా బొంబాయి వీధుల్లో చక్కర్లు కొడుతున్న చుంకీకి ఒక చిన్నది కనిపించింది. పాపం ఆమె కొరకరాని కొయ్య అని తెలీక వెంటబడితే చూసి చూసి ఆమె చుంకీని పొత్తి కడుపులో ఒక్క తన్ను తన్నింది. దాంతో చుంకీ మళ్ళీ హాస్పిటల్లో చేరాల్సొచ్చింది.

ఆ నిజం తెలియని జాలర్లంతా జానెడు పొట్టకోసం జాము రాత్రులూ కష్టపడుతున్నారు.

కాలం గడుస్తోంది.

చిల్లి గవ్వ వుంచుకోకుండా చెల్లుబడి అయిన ప్రతీది అమ్మేసో తనకాకు పెట్టో చాల మంది జాలర్లు డబ్బులు కట్టేస్తున్నారు.

కూర్మాడు భార్యతో కూలి చేయటానికి పొరుగూరు వెళ్ళిపోతున్నాడు. సింగన్న కూడా వెళ్ళిపోతున్నాడు. ఆ కూలి డబ్బులు కూటికీ, కూరకే కటిమిటీ అవుతున్నాయి. అమ్మోరికి మొక్కుకున్నారు. కోడి కోస్తామన్నారు. ఆడాళ్ళు చీరలు చూపిస్తామని మొక్కుకున్నారు.

రామిగాడు మాత్రం పాత పడవ నొకదానికి ఒడ్డునే కూర్చొని మరమ్మత్తు చేస్తున్నాడు. నాలుగయిదు రోజులుగా అదే పని చేస్తున్న రామిగాణ్ని అతడి భార్య పనికి మాలిన పని అని తిట్టిపోసింది. కాని చెవిటి వాడి ముందు శంఖం ఊదినట్లే అయింది. అతడు తన పనిని మాత్రం విరమించుకోలేదు. ఊరివాళ్ళు చెప్పి చూసారు, లాభం లేదు. పట్టిన పట్టు వదల లేదు.

మరో వారంలో పడవ పని పూర్తయింది. రామిగాడు ఆనందంగా ఉక్కిరి బిక్కిరయి పోయాడు. భార్య వంక గర్వంగా చూసాడు. మొదటిసారిగా పడవేసి సాయంత్రానికి బాగానే చేపలు పట్టి తెచ్చాడు. ఊరంతా రామిగాడి విషయమే ఊసులాడు కున్నారు. కూర్మాడు అభినందించాడు. రామిగాడు మొదటి దఫా తెచ్చిన చేపల్ని వాడంతా పంచి పెట్టాడు. అప్పటికి నెల రోజులుగా లేని చేపల పులుసు వారి నాలుకల మీద జిమ్మ గట్టి నర్తించింది.

రామిగాడు నాలుగు రోజుల్లో కొత్త పడవకి డబ్బులు కట్టేసాడు. పైగా ఇద్దరి ముగ్గురికి డబ్బులు సర్దాడు. రామిగాణ్ని భార్య మెచ్చుకుంది. రామిగాణ్ని చూసి ఒకరిద్దరు పాత పడవల మరమ్మత్తు చేపట్టారు.

ఎప్పటి లాగే రామిగాడు తృప్తిగా పడవేసాడు. వాతావరణం కూడా ప్రశాంతంగా ఉంది. ఆటు పోటులు ఎక్కువగా లేవు. చేపలు సముద్రం లోపలకి పోయేకొలదీ బాగా పడుతున్నాయి. తెచ్చిన బుట్టలు నిండిపోయాయి. రామిగాడు మనసు మయారమే అయింది. పెళ్ళానికి చీర కొనాలనుకున్నాడు. పిల్లలకి పండుగొస్తుంది. బట్టలు తీయాలను కున్నాడు. ఎన్నో ఊహలు ఉవ్వెత్తున లిగుస్తుంటే పడవ లోతుకు పోయినట్లుగా, దిగబడి పోతున్నట్లుగా ఆలస్యంగా గ్రహించాడు.

రామిగాడికి భయంతో నోట మాట రాలేదు. 'అమ్మా' అని భయంతో వేసిన కేక భస్మీపటలమే అయింది. పడవ మునిగి పోయింది. బుట్టలోని చేపలు ఆనందంగా బయట పడ్డాయి. స్వేచ్ఛగా పరుగులు తీసాయి. వల తేలిపోయింది. కొద్ది క్షణాల్లోనే రామిగాడు బలంగా నీటిపైకి వచ్చి ఈదుతూ తేలియాడాడు. కళ్ళముందు ఆశ కుప్ప కూలి పోతుంటే కన్నీళ్ళు కక్కుకున్నాడు.

ఇంతలో పడవ చెక్కముక్కలు రెండు తేలాయి. దాన్ని అందుకో బోయాడు. నీటి వాటానికి అది పరుగు తీస్తుంటి బలంగా ఈదుతూ ఓ చెక్క బల్లని అందుకున్నాడు. దానితో ఒడ్డు చేరాలన్న ఆశ ఎంతో సేపు ఫలించలేదు.

కారణం ఆ చెక్క బల్ల బాగా మునిరిపోయి

ఉండదం. అందువల్ల నీట్లో నానడం చేత బరువు పడి వెంటనే మునిగిపోతూ ముక్కలు ముక్కలుగా రేగి పోయింది. ఆ మునిగిపోవడం వల్లే పడవ మునిగి పోయిందని రామిగాడు గ్రహించాడు. అంతే ఇంక ఒక్క క్షణం వృథా చెయ్యకుండా శక్తి నంతటినీ కూడదీసుకొని ఈదటం మొదలు పెట్టాడు. కాని దిక్కులు తెలియడం లేదు. మొండి ధైర్యంతో అలా చాలాసేపు ఈదాడు.

అప్పటికే చీకట్లు ముసురుకోవటం వల్ల, అలసిపోయిన శరీరం నీరసంతో సహకరించక పోవడం వల్ల ఈదటం రామిగాడికి చాలా కష్టమయ్యింది. అయినా ప్రయత్నిస్తున్నాడు. కాని ఆ ప్రయత్నం వృథా అయింది. కళ్ళు తిరిగి పోయాయి. శక్తి చాలలేదు. దాంతో నీళ్ళు తాగేసాడు. ఈదలేక పోయాడు. అంతే.... ఆక్షణంలో గంగ తల్లి తనలోకి ఇముడ్చుకుంది.

రోజంతా రాకపోయే సరికి రామిగాడి భార్య లబోదిబో మంది. పిల్లలు తల్లిని చూచి ఏడ్చారు. ధైర్యం చెప్పిన వాళ్ళు కూడా రామిగాడు కోసం లోలోపల భయపడ్డారు. పడవేసుకు వెళదామంటే ఇంకా రాలేదన్నారు ఆ ప్రెసిడెంటు వాళ్ళు.

రెండ్రోజులు.... మూడ్రోజులు గడచినై.

చేపలు తినేసి గుర్తు పట్టలేని ఉబ్బిపోయిన శవం రెండూర్లవతల ఒడ్డు చేరిందని తెలిసి వెళ్ళి చూసారు. కాని రామిగాడు కాదని వదిలేసారు. అయితే... అవతల రెండ్రోజులు పోయాక పడవ చెక్క ముక్కలూ, వలా తనలోనే దాచుకోకుండా సముద్రం రామిగాడి ఆధారాలని' వాటిని సాక్ష్యంగా చూపింది. అప్పుడంతా గొల్లుమన్నారు.

రామిగాడి భార్య పిచ్చిదానిలా సముద్రపు ఒడ్డున కూర్చొని భర్త కోసం ఎదురు చూస్తూనే ఉంది.

మళ్ళీ పరామర్శించి వెళ్ళిపోయారా అధికార్లు.... పెత్తందార్లు, అజాగ్రత్త వల్లే జరిగిందని' చెప్పి మరీ వెళ్ళారు.

కాలం కరుగుతూనే ఉంది రోజులు గడుస్తూనే

## తుఫాన్ వెలిసింది

ఉన్నాయి.

అప్పటికి మరో రెండు నెలలు పోయాక పడవలు పంచిపెట్టారు. జాలరిపేటంతా ఆనందం నిండిపోయింది.

"అయితే మీ రిచ్చిన డబ్బు సరిపోలేదు మరో పందేసి పట్టుకురండి" అని ప్రెసిడెంటు, విలేజసిస్టెంటు, వీడీవో చెప్పారు. ఆనందంలో అలాగే అంటూ తలలాడించారా జాలర్లంతా. కాని జలగల్లా తమ రక్తాన్ని పీల్చుకు తింటున్నారని వారు గ్రహించలేదు. గ్రహించిన ఒకరిద్దరు అన్నా గూడెపు ముసలి పెద్దలు వాళ్ళను ముందుకు కదలనివ్వ లేదు సరికదా, మాట విప్పనివ్వ లేదు. భగవంతుడే ఉన్నాడని అన్నారు.

మంచిరోజు చూసుకొని పడవలేసారు.

రెండ్రోజులు గడిచిందో లేదో వాతావరణం మారిపోయింది. ప్రకృతి పురి విప్పినట్లుంది. గాలీ వాన చిన్నగానే మొదలయ్యాయి.

అంతలోనే ఆకాశవాణి 'తుఫాన్' అని ప్రకటించింది. జాలర్లను సముద్రము మీదికి పోరాదని హెచ్చరించింది. బంగాళాఖాతంలో వాయుగుండ మేర్పడింది. దాంతో చిన్నగా ప్రారంభమైన గాలి 'ఈదురు గాలి'లా మారింది. వర్షం కూడా పెద్దదయింది. రెండు మూడు పూరిపాకలు అప్పటికప్పుడే నేలమట్టమయి పోయాయి. కొన్ని ఇళ్ళకు పై కప్పులు ఎగిరిపోయాయి.

అరచేతిలో గుండెల్ని పెట్టుకొని– పిల్లా పాపల్ని దగ్గరకు తీసుకొని ఆకాశం వంక చూస్తున్నారా జాలర్లు. పరిస్థితి తగినట్టుగాలేదు. అప్పుడే ఓ గోడకూలి దానిక్రింద ముసలి దంపతులుండిపోయారు. అది గమనించి పొరుగునే ఉన్న సింగన్నతో పాటు కూర్మాడు మరికొంతమంది వచ్చి మట్టి పెళ్లలని తొలగించారు. కాని అప్పటికే ఆ దంపతులిద్దరూ కన్నుమూసారు. గాలిమనుషుల్ని తోసేస్తుంటే నిలబడలేక ఇళ్లలోకి వెళ్లి నిల్చొని పరిస్థితిని గమనించుతున్నారు. పసిపిల్లలు భయంతో తల్లి పొత్తిళ్ళలోనే ఒదిగిపోతూ ఏడుస్తునే ఉన్నారు.

అందరి దృష్టి ఎదురుగా ఉన్న దృశ్యం చూసి స్తంభించిపోయింది!

ప్రెసిడెంటు, విలేజసిస్టెంటు, వీడీవో వర్షంలో తడిసిపోయివచ్చి ఇళ్లముందర నిల్చున్నారు. వాళ్ళులోపలికి రాకుండా ఆ సమయంలో తమగు ఒంకు రావడం నమ్మశక్యంగాలేదు.

"మీరందరూ ప్రెసిడెంటుగారి ఇంటికి పదండి. అదిగో సీపుఎక్కండి. తుఫాన్ ఎక్కువయేటట్టు ఉంది. పరిస్థితి బావోలేదు. పిల్లలతోటి ఇక్కడ ఎలా ఉంటారు." అరుస్తున్నాడు విలేజసిస్టెంటు. వాతావరణం గందరగోళంగా ఉండి అతడి మాటలు చిన్నగానే వినిపిస్తున్నాయి.

"రండి... రండి" ఏడుపుతో పూడుకుపోయి ఉన్న గొంతుతో పొడి పొడిగా అన్నాడు ప్రెసిడెంటు. వీడీవో పరిస్థితి అలానే ఉంది.

ఆ దృశ్యం చూసిన జాలర్లకి తుఫాన్ వెలిసి పోయినట్లనిపించింది. వారికి పరిస్థితి ఏమిటో అర్థం కాలేదు.

"మాకిది అలవాటే... ఈ నాడు క్రొత్త కాదు. పుట్టిన్నుండీ ఇలాటివి ఎన్నో చూసినాం. భరాయించినాం. మీకే వర్షంలో ఉంటే జలుబు, జొరం గట్రాసేస్తాది. బేగి ఇంటి కెళ్లిపొండి" సింగడు దాపరికం లేకుండా అనేసాడు.

"అవేం మాటలురా సింగా, మీరండి లోపలికి" కూర్మాడు అన్నాడు. కూర్మాడి మాటలతో వాళ్లంతా గుడిసెలోపలికి వచ్చారు. ఇరుగు పొరుగు దగ్గరకొచ్చి గుమిగూడారు.

కొన్ని క్షణాల నిశ్శబ్దం పరచుకోక ముందే "హు... చెప్పండి... ఆలశ్యమయితే మనకే ప్రమాదం చెప్పేయండి. నాన్చుడు మాటలెందుకు" విలేజసిస్టెంటు ప్రెసిడెంటుని కుదిపేశాడు.

"మ... మ...రేమో... మన ప్రెసిడెంటుగారబ్బాయి సుందరంబాబు... అదే వీడీవో గారి మేనల్లుడు ఆయన సెలవులకు పట్నంనుండి వచ్చినారు గదా..." అంటూ గుటకేస్తుంటే విలేజసిస్టెంటు అందుకున్నాడు.

"కాలేజీ కుర్రాడుకదా, పడవమీద వెళ్లాలని సరదాకొద్ది వాతావరణం బాగున్నప్పుడు తెల్లవారే వెళ్లాడు సముద్రంలోకి. అయితే వాతావరణం ఇంతలోనే మారిపోయింది. ఇంకారాలేదు. భయంగా ఉంది."

విలేజసిస్టెంటు మాట విన్నవారికి పరిస్థితి అర్థమయింది.

"ఇంతవరకు ఏం చేసారు?" కూర్మాడు అడిగాడు.

"మాకే సంగతి తెలియదు. [illegible] చూసి [illegible]



ప్రతి తల్లికీ తెలుసు:
పాప ఆహారంలో పప్పు
అవసరం

# పప్పు సుగుణాలున్న ఒకే ఒక ఆహారం ఫారెక్స్-వెజ్.

పుష్కలమైన ప్రోటీన్లున్న ఫారెక్స్-వెజ్‌లో పెసర పప్పు ఉంది. పుష్కలంగా ప్రోటీన్లు ఉండే పప్పు పిల్లలకు అత్యుత్తమం. ప్రోటీన్లు ఉండే పప్పు, పెసర పప్పుతో బాటు చిరుధాన్యాలూ, లోహాలూ, కేరళ్లూ ఉన్న ఫారెక్స్-వెజ్ రుచిగా ఉండి సులభంగా అరిగి పోయే ఆహారమయ్యింది.




పప్పుతో

## ఫారెక్స్-వెజ్

పెరుగుదలకు రుచికరమైన విధానం

## గర్భస్థ శిశువులో జన్యు లోపాలను కనిపెట్టే రక్తపరీక్ష

గర్భస్థ శిశువుకు జన్యు సంబంధమైన లోపాలేమైనా వున్నాయేమో తెలుసుకునేందుకు దోహదం చేసే ఒక సునాయాసమైన రక్త పరీక్షా ప్రక్రియను అమెరికన్ పరిశోధకులు కనుగొన్నారు. ఈ రక్త పరీక్షను గర్భవతులకు జరుపుతారు.

మశాచుసెట్స్‌లోని హార్వర్డ్ యూనివర్శిటీ వైద్య బృందం 'ప్లసెంటా' నుంచి 'లీక్' అయ్యే అపరి పక్వమైన ఎర్ర రక్త కణాలను వేరు చేశారు. ఇట్టి కణాలు పిండానికి సంబంధించిన జన్యు పరమైన సమాచారమంతటినీ కలిగి వుంటాయని వారు తెలిపారు.

కాగా, ఆస్పత్రులలో ఈ ప్రక్రియను వినియోగించడానికి ముందు దీని పైన ఇంకా మరికొన్ని పరిశోధనలు జరుగవలసి వున్నదని పరిశోధకులు పేర్కొన్నారు.

గర్భస్థ శిశువు లకు సంబంధించిన జన్యు లోపాలను కనుగొనేందుకై ఇప్పుడు వినియోగిస్తున్న 'ఇన్వాజివ్ మెథడ్స్' వల్ల ఇన్‌ఫెక్షన్, లేదా గర్భస్రావం జరిగే అవకాశాలు స్వల్పంగా వుంటాయని, ఈ నూతన రక్త పరీక్షా ప్రక్రియ వల్ల ఇట్టి ప్రమాదం ఏ మాత్రం వుండదని పరిశోధకులు చెప్పారు.

హెచ్చరించి వెళ్ళాడట. ఇంతవరకూ రాలేదని ఇప్పుడు విషయం చెప్పాడు. చెప్పగానే ఏ దగ్గరకు పరుగెత్తుకొచ్చాం "కళ్ళ నీళ్ళ పర్యంతరం చెప్పాడు ఆ కుర్రాడి మేనమామయిన పీడీవో. ప్రెసిడెంటు కయితే కళ్ళంట నీళ్ళుగానీ, నోటంట మాట రావటం లేదు.

పంచె బిగించి బయలదేరబోయాడు కూర్మాడు. కాని భార్య అడ్డం పడింది "ఏది నీవు సేత్తున్న పని. నేనేమయిపోవాలి..." పూడుకుపోయింది గొంతు. "ఒరే..." ఏదో చెప్పబోయాడు సింగన్న.

"సాటి మనిషి ఏటయినాడో తెల్దు. వాడిపేణం కాపాడ్డానికెళ్తన్నాను. ఏ గంగతల్లి నాకు అడ్డురాదే. భయం దేనికి... నేను మంచి పని సెయ్యడాకెళ్తున్నాను..." అంటూ కొయ్యకున్న తాడు తీసుకొని భుజాన తగిలించి పరుగు తీసాడు. అతని వెనకాలే ప్రెసిడెంటు వంది మాగదులు కూడా.

కూర్మాడు ఒడ్డు చేరుకొని పడవను నీళ్ళల్లోకి బలంగా తోసే ప్రయత్నం చేస్తుంటే మిగతా వాళ్ళంతా సాయపడ్డారు. ఇంతలో గాలి తిరిగింది. అప్పుడు పడవ సులువుగా సముద్రంలోకి వెళ్ళిపోయింది. కనుచూపు మేరవరకు చెయ్యి ఊపి అలా ఆ వాతావరణంలోనే అంతా నిల్చున్నారు.

కూర్మాడి కళ్ళు ఆత్రంగా చుట్టూ వెదుకులాడుతున్నాయి. చేతులు తెడ్డుని బలంగా ఊపుతున్నాయి. వర్షం గాలికి ఎగసే కెరటాలకి ఒడుపుగా పడవని నడుపుతున్నా అది కష్టసాధ్యమే అవుతోంది. అయినా చేపట్టిన లక్ష్యం కోసం పట్టుదల పెరుగుతూనే ఉంది. అంతలో వెనుదిరిగి చూసాడు తను. అందుకు సాక్ష్యంగా నలుదిక్కులా నీరేతప్ప మరేమీ కన్పించడంలేదు. ఇంతలో గుండె బరువెక్కింది. చిన్నగా మనసు మూలలో భయం ప్రారంభమయింది.

అప్పుడు సరిగ్గా చిన్న మూలుగు లాంటి కేక వినిపించింది. పరికించి చూసాడు. "ఎవరు..., సుందరం బాబూ" గట్టిగా అరిచాడు కూర్మాడు.

## తుఫాన్ వెలిసింది

"నేను సుందరాన్నే" వినిపించిన గొంతును బట్టి ఆ ధ్వని వేపు పడవ తిప్పాడు. వర్షం తగ్గుతోంది. గాలి చల్లబడింది. కూర్మాడి మనసు కుదుటపడింది. కెరటాలు మాత్రం ఉవ్వెత్తున లేస్తున్నాయి. తుఫాన్ వెలసి పోలేనందుకు నిదర్శనంగా నలుదిక్కులు చీకటి కాటుకను దిద్దుకుంటున్నాయి.

ఎదురుగా సుందరం పడవ మీద ఉన్నాడు. కాని ఆ పడవ అప్పటికే రెండుగా విడిపోవటానికి సిద్ధంగా ఉంది. నీళ్ళు అందులోకి సన్నగా ప్రవహిస్తున్నాయి.

కూర్మాడు తన పడవని సుందరం పడవకు చేరువగా తీసుకెళ్ళాడు. తన పడవలోని బల్ల చెక్కను సుందరం పడవలో ఓ చివరను పెట్టి - తన పడవలోనికి వచ్చేందుకు మరో చివరను తన దగ్గర పెట్టి పట్టుకున్నాడు. మధ్య నిచ్చెనలా ఉండి బల్ల చెక్క గాలి ఊపుకు కదలాడుతోంది.

"దీనిపై నుండి వచ్చెయ్యి... బేగి..." అన్న కూర్మాడి మాట ప్రకారమే సుందరం బల్లనెక్కి వచ్చేసాడు. కూర్మాడి పడవలోకి వచ్చాడో లేదో సుందరం పడవ మునిగిపోయింది. దాంతో పాటు ఆ బల్ల చెక్క కూడా మునిగిపోయింది. సుందరం ఆప్యాయంగా కూర్మాడిని కౌగిలించుకున్నాడు.

"భయం లేదు పదా" అంటూ తెడ్డు జోరుగా వేసాడు కూర్మాడు. పడవ వేగంగానే ఒడ్డు వేపు ప్రయాణిస్తోంది. మళ్ళీ ఆ చిన్న వర్షం పెద్దదయింది. కుండపోతగా వర్షం కురుస్తుండడంతో పడవలోకి నీళ్ళు చేరాయి. దానికి తోడు పెద్ద కెరటానికి కొన్ని నీళ్ళు పడవలోకి వచ్చిపడ్డాయి. "ఆ నీళ్ళు తోడేయ్" కూర్మాడు అరుస్తూనే దోసిళ్ళతో నీటిని పడవలో నుండి పైకి విసిరేస్తున్నాడు. తెడ్డు వేయడం ఆపేయటంతో గాలి వేసిన దిశ వేపుగా పడవ కొట్టుకుపోతోంది. ఆ గాలి ఒడ్డు వేపే వేయడంతో గట్టిగా ఊపిరి పీల్చుకొని నీరు పైకి చల్లటంలో నిమగ్నమయిపోయారు. ఇంతలో ఓ పెద్ద కెరటానికి పడవ తలక్రిందులయింది.

కూర్మాడు. సుందరం ఈదుతూ పైకి తేలారు. పడవలో నున్న దుంగ (తెప్ప) తేలుతూ కనిపించింది. సుందరం దాన్ని అందుకుని దాని మీద పడుకున్నాడు. పడుకొని ఈదడం ప్రారంభించాడు. కూర్మాడు కూడా ఆ దుంగనే ఆసరా చేసుకోబోగా ఇద్దరి బరువుకీ అది కాస్త మునిగిపోబోవటంతో వదిలేసాడు. "నీవు పదా... నేను వస్తా..." కూర్మాడు మాట విని సుందరం సేద తీరుతూ ఈదులాడుతూ ఒడ్డు వేపు వెళుతుంటె కూర్మాడు అలసిపోయి వెనుకబడిపోయాడు.

సుందరం చీకటి పడే వేళకి ఒడ్డు చేరుకున్నాడు. తండ్రీ మామ అంతా ఎంతో సంతోషించారు. అలసిపోయిన సుందరానికి ఇంటికి తీసుకుపోయే ఏర్పాట్లు చేస్తుంటే 'ఉన్న ఒక్క దుంగ మీద నేను వచ్చాను... నన్ను పొమ్మన్నాడు. తాను ఈదుకుంటూ వస్తున్నాడు' చెప్పాడు సుందరం.

చెమర్చిన కళ్ళతో ప్రెసిడెంటు. పీడీవో, అసిస్టెంట్ ఎదురు చూసారు. కాని కూర్మాడి జాడలేదు. ఆ రాత్రి కూడా గడిచింది.

తెలతెలవారుతున అవుతుంటే ఒకపెద్ద కెరటంతో ఒడ్డు మీద కొచ్చాడు కూర్మాడు. మినుకు మినుకు మన్న దీపంలా ఉందతడి పరిస్థితి. వెంటనే అతడిని జీపెక్కించారు. "పెద్దాసుపత్రికి పోనీ, ఎంత దబ్బు ఖర్చయినా ఫరవాలేదు" ప్రెసిడెంట్ అలసిన గొంతుతో ఆజ్ఞాపించాడు.

జీపులో కూర్మాడిని తీసుకుపోతున్నారు!

జాలరి పేటంతా ఏడుస్తోంది!

దబ్బు తీసుకొని రావడానికి ప్రెసిడెంట్ అసిస్టెంట్, పీడీఓ. బయలుదేరారు ఇంటి వేపు 'ఎలా అయినా రక్షించుకోవాలి' అనే భావన వారి గుండెల నిండా ఉంది.

ఇప్పుడు తుఫాన్ వెలసిపోయింది!!




జి. హనుమంతరావు, విశాఖపట్నం

వృద్ధాశ్రమాలు ఈ దేశంలో కూడా అమలులోకి వచ్చేసేలా వున్నాయి. మన సంస్కృతి, సంప్రదాయం ఏమైపోతున్నాయి?

* అవి పుస్తకాల్లో వుంటాయి. జీవితాల్లో వాటికి చోటు రాను రాను తగ్గిపోతోంది. మా అమ్మా నాన్నా గౌరవంగా కాలం చేసి నందుకు నేను అప్పుడప్పుడు ఆనందపడుతూ వుంటాను- ఏ వయోవృద్ధుల ఆశ్రమం చూసినా... ఇక్కడ మద్రాసులో సంఘసేవికలు వంతుల వారీగా వెళ్లి- పలకరించి వస్తూండడం ఒక సంప్రదాయం చేశాం. మరి ఆంధ్రలో ఏం చేస్తున్నారో తెలియదు. ఈ మధ్య ఓ ఆంగ్ల కవిత చదివాను- కవినిగాను కనుక- పూర్తిగా రాయలేను కాని- దాని సారాంశం ఇదీ:

నా ఒణికే చేతినీ తడబడే కాలినీ/




అర్థం చేసుకున్న వారు కరుణామయిలే/

చెప్పేది వినే ఓపికా, అర్థం చేసుకునే ఓర్పు వుంటే/

వారూ- నా పాలిటి కరుణామయిలే,

నే చూడాలనుకునేవి చూడలేని నా బలహీనపు దృష్టినీ-

నా మాటల కలగలుపు పురాణాన్నీ/

అర్థం చేసుకునే వాళ్లూ- కరుణామయిలే.

ఒలికిన నీటినీ, / పట్టుతప్పిన నా జిహ్వనీ/

చూసీ చూడనట్టు వూరుకున్నా/కరుణామయిలే/

చిరునవ్వుతో/చల్లని చూపుతో క్షణం ఆగి పలకరించినా "చెప్పిందే చెప్పకు అని హెచ్చరించని- కరుణామయిలే- గతించిపోయిన అనుభూతులనీ అనుభవాలనీ జ్ఞప్తికే తెచ్చి/మేం వున్నాం నిన్ను గౌరవిస్తూ, మేం వున్నాం నిన్ను ప్రేమిస్తూ/ అని ధైర్యం చెప్తూ నా శేష జీవితాన్ని సుగమం చేస్తూ ముగింపు దిశ నడిపించే- కరుణామయిలే.

వి. ధనలక్ష్మి, సికింద్రాబాదు.

నేను ఉద్యోగం చేస్తున్నాను. రోజూ బస్సులో వెడలే సాటిస్త్రీలు కూడా సీరియస్‌గా ముఖం పెట్టుకుంటారే గాని, పలకరింపుగానైనా నవ్వుకోరు. ఇదేం తత్త్వమో మీరు- చెప్పకలరా?

* చిరునవ్వుకి ఖరీదు లేదు- కాని అది యిచ్చే సంతోషం చాలా విలువైనది అని గ్రహించక. అది ఇచ్చిన వారికీ ఆనందం, అందుకున్న వారికీ ఆనందం పంచుతుందని తెలియక.... క్షణంలోసగం కాలవ్యవధి పట్టకపోయినా- ఆ లిప్త పాటు కాలం శాశ్వతంగా మిగిలిపోతుందని తెలియక, ఎంత పేద అయినా, ఎంత గొప్పవాడైనా- చిరునవ్వు అందుకోలేని స్థితిలో వుండకూడదని కోరుకోవాలి. ఇంట్లో సంతోషం వృత్తిలో స్నేహం, పెంచే చిరునవ్వు స్నేహానికి- చిరునామా అని గుర్తించక, అలసిన ప్రాణికి విశ్రాంతి, కృంగిన ప్రాణికి ఉత్సాహం, ఇచ్చిన వారి ముఖానికి కాంతి యిస్తుంది- చిరునవ్వే, కష్టాలకి విరుగుడు-యీ చిరునవ్వే, దీని విలువ మనం కట్టలేనిది. కాని- దీన్ని కొనలేం, ముష్టెత్తలేం అప్పగా పుట్టించలేం, దొంగిలించలేం... కారణం ఏమిటి? ఇది ఇచ్చే దాకా విలువలేనిది కనుక. కొందరు మనుషులు నిర్లిప్తతలో చిరునవ్వు సంగతి మరిచిపోతే ఏంగాక మీరివ్వండి ధనలక్ష్మిగారూ, చిరునవ్వేనా యివ్వడానికి మిగలని వ్యక్తులకే- మీరివ్వదగ్గ కానుక చిరునవ్వు.

టి. రామప్రసాద్, పొద్దుటూరు.

నేషనల్ ఫ్రంట్ పై మీ అభిప్రాయం?

* కాస్త టైమివ్వండి.

మీ కిష్టమైన నటీనటులు?

* ప్రత్యేకంగా చెప్పలేను- నేను సినిమాలు- నటీనటుల కోసంచూడను. ఏముందని చూస్తా.

ఆరుద్రగారితో మీ వివాహం ఎప్పుడైంది?

* మేమే మరిచిపోయాం. 1955లో.

పత్రికలలో మీ మొదటి రచన ఎప్పుడచ్చయింది?

* 1951లో.

నేడు వస్తున్న పత్రికలపై మీ అభిప్రాయం?

* పాఠకుల స్థాయికి తగిన పత్రికలే కద వస్తాయి!

యు.యు. ఉరుకుందు, ఎమ్మిగనూరు.

లక్షలు తగలేసి సినిమాలు నిర్మించి, ఫెయిలయితే- దివాలా తీసే బదులు అదే డబ్బుతో చక్కగా పరిశ్రమలు స్థాపించి కొంత మందికైనా ఉపాధి కల్పించవచ్చు కదా నేటి నిర్మాతలు ఎందుకలా చెయ్యరు?

* అబ్బా ఆశ? లాభం ఒక్కరూ పొందాలనే కద- తాపత్రయపడేది. పరిశ్రమకి శ్రమపడాలి. సినిమాకి పెట్టుబడి చాలు- విజయం సాధిస్తే- తిరిగి చూడక్కర లేదు. ఓడిపోతే- యింకో ఛాన్సు చూడవచ్చు. పరిశ్రమ అలాకాదే- రూల్సు ప్రకారం పోవాలి కద.

బచ్చు వీర్రాజు, రాజమండ్రి.

నాల్గు చిత్రాలలో నటించిన నటుడు నిర్మాత అవుతున్న ఈరోజుల్లో శ్రీ ఆరుద్ర నాల్గువందల సినిమాలకు పాటలు రాసినా యింకా నిర్మాత కాలేదేం? కె.రా.గారూ.

* ఎలా అవుతారయ్యా? నటించడం తెలియాలి కద!

నేటి ప్రతి పత్రికలలో ప్రచురితం అయ్యే సీరియల్ నవలలు చాలా భాగం సినిమా గుబాళింపులలో వెలువడుతున్నాయి. గమనించారా?

* 'అటు ఇటు' అయితే ఏం పోయింది? కొంతభాగం సినిమా షూటింగ్ కాగానే సీన్లు పెట్టుకొని సీరియల్స్ రాస్తున్నారని కూడా విన్నాను. సినిమా ఫ్లాపయినా సీరియలేనా మిగులుతుంది కద!!

# ఈవారంలో మీ యోగం

13-7-1990 శుక్రవారం మొదలు
19-7-1990 గురువారం వరకు

**మేషం:** పత్రికాధి నేతలకు అనుకూలం. రాజకీయ రంగానుకూలత కొందరకు, చలనచిత్ర నిర్మాతలకు అనుకూలం, నటన, రచన, చిత్రలేఖన యందు ప్రావీణ్యత గలవారికి అనుకూలం. పాత్రికేయులకు మేలైన వారం. స్త్రీలకు : ఆత్మానందకరం, ఆరోగ్యకరం, గ్రహించాలి.

**వృషభం:** డబ్బును గురించిన, వ్యాపారాన్ని గురించిన, ఆదాయాన్ని గురించిన యిబ్బందులుండవు. పత్రికా రంగాన శ్రమించు వారికి, పాత్రికేయులకు అనుకూలవారం. కొందరకు నూతన నిర్మాణ యత్నం సఫలం. స్త్రీలకు : ఉద్యోగంలో అభివృద్ధి కరమైన మార్పులు.

**మిథునం:** పత్రికాధి నేతలకు, పాత్రికేయులకు, పంపిణీ దారులకు అభివృద్ధి కరమైన మార్పులు రానున్నవి. పరిస్థితులందు కొంత అభివృద్ధి కనిపించనున్నది. శుభ వ్యవహారాలందు అంతరాయం ఏర్పడవచ్చు. గ్రంథకర్తలకు, పుస్తకప్రకర్తలకు అభివృద్ధి. స్త్రీలకు : ఆరోగ్యానుకూలత, గృహమార్పు, దూరప్రయాణం యిత్యాదులు.

**కర్కాటకం:** ఇంకా కొన్ని రోజులయితే గ్రహానుకూలత. పదిమందిలో ప్రసిద్ధి ఏర్పడనున్నది. ఉద్యోగస్తులకు అభివృద్ధి కరమైన మార్పు రావచ్చు. కళాసాహిత్య రంగాన ప్రసిద్ధి ఏర్పడవచ్చు. సంతాన విషయంగా కొందరు యిబ్బందులకు దిగవచ్చు. స్త్రీలకు : ధనవృద్ధి, ఆరోగ్యపెంపు.

**సింహం:** వారమంతా ఎంత జాగ్రత్తగా ఉంటే అంతమేలు. కళా సాహితీ రంగాన కొందరకు ప్రసిద్ధి. యత్న కార్యసిద్ధి, అప్రయత్నాదాయం, అపూర్వ వస్తుసేకరణ, బంధువర్గాన చర్చలు, బాధ్యతా యుతమైన వ్యవహారాలందు తలదూర్చి బాధ పడతారు, జాగ్రత్త. స్త్రీలకు : కుటుంబ బాధ్యతలు అధికం కావచ్చు.

**కన్య:** ఏవిధంగా చూచినా ధనలోపంరాదు. ఆరోగ్యలోపం రావచ్చు. వారమంతా 'అర్ధాష్టమ శనిబాధ, 'గురుడు' కూడ పెద్దగా అనుకూలుడుగాడు. ఎంత జాగరూకతతో సంచరిస్తే అంత మంచిది. వస్తు విక్రయానుకూలత, వ్యవహారం ఏదైనా ఉంటే పరిష్కరింప బడుట, యిత్యాది శుభఫలితాలు. స్త్రీలకు : ఆరోగ్యలోపం, ఒకవేళ ధనలోపం కూడ జరుగవచ్చు, గ్రహించగలరు.

**తుల:** ఆదాయమున్నది. గ్రహానుకూలత అనుకూలంగా ఉన్నది స్థితియందు మార్పు, ధనవృద్ధి, సజ్జన సాంగత్యం, వస్తు విక్రయలాభం. కొందరు దూరప్రదేశాలకు వెళ్లవలసిన ఆగత్యం, ఏర్పడ నున్నది. స్త్రీలకు : ఉద్యోగరీత్యా సర్వానుకూలత.

**వృశ్చికం:** ఇటీవల సర్వవిధాల మీకు అనుకూలత ఏర్పడింది నిశ్చయంకదా! బంధు మిత్ర సమాగమం, శుభకార్య ప్రస్తావనలు, ధనవసతి కుటుంబానందం, సాధు సజ్జన సాంగత్యం ఒక్కటేమిటి? అన్ని విధాల అనుకూలమున్నది. స్త్రీలకు : ధనవసతి, కుటుంబానందం, ఉత్తముల స్నేహం యిత్యాదులు.

**ధనుస్సు:** అత్యుత్తమమైన మార్పు రాజకీయరంగాన కనిపించవచ్చు. సభా మర్యాద యున్నది. అపూర్వ వస్తుసేకరణకు ఆస్కారం. ధనవసతి యున్నది. దూరదేశాలకు ప్రభుత్వ పరంగా కొందరు వెళ్లవచ్చు. స్థితియందు మార్పు జరుగవచ్చు. స్త్రీలకు : అతిథి, అభ్యాగతులను ఆదరించుట, ఆరోగ్యవృద్ధి, నూతనమిత్రానుకూలత.

**మకరం:** అపూర్వ వస్తుసేకరణకు ఆస్కారం. అప్రయత్న ధనలబ్ధి, కళారంగాన ప్రసిద్ధి, నూతన వస్తు సేకరణకు ఆస్కారం. కుటుంబ వృద్ధి, ధనధాన్య వృద్ధి. వస్తు సేకరణకు ఆస్కారం. కళారంగాన అభివృద్ధి కరమైన మార్పులు రానున్నవి. స్త్రీలకు : శుభసమయం కొందరకు ఉద్యోగవృద్ధి.

**కుంభం:** అభిమానించే వారున్నారు. చుట్టుప్రక్కల, ఉద్యోగమందు గొడవ జరుగక చూచుకోవాలి. అపవాదులు రాకుండా చూచుకోండి. 'శని' సరియైన స్థానానికి వచ్చారుగా. అది లాభస్థానంగా! విద్యారంగాన, వ్యాపారరంగాన ప్రసిద్ధి రానున్నది. స్త్రీలకు : సుప్రసిద్ధుల పరిచయం, ఆదాయలాభం.

**మీనం:** అనుకూలత గలవారం, ఆదాయం లేకపోలేదు. రాజకీయ రంగాన మేలున్నది. సభారంగానుకూలత యున్నది. రాజకీయంగా మేలున్నది. సుఖశాంతు లున్నాయి, ఆదాయవృద్ధి, అతిథి అభ్యాగతులను ఆదరించ వలసిన సమయం. 'గురుడు' అనుకూలుడు. స్త్రీలకు : యత్న కార్యసిద్ధి, ధనవృద్ధి.

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

## సుభాష్‌పై అమీర్ దావా

'ఎ' గ్రేడ్ నిర్మాత, దర్శకుడిగా మారిన బి. సుభాష్‌మీద అమీర్‌ఖాన్ కోర్టులో దావా వేశాడు. బొంబాయి సబర్బన్ కోర్టుకు, చిత్ర నిర్మాతల మండలికి తనకు వాగ్దానం చేసిన సొమ్ము యివ్వలేదని ఫిర్యాదు వేశాడట. కాని సుభాష్ మాత్రం అతని ఎకౌంట్స్ ఎప్పుడో సెటిల్ చేశానని, చిల్లి పైసా కూడా యిచ్చేది లేదని అన్నాడట. మరి అమీర్‌ఖాన్ ఏం చేస్తాడో?





# సీరియల్
# సూపర్ హీరో



**మన్నెం శారద**

(గత సంచిక తరువాయి)

విమానాశ్రయంలో నుండి బయటకొస్తున్న సుధీర్‌ని చుట్టబెట్టేసేరు విలేఖరులు.

"మీకు తెలుసాసర్! దమయంతిగారు ఆత్మహత్య చేసుకున్నారు!" అనడిగాడొక విలేఖరి.

సుధీర్ నొసలు చిట్లించి "ఏ దమయంతి?" అన్నాడు.

"అదేంటి సర్! ఆర్టిస్టు దమయంతి తెలియనట్లు మాట్లాడుతున్నారు!" అనడిగాడు మరొక విలేఖరి.

"ఆర్టిస్టు దమయంతి గురించా! మా కజిన్ పేరు కూడ దమయంతే! ఇంతకూ అంత అవసరమేమొచ్చిందామెకు. హైదరాబాద్ రాగానే చాల చెడ్డవార్త వినాల్సి వచ్చింది. ఆమె కుటుంబ సభ్యులకి నా సానుభూతి తెలియజెయ్యండి" అన్నాడు సుధీర్ పశ్చాత్తాపంగా.

"నటుడిగా మీరు పైకి ఎదగడానికి దమయంతిగారు చాల సహాయపడ్డారని-ఆమెను మీరు త్వరలో వివాహం చేసుకోబోతున్నారని విన్నాము. ఆమె మరణం మీకు బాధ కల్గించడం లేదా?"

సుధీర్ వస్తోన్న కోపాన్ని లోలోపలే అదుముకొని "మీ జర్నలిస్టులు చచ్చిన వాళ్లతో బతుకున్న వాళ్లని ఎంత మందిని సాగనంపుదామా అని చూస్తారు! ఆర్టిస్టుగా ఆమెతో నాకు కొద్దిపాటి పరిచయమున్న మాట నిజమే! నా పెళ్లి హోం మినిస్టరిగారి చెల్లెలి కూతురితో ఫిక్స్ అయ్యింది. నన్నిలా అల్లరి పెట్టాలని చూడటం అన్యాయం!" అన్నాడు మెత్తగా.

"ప్రముఖ హీరో విజయేంద్ర అరెస్టయ్యేరు. దాని గురించి ఏమైనా చెబుతారా?"

"హిడిజర్స్!"

"అంటే అతని మీద బనాయించిన కేసులన్నీ నిజమేనంటారా?"

"ఆ సంగతి పోలీసు వారికి తెలుస్తుంది. కాకపోతే వ్యక్తిగా అతని ప్రవర్తన నాకు నచ్చేది కాదు. కోలేడీ ఆర్టిస్టులని అతను బాధించడం నేను చాలసార్లు చూశాను. కాని మరీ ఇంత దిగజారుతాడనుకోలేదు"

"అంటే అతను ఒకమ్మాయిని రేప్ చెయ్యడం...."

సుధీర్ జర్నలిస్టులకి చేతులు జోడించి "నన్ను ఆ విషయాల్లో ఇరికించాలని చూడకండి. అవతల నా మారేజ్ ఎంగేజ్‌మెంటు టైము దాటి పోతోంది. మరోసారి కలుద్దాం" అంటూ తన కోసం వెయిట్ చేస్తున్న కారు దగ్గరకి నడిచేడు.

"ఒన్‌మినిట్ మిస్టర్ సుధీర్!"

ఆ పిలుపు విని ఉలిక్కిపడి వెను తిరిగి చూశాడు సుధీర్.

జర్నలిస్టు శ్యామసుందర్ నిలబడి వున్నాడక్కడ.

"నేను మీతో అయిదు నిముషాలు మాట్లాడాలి!" అన్నాడు శ్యామసుందరే తిరిగి.

"ఇప్పుడా! అవతల ఎంగేజ్‌మెంటు...."

"ఏం ఫర్వాలేదు. నేను మాట్లాడేది మీకు మేలు చెయ్యాలనే. దమయంతి చనిపోయేటప్పుడు నేనక్కడే వున్నాను" అన్నాడు శ్యామసుందర్.

సుధీర్ దమయంతి పేరు వినగానే ఇబ్బందిగా మొహం పెట్టి "దమయంతి చావుకి నాకున్న సంబంధం ఏవిటి?" అన్నాడు విసుగ్గా.

"చెబుతాను. ముందు మనిద్దరం కారెక్కడం మంచిది!"

సుధీర్ కార్‌డోర్ తెరచి "ఎక్కండి" అన్నాడు.

"డ్రైవర్ని ఆటోలో వెనక రమ్మనండి. నేను డ్రైవ్ చేస్తాను" అన్నాడు శ్యామసుందర్ డ్రైవింగ్ సీట్లో కూర్చుంటూ.

సుధీర్ డ్రైవర్ని వెనుక రమ్మని చెప్పి శ్యామసుందర్ పక్కనే కూర్చుంటూ "చెప్పండి!" అన్నాడు.

శ్యామసుందర్ కారుస్లోగా డ్రైవ్ చేస్తూ "నన్ను మొదటిసారి దమయంతిగారు ఇంటికి పిలిచి మిమ్మల్ని పరిచయం చేస్తూ ఈ అబ్బాయి హీరో కావాలనుకుంటున్నాడు. ఇతని ఫొటోలు అన్ని ఫిల్మ్ మాగజైన్స్‌లో వేసి పరిచయం చెయ్యండి. అందుకయ్యే ఖర్చు నేను భరిస్తాను' అని చెప్పింది గుర్తుందా?" అనడిగేడు సుధీర్ వైపు చూస్తూ.

సుధీర్ గతుక్కుమన్నట్లు చూసి "నన్ను బ్లాక్‌మెయిల్ చెయ్యాలని ప్రయత్నిస్తున్నారా?" అనడిగేడు కాస్త కోపంగా.

"అదేం లేదు. తీగే కదా అని నిర్లక్ష్యంగా కాలితో నెట్టేస్తే అదే కాలికి చుట్టుకొని బోర్లాపడేస్తుంది. హోం మినిస్టరుగారు మీ అండన వున్నారని మరీ నిర్లక్ష్యంగా ప్రవర్తించొద్దు. ప్రభుత్వాలు వాటి టెర్మ్ కాకుండానే పడిపోవడం-సరికొత్త ప్రభుత్వాలు పాత సమాధుల్ని తవ్వి కొత్త శవాల్ని బయటకి తియ్యడం మీకు తెలియందేమీ కాదని హెచ్చరిస్తున్నాను"

"అంటే.....ఏం చేయాలంటారిప్పుడు?" అన్నాడు సుధీర్ కాస్త మెత్తపడుతున్న ధోర

**ఇంతవరకూ సాగిన కథ-17:** ఎక్జిక్యూటివ్ ఇంజనీరు నిఖిలేశ్వరి తన కొడుకు విజయేంద్రకు చిత్రసీమలో వస్తున్న పేరు ప్రఖ్యాతులకు ఆనందిస్తుంటుంది. సుధీర్ మాటలు నమ్మి హోటల్‌కు వెళ్ళిన దమయంతిని వ్యభిచార నేరం క్రింద అరెస్టు చేయటంతో అవమానాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకుంటుంది. అమ్మాయిల్ని రేప్ చేసి బ్లూఫిల్ములు తీస్తున్నాడన్న నేరంపై విజయేంద్రను పోలీసులు అరెస్టు చేస్తారు. ఈ విషయం విని తల్లి నిఖిలేశ్వరి తల్లడిల్లిపోతుంది.



ణిలో.

"విషయం చెబుతాను. ఏం చేయాలో మీరే నిర్ణయించుకోండి. దమయంతి చని పోతూ మీ పేరే స్మరించింది. మోసం, దగా అంటూ కలవరిస్తూ ప్రాణం వదిలింది. దీన్ని బట్టి ఆమె ఆత్మహత్యకి కారణం మీరన్న విషయం చాల మందికి అర్థమ య్యింది. కాబట్టి పెళ్లి ఎంగేజ్‌మెంటు ఎప్పు డన్నా చేసుకోవచ్చు. ముందు మీకు సంబం ధించిన సాక్ష్యాలేమైనా దమయంతి ఇంట్లో వది లేసేరేమో గుర్తుతెచ్చుకొని వాటిని నాశనం చేసుకోండి!" అన్నాడు శ్యామసుందర్ సుధీ ర్‌ని క్రీగంట గమనిస్తూ.

"అలాంటిదేమీ లేదు" అన్నాడు సుధీర్ బింకంగా.

"లేకపోతే మంచిదే. కాని పోలీస్ సెర్చికి మునుపే విజయేంద్ర తల్లిగారయిన నిఖిలేశ్వరీ ఆ ఇంటికి వెళ్లేరు. అప్పుడే నేనూ వెళ్లడం జరిగింది. దమయంతి బెడ్ క్రింద నుండి ఒక కవరు తీసి ఆమె భద్రం చెయ్యడం గమ నించేను. అదేమిటని అడిగితే జవాబు చెప్ప లేదామె. అది దమయంతి రాసిన ఆఖరు ఉత్తరమేమో అని నా అనుమానం."

శ్యామసుందర్ మాటతో చిన్న జంకు లాంటిది కల్గింది సుధీర్‌లో. అయినా ఒక మామూలు జర్నలిస్టు ముందు బయట పడటం అతనికిష్టం లేదు. ప్రభుత్వంలో కీలకమైన మంత్రి తన చేతిలో వున్నాడు. తనేం ఝడుసుకోనవసరం లేదు. ఆ నిఖిలే శ్వరిని స్టేట్‌లో వున్న అన్ని చెరువుల్లో నీళ్లు తాగించగలడు.

"ఏంటి ఆలోచిస్తున్నారు?" అడిగేడు శ్యామసుందర్.

సుధీర్ చిరునవ్వుకొని తెచ్చుకొని "మీరు విజయేంద్రకి బాగా క్లోజని విన్నాను" అన్నాడు.

"ఏం, మీకు కానా?" తిరిగి రెట్టిం చేడు శ్యామసుందర్.

"కాదని కాదు. విజయేంద్ర ఇంట్లో మీరు చాల క్లోజుగా మూవ్ అవుతారని విన్నాను. అలాంటి మీరు విజయేంద్ర జైల్లో వుండగా ఆ సంగతి వదిలేసి...నా సంగతి పట్టించుకోవడం నాకు చాల చిత్రంగా వుంది"

శ్యామసుందర్ చిన్నగా నవ్వి "మీరలా అడుగుతారని తెలుసు. వ్యక్తిగా విజయేంద్ర నాకు బాగా తెలుసు. అతను చాల మంచి



వాడు. ప్రొఫెషన్‌లో పైకి వస్తున్నాడన్న జెలసిలో అతన్ని అప్రతిష్టపాలు చేసారేమో అనుకున్నాను మొదట. కాని.... అంతకన్నా ఏదో బలమైన కారణంతో అతను అరెస్టయి వుంటాడనిపిస్తోంది ఇప్పుడిప్పుడే! అలా మీరు కూడ దమయంతి మరణంతో ముడిపడి అల్లరి కాకూడదన్నదే నా ప్రగాఢ వాంఛ!"

సుధీర్ నొసలు చిట్లించి "విజయేంద్రని అరెస్టు చేయించటం వలన ప్రభుత్వానికేమి ఒరుగుతుంది?" అన్నాడు.

"ఏం లేకపోతే ఎందుకతన్ని రేపో ఎల్లుండో ఉరితీయబోయే భయంకరమైన సెల్‌లో పెడ్తారు! ఎందుకంత కఠినంగా అతని తల్లిని కూడ చూడనివ్వకుండా నిర్బంధిస్తారు. ఫస్టు ఇన్ఫర్మేషన్ రిపోర్టు ప్రూవ్ కానిదే అతన్నంత కఠినంగా శిక్షించడం సబబా?"

శ్యామసుందర్ మాటలకి అప్రతిభుడయి చూశాడు సుధీర్.

"ఇవన్నీ మీకెలా తెలిసేయి?" అనడిగేడు ఆశ్చర్యంగా.

"బేసికల్లీ అయామే జర్నలిస్టు!" సగర్వంగా నవ్వేడు శ్యామసుందర్. అంతలో కారు సుధీర్ ఇల్లు చేరుకొంది.

సుధీర్ కారు దిగుతూ "థాంక్యూ! వస్తాను" అంటూ వెళ్తోంటే శ్యామసుందర్ కూడ కారు దిగి మెల్లిగా రోడ్డునపట్టేడు.

## 27

పూజ గదిలో నుండి బయటికి రాగానే ఫోను రింగవ్వడంతో వెళ్లి రిసీవర్ అందుకొంది నిఖిలేశ్వరి.

"కంగ్రాచ్యులేషన్!" అంది అవతలి కంఠం.

ఆమె ఆ గొంతు భర్తదని గ్రహించింది.

# సూపర్ హీరో

"ఎందుకు?" అంది నిదానంగా.

"నువ్వు సూపరెన్టెంటు ఇంజనీరు కాబోతున్నావు. జి.వో. రెండు రోజుల్లో మీ డిపార్టుమెంటుకి రాబోతున్నది."

"ఒక పక్క కొడుకు అరెస్టయి వుంటే ఇలా ప్రొద్దుటే నా మీద జోకులు వెయ్యడానికి నీకు సిగ్గనిపించడం లేదా?" అందామె కటువుగా.

"ఇది జోక్ కాదు మిసెస్ నిఖిలేశ్వరి! నూటికి నూరుపాళ్లు నిజం. గవర్నమెంటులో మాట్లాడుకొంటుంటే విన్నాను. నీ సిన్సియారిటీకి మెచ్చి అవుటాఫ్ సీనియారిటీ ఇస్తున్న ప్రమోషన్. కొడుకు అరెస్టయితేనేం, మొగుడు ఓడిపోతేనేం-నీక్కావాల్సింది నీ ఇండివిడ్యుయాలిటి! అందులో గెలుపు నీదే అవుతున్నదిగా!" అన్నాడు గోపాల్రావు వెటకారంగా.

"ఆ విషయం గుర్తు చేయడానికి ఫోను చేసేవా నువ్వు!"

"కొడుకు అరెస్టుతో నన్నా నీ పొగరణుగుతుందని భ్రమపడ్డాను నేను. కాని నువ్వు టైం ప్రకారం ఆఫీసు కెళ్తూ రెండు పూటలా తినగల్గుతున్నావని తెలిసి అసహ్యంతో ఫోను చేస్తున్నాను."

బదులుగా నిఖిలేశ్వరి పిడికిలి రిసీవర్ మీద బిగిసింది.

"పొరబాటు. బాబు అరెస్టయ్యేక మూడు పూటలా తింటున్నాను. పళ్ళరసాలు తాగుతున్నాను. నా ఆరోగ్యం పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ వహిస్తున్నాను. ఎందుకో తెలుసా? మొగుడు చచ్చి పసుపుకుంకుమలు పోగొట్టుకున్న నేను ఒంటరిగా ప్రభుత్వంతో పోరాడి నా బాబు నిర్దోషి అని నిరూపించుకోవాలి! అందుకని!" అంటూ రిసీవర్ క్రెడిల్ చేసింది కసిగా.

అయినా ఆమె హృదయం బాధతో బరువెక్కిపోయింది.

ఈ ఇండియాలో డైవోర్సు తీసుకొన్నా ఆ మొగుడి పీడ వదలదు. ఇక్కడ పుట్టిన ఆడదాని దౌర్భాగ్యం అదే! తరతరాలు కత్తిరించినా విడివడని చిక్కుల వలలో స్త్రీని బంధించేయి ఈ దేశపు సెంటిమెంట్లు-ఆచారాలు. లేకపోతే ఏనాడో తననుండి లీగల్‌గా విడిపోయిన గోపాల్రావు తన పతనం ప్రతిక్షణం చూడాలనుకోవడం శాడిజం కాదా!

నిఖిలేశ్వరి ఆలోచిస్తుండగా పోస్టులో రెండు కవర్లొచ్చేయి. ఒకటి తను హోం మినిస్టర్‌కి పెట్టుకొన్న దరఖాస్తుని మన్నిస్తూ తన కొడుకుని జైలుకెళ్లి చూసేందుకిచ్చిన పర్మిషను. రెండవది ఆమె పనితీరుని ప్రశంసించి ఆమెకు సూపరెన్టెంటు ఇంజనీరుగా ప్రమోషన్ ఆర్డరు.

మొదటిది ఆమెని ఎనలేని ఆనందానికి గురి చేసింది. ఆ సాయంత్రం ఆరుగంటలెప్పుడవుతుందా అని ఆమె ఎదురు చూడసాగింది పుత్రదర్శనార్థమై.

*** *** *** *** ***

ఆరోజు టీపాయ్ మీద అన్ని పేపర్లుండటాన్ని చూసి ఎంతో ఆశ్చర్యపడిపోయింది పీయూష. తనని, తల్లిని గృహ నిర్బంధంలో పెట్టిన నాటి నుండి తమకి పేపరు, రేడియో, టి.వి., ఫోను ఎలాంటి కమ్యూనికేషన్స్ లేకుండా చేసేడు తండ్రి. టైముకి కారియర్ వస్తుంది. భోంచేయాలి. నిద్ర వస్తే పడుకోవాలి. కిటికిలోంచి ప్రపంచాన్ని చూడాలి. గేటు దగ్గర రైఫిల్స్‌తో కానిస్టేబుల్స్ ఇరవైనాలుగ్గంటలూ రెండు కాళ్ల మీద కఠోర తపస్సు చేసే మునుల్లా నిలబడి వుంటారు. లోపల మాత్రం తమ కుటుంబంతో చాల కాలంగా సన్నిహితంగా వుండే ఆర్డర్లీ స్వామి మాత్రం ఉంటాడు. ఏదైనా అవసరమైతే అతనికే చెప్పాలి. అతనెళ్లి తండ్రికి చెబుతాడు.

పీయూష స్నానం ముగించి తలదువ్వుకొంటూ హాల్లోకొచ్చి "ఈ రోజు ఇన్ని పేపర్లు వచ్చేయేంటి? డేడి పనిష్మెంటు రిలాక్సు చేసేరా?" అంది.

"తెలీదు తల్లీ! తమకివ్వమంటే తెచ్చేను" అన్నాడు స్వామి.

"గుడ్! తండ్రిగారు కాస్తమారుతున్నారన్న మాట!" పీయూష వచ్చి కుర్చీలో కూర్చొని ఒక పేపరందుకొంది.

వెంటనే ఆమెకు మొదటి పేజీలోనే సంకెళ్లతో బంధింపబడి పోలీసు బందోబస్తుతో



**తారాపథానికి నిచ్చెనలు...**

# మరణించే వరకూ నటించిన బెర్గ్‌మన్



ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్

**చూ**పరులను మంత్రముగ్ధుల్ని చేసేటంతటి అందం ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్‌ది. ఆమె నవ్వు హిప్నటైజ్ చేస్తుంది. హాలీవుడ్ తారల్లో బెర్గ్‌మన్‌కి ఒ ప్రత్యేకస్థానం వుంది.

స్వీడన్‌లోని స్టాక్‌హోమ్‌లో 1915లో బెర్గ్‌మన్ జన్మించింది. తల్లి చిన్నతనంలో చనిపోయినందువల్ల తండ్రి, (ఫోటోగ్రాఫర్) చుట్టాలు బెర్గ్‌మన్‌ని పెంచారు.

చిన్నతనం నుంచీ క్రమశిక్షణ, కష్టపడి పని చేయడం వంటి వాటి ప్రాధాన్యతను గుర్తించింది బెర్గ్‌మన్.

ముందు రాయల్ థియేటర్ ఆఫ్ డ్రమెటిక్ ఆర్ట్స్‌లో చేరింది. ఈలోగా సినిమాల్లో అవకాశాలు వచ్చాయి. ఐదారు స్వీడిష్ చిత్రాల్లో నటించిన తరువాత డేవిడ్ ఓసెల్నిక్ అనే నిర్మాత 'ఇంటర్‌మెజో' చిత్రం ద్వారా ఆమెను అమెరికా ప్రేక్షకులకు పరిచయం చేశాడు.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో వచ్చిన సినిమాలు బెర్గ్‌మన్‌ని మహానటిగా మార్చాయి. 'కాసబ్లాంకా' చిత్రం బెర్గ్‌మన్‌కి మరీ గొప్ప పేరు తెచ్చింది.

1949లో జనమంతా ఆశ్చర్యపోయే పనిచేసింది బెర్గ్‌మన్. భర్త డాక్టర్ పీటర్ లిండ్‌స్టామ్‌ను, కూతురు 'పియా'నూ వదిలి ఇటాలియన్ దర్శకుడు 'రాబర్టోరోసెల్లినీ'తో జీవించసాగింది. అతనితో ఓ బిడ్డని కన్న తరువాత 1950లో అతడిని పెళ్లి చేసుకుంది.

భర్తనీ పిల్లనీ వదిలి నిర్దాక్షిణ్యంగా వెళ్లిపోయిన బెర్గ్‌మన్‌ని అమెరికా ప్రేక్షకులు క్షమించలేకపోయారు. ఫలితంగా ఆమె నటించిన, భర్త దర్శకత్వం వహించిన 'స్ట్రాంబో లీ' చిత్రం ఘోర పరాజయాన్ని చవిచూసింది.

రోసెల్లినీతో ఆమె వివాహం 1958లో విఫలమయ్యింది. మళ్లీ అమెరికా వచ్చిన బెర్గ్‌మన్‌కు అమెరికా ప్రజలు నీరాజనాలు పట్టారు.

గాస్‌లైట్ (1944) చిత్రంలో అద్భుతమైన నటనను ప్రదర్శించిన బెర్గ్‌మన్‌కు అకాడమీ ఉత్తమ నటి అవార్డునిచ్చింది. ఎనస్తేషియా (1956) మర్డర్ ఆన్ ది ఓరియెంట్ ఎక్స్‌ప్రెస్ వంటి అనేక చిత్రాలకు ఆమె అవార్డులందుకుంది.

1982లో కేన్సర్ వ్యాధి కారణంగా బెర్గ్‌మన్ శాశ్వతంగా కన్నుమూసింది. 1982 వరకు ఆమె చిత్రాల్లోనూ టిలివిజన్లలోనూ నటిస్తూనే వుంది.

---

తీసుకెళ్తున్న విజయేంద్ర ఫోటో కనిపించింది. నిజానికది ఏ సినిమాలోని స్టిల్ ఫోటోగ్రాఫ్ అనుకొంది మొదట. కాని పైన తాటికాయంత అక్షరాలతో ప్రముఖ హీరో విజయేంద్ర అరెస్టు! అన్న వార్త చదవగానే ఆమె షాకయిపోయింది. ఒకలాంటి గుండెదడతో ఆమె పేపర్లన్నీ గబగబా తిరగేసింది. ఇంచుమించు అన్ని పేపర్లు ఆ వార్తని ప్రముఖంగా ప్రచురించాయి. పీయూష పెదవులు దుఃఖంతో అదరసాగేయి!

తన 'విజయేంద్ర ఒకమ్మాయిని రేప్ చేయడమా!

బ్లూఫిల్మ్సులో నటించడమా!

'నెవ్వెర్! నెవ్వెర్!' అంటూ ఆమె కెవ్వున అరిచింది.

"ఏంటి తల్లీ! ఏం జరిగింది!" అన్నాడు స్వామి ఆందోళనగా. బదులుగా పీయూష కళ్లు అవిరామంగా వర్షించడం ప్రారంభించేయి.

పీయూష అరుపులకి సుందరమ్మ గది లోంచి పరిగెత్తుకొచ్చింది.

అప్పటికే పీయూష స్పృహతప్పపడిపోయింది.

సుందరమ్మ, స్వామి కలిసి ఆమెని ఎత్తుకొని బెడ్‌రూమ్‌లో పడుకోబెట్టేరు.

స్వామి ఆమె మొహాన నీళ్లు జల్లి ఎ.సి. ఆన్ చేసేడు. సుందరమ్మ పీయూష తల వైపు కూర్చొని తల నిమరసాగింది.

కాస్సేపటికి పీయూషకి స్పృహ వచ్చింది.

ఆమె తల్లి ఒడిలో తలపెట్టుకొని వెక్కెక్కి ఏడ్వసాగింది.

"ఏం జరిగిందమ్మా!" అంది సుందరమ్మ అనునయంగా.

"ప్రేమించడం తప్పామ్మా!" పీయూష తలెత్తి తల్లి కళ్లలోకి సూటిగా చూస్తూ అడిగింది.

సుందరమ్మ బదులు చెప్పలేదు.

"చెప్పమ్మా! ప్రేమంటే నీకసలు తెలుసా?" అంటూ రెట్టించింది పీయూష.

సుందరమ్మ కూతురి వైపు ఆప్యాయంగా చూసి "పిచ్చి తల్లీ! నేను నిన్ను ప్రేమించడం లేదంటావా! నీతోపాటు మీ నాన్న పెట్టిన చెరసాలలో సుఖంగా వుండటం లేదా!" అంది.

తల్లి జవాబు విని ... త్తరాలయింది పీయూష.

"అది కాదు....డేడీని నువ్వు మనస్ఫూర్తిగానే ప్రేమిస్తున్నావా? ఆయనంటే నీకిష్టమేనా!"

"ప్రేమలూ, వాటి కోసం పరుగులూ పెట్టే వయసు రాకుండానే నా పెళ్లి జరిగిపోయింది. మీ నాన్నగారి నీడలో నా బాధ్యతల్ని తీర్చుకొంటూ ఆయన చెప్పినట్లు వినడంలోనే అంతర్లీనమైన ప్రేమని చవిచూశాను. తల్లిదండ్రుల్ని ఎదిరించడం ఇలా కోరి దుఃఖాన్ని తెచ్చుకోవడం మాకు తెలీని విషయాలు" అంది సుందరమ్మ.

"నిజంగా నువ్వు దురదృష్టవంతురాలివి మమ్మీ!" చూడు డేడీ కేవలం మా ఇద్దర్నీ విడదీయడం కోసం ఎంత దారుణంగా మారిపోయేరో! విజయేంద్ర మీద చేయని నేరం మోపి అతని తల్లి నుండి అతన్ని విడదీసి రాక్షసుడిలా ప్రవర్తిస్తున్నారు. ఈ పేపర్లు నేను చూస్తే నా మనసు విరిగిపోతుందని నేనతన్ని ప్రేమించనని డేడీ అపోహ! కాని

నా ప్రేమంత పనికి మాలింది కాదు. విజయేంద్ర మీద ఎన్ని నేరాలు మోపినా నేను నమ్మను. మేమిద్దరం చివరికిలా చచ్చిపోతాం గాని మనసు మార్చుకోము" అంది స్థిరంగా.

సుందరమ్మ కూతురి వైపు విచలితంగా చూసింది.

"ఇప్పటికీ నీమనసు మారలేదా పీయూ!" అంది ఆందోళనగా.

"మారదు. మారితే నేను కరంచంద్ గాంధీ కూతుర్నే కాదు" అంది పీయూష రక్తరేఖలు చిమ్మిన కళ్లతో.

కూతురి కళ్లలో కదలాడుతోన్న స్థిరమైన పట్టుదలని చూసి కృంగిపోయింది సుందరమ్మ.

*** *** *** *** ***

గాంధీ రాయుడికి సాల్యూట్ చేసి నిలబడ్డాడు.

"కూర్చోండికమీషనర్‌గారూ!" అన్నాడు రాయుడు. గాంధీ అయిష్టంగా కూర్చున్నాడు.

"చెప్పండి, ఏవిటి సమస్య?"

"విజయేంద్ర విషయంలో మీరు నన్ను అవుటాఫ్ ఆర్డర్ వెళ్లి అరెస్టు చెయ్యమన్నారు. నేను జనంలో వచ్చే సెన్సేషన్‌కి కూడ ఝడవకుండా అతన్ని అరెస్టు చేయడం జరిగింది. అందుకోసం నేను రాజన్నగారి అల్లుడయిన కరుణాకర్‌ని కూడ ట్రాప్‌లో వుంచుకొని సాక్ష్యాలు తయారు చేసుకొన్నాను. కోకిల అనే టచప్ గర్ల్ తనతో అతను బ్లూఫిల్మ్ తీసేడని సాక్ష్యం కూడ ఇవ్వడానికి ఒప్పుకొంది. చాదర్‌ఘాట్ చంచల, సుశీల అనే ఇద్దరమ్మాయిలు విజయేంద్ర అభిమానుల్ని అతడు కారులో తీసుకెళ్లి నగ్నంగా ఫొటోలు తీసేడని బలవంతం చేయడానికి ప్రయత్నించేడని సాక్ష్యం ఇచ్చేందుకు సిద్ధం చేసేను. ఇంత నేను చేస్తూ వస్తుంటే మీరు అతగాణ్ణి చూడటానికి ఆమె తల్లి పెట్టుకొన్న మెర్సి పిటీషన్‌ని మీరంగీకరించడమే కాక ఆమెకి ప్రమోషన్ వచ్చేందుకు వీలు కల్పించేరు" అన్నాడు గాంధీ బాధగా.

## సూపర్ హీరో

బదులుగా రాయుడు పకపకా నవ్వి "ఇదంతా నా కోసమే చేస్తున్నానంటావా మిస్టర్ గాంధీ!" అన్నాడు.

గాంధీ దెబ్బతిన్నట్లు చూశాడతని వైపు.

"నువ్వు కోపం తెచ్చుకోకు. మేము ఈ రోజు వుంటాం. రేపెళ్లిపోతాం. ఏభయ్యేనిమిది సంవత్సరాలు వివిధ హోదాల్లో సర్వీసు చేసే ప్రభుత్వోద్యోగులు మీరు. మీకు తెలయని రూల్సేం లేవు. నువ్వు ఆ వెధవని నీ కూతురు ప్రేమిస్తుందని వాడి మీద కక్ష తీర్చుకొనే అవకాశం కోసం ఎదురు చూస్తున్నావని నాకు తెలుసు. సమయానికి రాజన్న కేసు- దమయంతి చావు నీకు కలిసొచ్చేయి. నాక్కావాడ వాడంటే మంటే! కాని మనం చేసే పని మరీ కక్షసాధింపుగా ప్రజలకి తెలిసిపోకూడదు. నిఖిలేశ్వరి గురించి నీకు తెలుసో లేదో- ఆవిడ కష్టం వస్తే కృంగిపోయి కన్నీళ్లెట్టుకొనే రకం కాదు. డిపార్టుమెంటులో చాల నిఖార్సయిన మనిషని పేరుంది. అవుటాఫ్ సీనియారిటీ ఆమెకు ప్రమోషన్ ఇవ్వాల్సిందిగా ఆమెకు ఆమె ఆఫీసర్సు నుండి రిపోర్టులు వున్నాయి. నిజానికి మనమేం అడ్డంగా వెళ్లి ఆవిడకి ప్రమోషన్ ఇవ్వడం లేదు. రూల్స్ ప్రకారం ఇచ్చేసి నీ మీద మాకేం వ్యక్తిగత ద్వేషంలేదని చెబుతున్నాం. అంతే! పోతే ఆవిడ కొడుకుని చూసేందుకు అనుమతించటం కూడ మన మేలుకే! ఆవిడ వాడి స్థితి చూసన్నా కృంగిపోవాలన్నది ఆవిడ భర్తగారి కోరిక. చూడనివ్వు. మనదేం పోయింది. వాణ్ణి నువ్వు పనిష్ చెయ్యొద్దని నేను చెప్పడం లేదే!" అన్నాడు రాయుడు చిద్విలాసంగా నవ్వుతూ.

గాంధీ అతని వైపు తెల్లబోయినట్లు చూసాడు.

"నీకింకో సంగతి తెలీదు. దమయంతి చచ్చిపోయినప్పుడు రాసిన ఆఖరు ఉత్తరం నిఖిలేశ్వరి దగ్గర ఉంది. దాన్ని మీ డిపార్టుమెంటు ఆవిడ చేతికి దొరికేట్లు చేసినందుకు నేనేం తయినా చెయ్యగలను మిమ్మల్ని.కాని నాకు మిమ్మల్నేదో చెయ్యడం ముఖ్యం కాదు. ఆ ఉత్తరం తిరిగి మన చేతిలో పడాలి. అందుకు నువ్వేం చేస్తావో తెలీదు. నిఖిలేశ్వరి మీద ఈగ వాలకుండా పని జరగాలి. అది ముఖ్యం నాకు" అన్నాడు రాయుడు.

ఆ మాట విని గాంధీ మరింత తెల్లబోయేడు.

"అలా జరగడానికెంత మాత్రం వీల్లేదు సర్. ఆరోజు దమయంతి ఆస్పత్రిలో వుండగానే పోలీస్ బలగం ఆమె ఇంటిని క్షుణ్ణంగా సోదా చేసింది. ఇది ఫాల్స్ న్యూస్!" అన్నాడు గాంధీ ఎర్రబడిన మొహంతో.

"అయితే మంచిదే! కాని......ఈ విషయాన్ని పూర్తిగా తీసిపారెయ్యకుండా తెలుసుకోండి. ఆ నిఖిలేశ్వరి చాల ఉద్దండురాలని విన్నాను" అన్నాడు రాయుడు.

గాంధీ లేచి నిలబడి సాల్యూట్ చేసి బయటకొచ్చేడు.

అతని మొహంలో అవమానం ప్రస్ఫుటంగా అద్దినట్లు కనిపిస్తోంది.

"సాయంత్రం నిఖిలేశ్వరి జైలుకొస్తుంది. అప్పుడావిడ కొడుకున్న స్థితిని చూసి నిలువునా కృంగిపోవాలి. తిరిగి తేరుకోకూడదు. వచ్చే ప్రమోషన్‌ని కాదని రాత్రికి రాత్రి ఆత్మహత్య చేసుకోవాలి!"

అతను కసిగా జీప్ ఎక్కేడు.

జీప్ జైలుకేసి సాగిపోయింది.

(ఇంకా వుంది)



## టిట్ ఫర్ టాట్-(53)
### ఫలితాలు

"గుళ్లో కెళ్దామా? సినిమా థియేటర్లో కెళ్దామా?"

రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

"బూతు బొమ్మలంటే అంత యిష్టమా? సామీ!"

- మాదిరెడ్డి రాజరెడ్డి (బెల్లంపల్లి)

రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

"గుడికంటే బడిపదిలం! థియేటర్ కన్నా పార్కు మిన్నా!"

- ఎం. సీతన్నాయుడు (మచిలీపట్నం)

### మరికొన్ని వాక్యాలు

"నిన్ను ముద్దు పెట్టుకోవాలనిపిస్తోంది. థియేటర్ కే పోదాం పద!"

- జి.వి. రామారావు (అమలాపురం)

"లైన్లో నిలబడడానికి దేనికైతేనేం...!"

- రత్నమాల (తణుకు)

"మాయింటికే వెళ్దాం... మా వారు కూడా వూళ్లోలేరు!"

- శక్తిశాధ్ (బాపట్ల)

"అసలే పెళ్లిళ్ల సీజనాయె! గుళ్లోకెళితే కొత్త చెప్పులైనా దొరుకుతాయి!!"

- గుబ్బల సత్యవతి (బరూచ్), -ఎస్. హెచ్. బాబు (తిరుపతి), - పి. శివరావు (ధవళేశ్వరం), - పి. రూపవతి (పార్వతీపురం), -పి. అరుణ్ కుమార్ (ఇచ్చా), మధు (జాంధ్రపేట).

### లక్కీ పేర్లు

సి. శ్రీనివాసమూర్తి (హిందూపురం), శ్రీదేవ్ (పొన్నూరు), పి. తాతబాబు (మందడం), వై. శరత్ చంద్ర (మార్కాపురం), పి. వెంకటలక్ష్మి ( విజయవాడ), జి.పి. రామచంద్రుడు (కర్నూలు), ఎ.ఎం. శరత్ బాబు ( సూళ్లూరుపేట), యస్వీ పద్మ (విశాఖపట్నం), పి. ఇజ్రాయెల్ (కాకినాడ), జి. వీరభద్రరావు (తణుకు).



# మనసుంటే...

"ముష్టి వెధవ! ముష్టి వెధవాని.... వెధవకి తినడానికి తిండిలేదు. వెధవ నీతులూ, ధర్మపన్నాలు" అని సణుక్కుంటూ ఇంట్లో అడుగు పెట్టాడు శరభయ్య.

ఆయన ఆ ఊరిలో మోతుబరి రైతు. అంతేకాక ఆ ఊరి ప్రెసిడెంట్. ఆ ఊళ్ళో ఆయన ఎంత చెపితే అంత. ఒక విధంగా చెప్పాలంటే ఆ ఊరికి మకుటంలేని మహారాజు. ఆయన వ్యక్తిత్వం ఎటువంటిదో, ఆయన ఆస్తిని ఎలా సంపాదించింది ఊరిలో అందరికి తెలిసినా ఆయనంటే భయంచేత గౌరవిస్తారు. కనీసం ఆ విధంగా నటిస్తారు. అటువంటిది ఒక అనామకుడు అందులోనూ కులం తక్కువవాడు తనని అవమానించడం శరభయ్య సహించలేక పోయాడు. ఆయన హృదయం కుతకుత లాడి పోతోంది. మొహం కందగడ్డలా మారింది. నలుగురిలో అతను అన్న మాటలు తలుచుకుంటే శరభయ్య మనస్సు భగ్గుమంది.

యజమాని అంత కోపంగా ఇంట్లోకి రావడం చూసిన పాలేరు అన్నవరంకి భయమేసింది. ఏదో పెద్ద గొడవే జరిగి ఉంటుందని ఊహించాడు అతను. ఎందుకంటే అన్నవరం ఆ ఇంట్లో గత పాతిక సంవత్సరాలుగా పని చేస్తున్నాడు. శరభయ్య ఎన్ని కుతంత్రాలు పన్నినా, ఎన్ని హత్యలు చేయించినా పైకి మాత్రం శాంతంగా గంభీరంగా ఉంటాడు. అయితే ఆయన తనకి ఎంతో విశ్వాస పాత్రుడయిన అన్నవరం దగ్గర మాత్రం ఏ విషయం దాచడు. అన్నవరంకి కూడా యజమాని దగ్గర చనువుంది.

"ఏటయ్యింది దొరా!!?? అంత కోపంగా ఉన్నారేటి!!?" భయపడుతూనే అడిగాడు అన్నవరం.

"ఆ నారిగాడు లేడూ.... వెధవకి మింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగనూనె అని ప్రజలు, సేవ అంటూ కబుర్లు చెపుతున్నాడు. కూటికి గతి లేక పోయినా అహంకారం, గర్వం మాత్రం నిండుగా ఉన్నాయి. ఏం చూసుకుని ఎగసిపడుతున్నాడో అంట్ల వెధవ!?"

"ఇంతకీ ఏమన్నాడు దొరా!?"

"ఏముందీ!? నేను ఈ ఊరి ప్రజలనీ, వారి బాగోగులను పట్టించుకోవడం లేదట. పరోపకారం చేస్తేనే పుట్టగతులుంటాయట. అసలు మానవ జన్మ ఉన్నది అందుకేనట. బయలుదేరాడు వేదోద్ధారకుడు."

"అన్నా!! మిమ్మల్ని అంతలేసి మాటలన్నాడా!? ఎంత తప్పు. అసలు వాడికింత ధైర్యం ఎలాగొచ్చిందబ్బా!? దొరగారికి నీతులు చెప్పే అంతటి వాడయ్యాడన్నమాట!!" అన్నవరం మొహంలో ఆశ్చర్యం తొణికిసలాడింది.

"వినాశకాలే విపరీత బుద్ధి అని వెధవకి రోజులు దగ్గర పడ్డాయి." శరభయ్య గొంతు కర్కశంగానూ భయంకరంగానూ వినిపించింది అన్నవరంకి. శరభయ్య కళ్ళలో ఎర్రటి జీర స్పష్టంగా కనిపించింది అతనికి. అన్నవరంకి భయమేసింది. నారయ్య మీద, అతని కుటుంబం మీద, విపరీతమైన జాలి ముంచుకొచ్చింది. ఎందుకంటే శరభయ్యకి ఎవరి మీద అన్నా అగ్రహం వచ్చిందంటే ఆ వ్యక్తికి భూమి మీద నూకలు చెల్లిపోయినట్లే.

"పోనీ దొరా....." అన్నవరం ఏదో చెప్ప బోయాడు.

"నువ్వూరుకో అన్నవరం" కసిరాడు శరభయ్య. అన్నవరం మాట్లాడ కుండా పెరట్లోకి వెళ్ళిపోయాడు.

శరభయ్యకి చాలా అసహనంగా ఉంది. నారయ్య చుట్టూ మనుషులుండబట్టి బతికి పోయాడు గానీ లేక పోతే, నారయ్య ఈ పాటికి పరలోకంలో ఉండేవాడు. ఎన్ని దారుణాలు చేసినా అందరికీ దొరికి పోయే అంతటి వెర్రి వాడుకాదు శరభయ్య. పడక కుర్చీలో మేను వాల్చి భారంగా కళ్ళు మూసుకున్నాడాయన. ఆలోచనలు ఈగల్లా ముసురుతున్నాయి ఆయన మస్తిష్కంలో. ఆ రోజు జరిగిన సంఘటన పదేపదే గుర్తుకు రాసాగిందాయనకి.

ఆ సాయంత్రం శరభయ్య పొలాల కేసి వెళ్ళాడు. అప్పటికి నాలుగు రోజులనుంచీ ఎడతెరిపి లేకుండా కురుస్తున్న వానల వల్ల రోడ్లన్నీ బురద మయమయ్యాయి. పల్లపు ప్రాంతాలన్నీ జలమయ మవుతున్నాయి. ప్రజలు పల్లపు ప్రాంతాలు ఖాళీ చెయ్య వలసిందిగా పోలీసువారు, రివెన్యూ అధికారులు మైకులు పెట్టి హెచ్చరికలు చేస్తున్నారు. ప్రజలు భీతి చెంది చేతులతో పట్టుకెళ్ళ కలిగే సామానులు, పిల్లల్ని వెంట పెట్టుకుని ఎత్తైన ప్రదేశాల్లో ఉన్న స్కూళ్ళు మొదలగు ప్రదేశాలకి చేరుకుంటున్నారు. అప్పటికి మెరకలో ఉన్న ధర్మసత్రం, స్కూళ్ళు జనంతో నిండిపోయాయి.

ఎం.వి.ఎస్.ఎస్. ప్రసాద్

నారయ్య కంగారుగా పరిగెత్తుకుంటూ శరభయ్య దగ్గరికి వచ్చాడు.

"దొరా.... దొరా... మా గూడెం మునిగి పోతా ఉంది...." ఆయాసంతో మాటలు సరిగ్గా రాలేదు నారయ్యకి.

"అయితే నన్నేం చేయమంటావు!!??" విసుగ్గా అడిగాడు శరభయ్య.

"తోటలో బంగలా ఉంది గదా దొరా.... అక్కడ కెళ్ళి తల దాచుకుందా మనుకుంటున్నాం.... తమరు ఒప్పుకుంటే...."

"ఛీ! ఛీ!... ఎంత ధైర్యం రానీకు..... అంటరాని వాళ్ళు నా బంగళాలోకా.... నేను ఛస్తే ఒప్పుకోను. ఇంకో చోట ఎక్కడన్నా ఏడవండి."

"అదేంటి దొరా అలాగంటారు. మేమూ మడుసులమేకదా."

"నోర్ముయ్యిరా అప్రాచ్యపు వెధవ. సినిమాలు చూసి చెడిపోతున్నార్రా మీరు. మీరూ మేమూ ఒకటేనట్రా!!?" కోపంగా అరిచాడు శరభయ్య.

"దొరా కష్టాల్లో ఉన్నాం మమల్ని ఆదుకోక పోతే ఎలా దొరా!?మీకు పుణ్యం వస్తాది. నలుగురి మంచి కోరినా, నలుగురికి మంచి చేసినా దేవుడు మన మంచి కోరతాడు దొరా."

"ఒరేయ్!!!... నాకు నీతులు చెప్పేటంతటి వాడి వయ్యావన్నమాట. నీ కులమేమిటి!? నా కులమేమిటి!!? నా అంతస్తు ఏమిటి!? నీ అంతస్తు ఏమిటి!?.... బంగళాలోకి చీమ కూడా ప్రవేశించడానికి వీలులేదు అంతే."

"దొరా... దొరా" బతిమాలుతున్న ధోరణిలో అడిగాడు నారయ్య. శరభయ్య ఏ మాత్రం చలించలేదు.

"నోరు మూసుకుని పో వెధవా అట్టే మాట్లాడకు."

"దొరా... పోనీ మాకు ఏదైనా డబ్బు ఇప్పించండి దొరా. బస్సులో ఊరొదిలి పోతాం. మరలా నీరు తగ్గాక ఒస్తాం దొరా... దొరా ఈ ఒక్క సహాయం చెయ్యండి దొరా."

"ఏరా ఇక్కడ మీ తాత సొత్తేమన్నా దాచాడను కున్నావా తేరగా తినడానికి. ఒక్క పైసాకూడా ఇచ్చేదిలేదు."

"మీరే అలాగంటే ఎలా దొరా!!? మీకు లేదా పోదా ఈ సమయంలో మమ్మల్ని ఆదుకుంటే దేముడు చల్లగా చూస్తాడు."

"ఇక నీ నీతులు ఆపి వెంటనే ఇక్కడ నుంచి పో."

"సరే దొరా పోతాను మీ కాడికి వస్తే పొమ్మన్నారు.... నేను సాటి మనిషి బాధపడుతూంటే

చాత నయినంత సహాయం చేసే వాళ్ళని చూశాను గానీ, మీ లాంటి వాళ్ళని చూడడం ఇదే ప్రథమం. అయినా మేము కూటికి పేదోళ్ళం కావచ్చు గానీ గుణానికీ, ధర్మానికీ కాదు."

ఓహో, భాగకర్మము. నీకే తిండి లేదు ఇంక మిగతా వాళ్ళని నువ్వేం ఉద్ధరిస్తావురా!? తాను దూరకంత లేదు మెడకో డోలు అన్నట్టు."

"దొరా మనసుంటే మార్గమే ఉండదా.... మనిషన్నాక జీవితం ధన్యం చేసికోవాల."

"ఒరేయ్ ఈ ఉత్తుత్తి మాటలకేం గానీ డబ్బురా.... డబ్బుదే ప్రపంచం.... అది లేనిదే నువ్వు ఎందుకు పనికిరావు తెలుసుకో."

"దొరా... ఇంకొకరికి సహాయం చేయడానికి డబ్బే అవసర మనుకుంటే అది చాలా పొరపాటు.... డబ్బు... హుం! డబ్బు చెయ్యలేనివి ఒక మనిషిగా మనం చెయ్యగలిగినవి ఎన్నో ఉన్నాయి..... నిజాయితీగా కష్టపడి బతికే వాళ్ళం దొరా.... మంచి, చెడూ, మానవత్వం అన్నీ ఉగ్గు పాలతో నేర్చుకున్నాం.... మీలా కాదు" అన్నాడు నారయ్య గంభీరంగా.

"అంటే.... అంటే...." శరభయ్య ఏదో అనబోయాడు. కానీ నారయ్య ఆ అవకాశం ఇవ్వలేదు. చుట్టూ ఉన్న మనుషులు జరిగిన దాన్ని వినోదంగానూ, ఆశ్చర్యంగానూ చూస్తున్నారు. శరభయ్య మొహం కందగడ్డలా మారింది......

ఆలోచనలోంచి తేరుకున్న శరభయ్య కోపం తారాస్థాయిని చేరుకుంది.

"వట్టి గొడ్డుకు అరుపులు మెండు అని ఆ వెధవ ఏమి చేయగలడు. అదీ తాను చేసే దానికంటే ఎక్కువ చేస్తాడట. 'ధన మూల మిదం జగత్' అని తెలియని పిచ్చివాడు.. తాను తల్చుకుంటే మొత్తం నారయ్య గాడి గూడెంలో అందరికీ బిల్డింగులు కట్టించి ఇవ్వగలడు. ఆ ఊర్లాంటివి వంద ఊళ్ళు కొనగలడు.... పైసాకు కొరగాని వాడేదో చేస్తాడట పిచ్చి వెధవ ఆవేశం ఎక్కువ, ఆలోచన తక్కువ. తనని ఎంత అవమానం చేసాడు ఎంత చులకనగా మాట్లాడాడు. రేపు వచ్చే ఎలక్షన్లలో ఇలాంటి వాడి వల్ల ప్రమాదం ఎంతైనా ఉంటుంది. ఆ గూడెం ఓట్లు పడక పోతే కష్టం. ఇక వాడికి చరమగీతం పాడడం మంచిది' అనుకున్నాడు శరభయ్య. ఆయన ఒక నిర్ణయానికి వచ్చాడు. రెండు రోజుల తరువాత నారయ్య ఏదో ప్రమాదంలో మరణించాడని తెలిసింది శరభయ్యకి. తేలికగా ఊపిరి పీల్చుకున్నాడాయన 'కాగల కార్యం గంధర్వులే చేసారు' అనిపించింది ఆయనకి. తన చేతికి మట్టి అంటకుండా పని సులభంగా జరిగి పోయినందుకు చాలా ఆనందంగా ఉందాయనకు. అన్నవరం ఆ వార్త తీసుకొచ్చి ఇంకేదో చెప్పబోయాడు.

"పీడా విరగడ అయ్యింది" అంటూ ఇంకేమి చెప్పవద్దన్నట్టు సంజ్ఞ చేసాడు శరభయ్య.

★ ★ ★ ★ ★ ★ ★

నెల రోజులు గడిచాయి. ఆ రోజు పొద్దున్నే శరభయ్య దగ్గరికి పరిగెత్తుకుంటూ వచ్చాడు అన్నవరం.




"దొరా ఈ ఊరికి కలెట్టరుగోరు వస్తున్నారంట!!"

"కలెక్టరుగారా!!? ఎందుకు?"

"మన నారయ్య ఉండేవాడుకదా అతని భార్యా పిల్లలని కలుసుకుని, ఏదో ఇస్తారంట"

"నారయ్య భార్యా పిల్లలనా!!?? ఎందుకు!!!??"

"అదే దొరా మొన్న వరదల్లో నారయ్య కష్టపడి చాలా మందని మునిగిపోకుండా రక్షించాడట.

# హలో డాక్టర్ నేనేం చేయాలి?



డా. కొత్త రవీంద్రబాబు

ఐ. ఉమాశంకర్, ఇల్లెందు.

నాకు నత్తి వుంది. పోవాలి. బిళ్లలు చెప్పండి.

ఇదివరకే ఉత్తరాలు రాసారు. నత్తి పోవడానికి స్పీచ్‌థెరపిస్ట్ దగ్గర తర్ఫీదు పొందవచ్చు. విజయవాడ సూర్యారావుపేటలో శ్రీ మనోహర్ అనే స్పీచ్ థెరపిస్ట్ వున్నారు. ఒంటరిగా వున్నప్పుడు బిగ్గరగా మాట్లాడటం త్వరగా మాట్లాడటం ప్రాక్టీసు చేసుకోండి.

జయసింహ.

స్వయంతృప్తి కలవడ్డాను. ఒకబీజం వాచి తగ్గింది. బీజాలసైజులో తేడావుంది.

హెట్రజాన్ వందమిల్లీగ్రాముల బిళ్లలు రోజూ మూడు చొప్పున పదిహేను రోజులు వాడండి. బీజాలలో తేడా వున్నందువలన భయంలేదు.

నగేశ్.

హస్తప్రయోగం వలన అంగం చిన్నదయింది. పెళ్లి చేసుకోవటానికి భయంగా వుంది.

మీలో ఏ లోపం లేదు. నిర్భయంగా పెళ్లి చేసుకోవచ్చు.

రాణి, ప. గో. జిల్లా.

లావుగా వున్నాను. ముఖాన నల్లని మచ్చలు.

ఆహారంలో తీపి పదార్థాలు కొవ్వుపదార్థాలు తగ్గించి బత్తాయి కమలా పండ్లు తినండి.

పాండోరాక్స్ బిళ్లలు ఉదయం సాయంత్రం, జెబెక్స్ బిళ్ల రాత్రి, నాలుగు నెలలపాటు భోజనానంతరం వాడండి.

కె. బి. కోటేశ్వరరావు, కేతనకొండ.

పదవ తరగతి చదివాను. కాలేజీలో చేరాలి. ఒక అమ్మాయి నన్ను రెచ్చగొడుతుంది. నాకు ఇప్పుడే సెక్స్‌లో పాల్గొనాలని లేదు.

తెలిసీ తెలియని వయసులో నిగ్రహం చూపకపోతే తర్వాత బాధపడాల్సి ఉంటుంది. రెచ్చగొట్టినా నిగ్రహం చూపు లేదా ఆ అమ్మాయిని కలుసుకోకుండాదూరంగా ఉంచు.

టి. లక్ష్మణరావు, మచిలీపట్నం.

మూలశంక వలన నీరసం. ఆపరేషన్ వీలుగాదన్నారు.

సర్జన్‌కు చూపండి. ఆపరేషన్ కుదరకపోతే మొలలలోకి ఇంజక్షన్ చేస్తారు లేదా క్రయోకాడరీ వలన రక్తస్రావం ఆగుతుంది.

ఈలోపు పైలెక్స్ బిళ్లలు రోజూ 3 చొప్పున 20 రోజులు వాడండి. షీల్డ్ ఆయింట్‌మెంట్ మొలలకు రాత్రిపూట రాయండి.

ఎస్. కృష్ణారావు, మార్కాపురం.

జుట్టూడిపోయి ఆందోళనగా ఉంది.

భోజనానంతరం జెబెక్స్ రోజుకొకటి చొప్పున రెండు నెలలు వాడండి. ఫలితం లేకుంటే రోజూ రెండుసార్లు మిం టాప్ రాసుకోండి.

బాషా, విజయవాడ.

మోకాలు వాస్తుంది. నిలబడి పని చేయాలి.

ఇండోకేప్ ఎస్.ఆర్. గొట్టం రోజూ రాత్రి భోజనానంతరం ఒకటి వాడండి.

ఎం. శ్రీహరి, తిరుపతి.

వయస్సు 18 సంవత్సరములు. హస్తప్రయోగం అలావాటుండేది. నిద్రలో ఇంద్రియ స్ఖలనం, శీఘ్రస్ఖలనం జరుగుతుంది. అందువలన కండలు పెరగవని భయం.

అవివాహితులలోనిద్రలో స్ఖలనం అసహజం కాదు. ఆ విషయంలో దిగులుపడవద్దు. వివాహానంతరం శీఘ్రస్ఖలనం బాధిస్తే వ్రాయండి.

కండలు పెరగడానికి, ఇంద్రియ స్ఖలనానికీ సంబంధం లేదు.

కె. జనార్ధన్, గుంటూరు.

మింటాప్ వాడితే బట్టతలమీద జుట్టు వస్తుందా ?

వాడినవారిలో మూడోవంతు మందికి బట్టతలమీద జుట్టు వస్తుంది - నాలుగు నెలల తరువాత.

## మనసుంటే...

అంతేకాకుండా ఊరి కుర్రాళ్ళనందరినీ కూడగట్టుకుని చెరువుకి గండిపడకుండా కాపాడాడంట. ఆ ప్రయత్నంలోనే [illegible] ఎత్తుమీద నుంచి పిడపడి నారయ్య పోయాడు కదా.... ఆసుపత్రిలో పోయే ముందు తన కళ్ళని గవర్నమెంటోళ్ళకి అప్పగించాడంట దొరా.... అదే తను పోగానే ఆ కళ్ళు వేరే వాళ్ళకి పెట్టేసిలాగ కాగితం రాసిచ్చాడంట.... కలెక్టరుగారు ఈ విషయాలన్నీ తెలుసుకుని ఆ కుటుంబాన్ని సాయంగా చూసి అదేదో బహుమానం ఇత్తారంట.... బాబూ పేదోడు అయినా ఎంత ధనవంతుడూ కూడా చేయలేని గొప్ప పనులు చేసాడు ఆ నారయ్య. అందుకే అంటారు బాబూ మనసుంటే? మార్గముండదా అని"

శరభయ్యకి వీపు మీద ఎవరో కొరడాతో ఛళ్ళున చరిచినట్లయింది.

"ఇదిగో అన్నవరం......" అంటూ ఏదో చెప్పబోయాడు శరభయ్య.

"ఇప్పుడే వస్తా దొరా.... నారిగాడింటికెళ్ళాలి" అంటూ పరుగు తీసాడు అన్నవరం.

శరభయ్య వీధిలోకి వెళ్ళి నుంచున్నాడు. నారయ్య ఇంటికేసి ప్రజలు పరుగులు తీస్తున్నారు. అధికారుల హడావిడి పోలీసుల బూట్ల టకటకలు వినిపించ సాగాయి. ఒకరిద్దరిని పిలిచి ఏదో అడగబోయాడు శరభయ్య. వాళ్ళు వినిపించుకోలేదు. ఆఖరికి ఎప్పుడూ తన దగ్గర వంది మాగధులలా పడుండేవాళ్ళు కూడా శరభయ్య పిలుపుని వినిపించుకోనట్టే వెళ్ళిపోయారు. తలకొట్టేసినట్లయింది శరభయ్యకి. చెట్టంత మనిషి, ఆ ఊరి ప్రెసిడెంట్ అయినా తనని ఎవ్వరూ పట్టించుకోవడం లేదు. తాను బతికున్నా చచ్చినట్లు జమ కట్టేసారు. కానీ... కానీ... ఆ నారయ్య చనిపోయినా కూడా అతనికి బ్రహ్మరథం పడుతున్నారు, గౌరవిస్తున్నారు, ప్రేమిస్తున్నారు. అతని కుటుంబానికి అత్యంతమైన ఉన్నత స్థానాన్ని ఇస్తున్నారు. ఒక్కసారిగా శరభయ్య గర్వం, అహంకారం గాలి తీసిన బెలూన్లలా చప్పబడిపోయాయి. అతని జ్ఞాన నేత్రం తెరుచుకుంది. తన వ్యక్తిత్వానికి తానే సిగ్గుపడ్డాడు శరభయ్య

ఆ క్షణంలో నారయ్య ఒక మేరుపర్వతంలా, తానొక గులకరాయిలా అనిపించిందాయనకి.

నారయ్య మంచితనం, నిస్వార్థపరత్వంతో ఆ జిల్లాలో మొత్తం వీచిన గాలిలో తన ఆస్తి అంతస్తు కొట్టుకు పోయినట్లనిపించింది శరభయ్యకు. తన క్రూరత్వం, స్వార్థపూరిత వ్యక్తిత్వంతో నిండిన అధికారం, హోదా నారయ్య యశోతేజస్సు ముందు వెల వెల పోయాయని అర్థమయ్యిం దాయనకి. అప్పుడే వచ్చిన పేపరులో నారయ్య ఫోటో, అతని జీవిత విశేషాలు వేసారు. నారయ్య ఫోటోకి అప్రయత్నంగా నమస్కరించాడు శరభయ్య.

# యువతా! కవితా!!

## నగ్నసత్యాలు

ఇక్కడ
ఆకలి గీతాలు
చావు రాగాలు
ఆలపిస్తుంటాయ్
ఆత్మహత్యల సాక్షిగా.....

ఇక్కడ
అమాయక ప్రాణాలు
లాకప్ గాథలు
విన్పిస్తుంటాయ్
పోస్టుమార్టమ్ గదుల్లో
మిగిలిన లాకప్ శవాలసాక్షిగా....

ఇక్కడ
అమాయక అబలల జీవితాలు
కొత్తకాపురపు యజ్ఞంలో
కట్నం సమిధలై కాలుతుంటాయ్
వాళ్ళ అత్తమామలు అంటించిన
అగ్నిసాక్షిగా....

-దాకరపు బాబూరావు

## స్వప్నసుందరి

ఓ అందాల జాబిలి
అపురూప మోహిని
నీవే నా స్వప్నసుందరి
నా ప్రేమ మంజరి
కలనైన ఇలనైన నీ ధ్యానము
పలదన్న వినదమ్మ నా హృదయము
ఎప్పుడయిన, ఎక్కడయిన నీ నామము
తలచునమ్మ నా మనస్సు ప్రతినిమిషము
నీ ఊహలలో వూగి
నీ తలపులలో తేలి
ఉయ్యాల జంపాల వూగేను నేను

పూల ఉయ్యాల జంపాల వూగేను నేను.
ఈనాడు ఏనాడు నువ్వుంటే నా ప్రక్కన
నా మనస్సు నా మమత నీదే ఏ జన్మకైన
వలపులోన, తలపులోన
నేనుంటే నీలోన
నా తనువు నా బ్రతుకు
నీదే ఏనాటికయిన
నీ అందమంతా నాది
నా అనురాగమంతా నీది
ఈ బంధం అనుబంధం
నిలవాలి కలకాలము
ఇలా నిలవాలి కలకాలము.

- డి.పద్మజ

## సర్వాంతర్యామి

స్పెషల్ పూజలు... ప్రసాదాలు...
పూర్ణకుంభాలు
'సర్'కార్లకు!
'క్యూ'లు...
తొడ తొక్కిళ్ళు...
మెడగెంటుళ్ళు
'బి' కార్లకు !!
ఎంతయినా ఆయన
'సర్' వాంతర్యామి మరి.....!

-వి.ప్ర.




## 'తారుమారు'

'రైళ్ల చక్రాలు'
దేశ ప్రగతికి చిహ్నాలు!
ఇది
నాయకులు చేసే ప్రకటన!
ప్రభుత్వ పక్షంలో
వున్నప్పుడు.
'రైలు రోకో'
సమ్మెకు సరైన ఉద్యమం!
ఇది
నాయకులు తెలిపే నిరసన!
ప్రతిపక్షంలో
వున్నప్పుడు.

-పైడిమర్రి ప్రశాంతి

## ఎదురు చూపు

నత్తనడక నడుస్తూ
బయలుదేరిన నవ నాగరికత
వడివడిగా వెళుతున్న
స్థితి నుంచి
ప్రస్తుతం మెరుపువేగానికి మారింది!
రేపో మాపో అది
అలసటతో
ఆయాసంతో
ఆగకపోతుందాని
ఎదురు చూస్తున్నా!!

జి. బాలాజీ

## ఓ మనిషీ...

ఓ మనిషీ....
నీ స్థాయివాడు
నీకు శత్రువు
నిన్ను మించిన వాడు
నీకు ఆరాధ్యుడు
నీకంటే తక్కువ వాడు
నీకు హీనుడు
ఇది నీ నైజం
ఇది నీ సమాజంలో సహజం!
కాలితో గడ్డిపూవును నలుపుతూ
కనులతో గులాబీ అందాన్ని
మెచ్చుకుంటావు
అదీ కోయటానికే సుమా!
మానవత్వం లేని
నీవు రాయిలో
దైవత్వం కోసం
వెదుకుతావు
ఇది నీ నైజం
ఇది నీ సమాజంలో సహజం!

- జయ

## చీడ!

అంతరాత్మను మేథ జయిస్తే
అది ప్రాపంచికం!
మేథను అంతరాత్మ అణచితే
అది దైవత్వం!
మేథకు పదును పెట్టి
అంతర్వాణి గొంతు పిసికి
అవనిపై విల్లు వీగువాడు
మానవతనే కాలరాసి
ఔతాడు దానవుడు...
ప్రకృతికే చీడ అతడు!

- చిల్లర భవానీదేవి

సీరియల్

# కేరటాలు కేరింతలు

ఎమ్.హర

ఇంతవరకూ సాగినకథ:1 ప్రేమజంట శౌరి, ధీరలవి ఎదురుబదురు యిళ్లు. శౌరి తండ్రి శ్రీశైలం, ధీర తండ్రి సప్తగిరి బాగా ధనవంతు లవడంతో కాలక్షేమం పేదలపార్టీలో చేరారు. ఒకేపార్టీలో వుండగా పిల్లల ప్రేమకు పచ్చజండా వూపిన పెద్దలు పార్టీలు విడిపోవడంతో అడ్డుకట్ట అయ్యారు.

కూత బెడుతూ తండ్రులు కబాడీ ఆడుతూంటే, కాలేజీ చదువు పూర్తిచేసిన ధీరా, శౌరి కుయ్యో, మొర్రోమని కృంగిపోసాగారు.

అంతవరకు పచ్చజండా ఊపి, వాళ్ల ప్రేమకి ప్రాణంపోసిన శ్రీశైలం, సప్తగిరి ఇప్పుడు రెడ్ లైట్ చూపించి హంతకుల్లా మారారు. ఆ ప్రేమికు లిద్దరూ కలవకుండా తమ పెద్దరికంతో కట్టడిచేశారు. తమ మాట పెడచెవినపెడితే ప్రాణాలు తీస్తామని బెదిరించారు.

ధీరా, శౌరి ఆ అదిలింపులకి హడలిపోలేదుగాని, తెగేవరకు లాగితే తమకే నష్టమని మౌనం వహించారు. మొండివాడు బలవంతుడని, దుస్సాహసం కూడదని, తండ్రుల ముందు తల ఊపి, చాటుగా కలుసుకోసాగా రా ప్రేమికులు. ఆర్థిక స్వాతంత్ర్యం వుంటేగాని తమ ప్రేమ కలకాలం నిలవదని ఉద్యోగాలకై ఎగబడ్డారు. కొలువు దొరకగానే కళ్యాణమని చూపుల కోలాటంతో కాలక్షేపం చేయసాగారు.

**ఎన్నికల పండుగ ముగిసింది. శ్రీశైలం చిత్తుగా ఓడిపోయాడు. సప్తగిరికి డిపాజిట్ దక్కలేదు.**

**ధనం పార్టీ అభ్యర్థికామి గెలిచాడు.**

ఎన్నికల పుణ్యమాని తన ఆస్తి మూడు వంతులు తాకట్టులో వుందని విలపించలేదు శ్రీశైలం. కానీ సప్తగిరి ఆస్తి సగానికి పైగా అమ్ముడు పోయిందని ఆనందించాడు.

ఇంట్లో పితృదేవో భవః అంటూ బయట ప్రేమే దైవమని, తీరిక సమయాల్లో ప్రేమించుకుంటూ, ఉద్యోగాల వేటలో వున్నారు ధీరా, శౌరి. ఊరి చివరన శిధిలమైన పార్క్‌లో రహస్యంగా కలుస్తూనే వున్నారు. గుస గుసలాడుతూనే వున్నారు.

(గత సంచిక తరువాయి)

"ఎప్పుడో ఆపద వస్తుందని ఇప్పుడు విచారించడం, ఆరు నెలల తరువాత చెల్లించవలసిన వడ్డీని నేడే అప్పు చూసి ఇవ్వడమంత అవివేకం. మనమిలా బిగుసుకుపోయి ఉద్రేకానికి బదులు ఉక్రోషాన్ని పెంచుకుంటే బ్రతికి బట్టకట్టలేం. రేపు అనేది వుంది...ధీరా....." అనునయనంగా ఆమెకి ధైర్యం చెప్పసాగాడు శౌరి.

ఆ శిధిలమైన పార్క్‌లో వాళ్లిద్దరికీ, రాయివేటు దూరంలో మరో ప్రాణి లేదు.

"రేపు అనేది వుంది. అది ఎలా వుంటుందో నీకు తెలుసా? ఉన్నపళంగా నాకు పెళ్లి చేయాలని మా నాన్న గొడవ చేస్తున్నాడు. ఎలక్షన్స్ రోజులే మనకి హాయిగా గడిచాయి. మన వూసు మరిచి ఎన్నికల్లో కూరుకుపోయారు. ఇప్పుడు సాధించడానికి ఏంలేక మన మీదపడ్డారు. మధ్యంతర ఎన్నికలొస్తే బాగుండును." కరకరలాడే తన కోపాన్నంతా కుమ్మరించింది ధీర.

"మనకి అంత అదృష్టం కూడానా? నీలాంటి కష్టాలే నాకూ వచ్చాయి."

"నీకూ పెళ్లి ప్రయత్నాలు జరుగుతున్నాయా" ఆశ్చర్యంగా అందామె.

"మా నాన్నకి బెదిరింపు లేఖలు వస్తున్నాయి. వాటికి తట్టుకోలేక నాకు పెళ్లి చేస్తానంటున్నాడు."

"ఆ ఉత్తరాలు మా నాన్నే రాసి వుంటాడు. చంపుతాను కాసుకో అంటూ ఫోన్లు చేయడం, లెటర్స్ రాయడం మా నాన్నకి అలవాటే. మీరు కంప్లైంట్ ఇవ్వండి. నేను సాక్ష్యం చెబుతాను. మా నాన్న జైల్లో కూర్చుంటాడు. మనం ఇంచక్కా ప్రేమించుకోవచ్చును." హుషారుగా అంటూ గబుక్కున ఆగి కళ్లు చిట్లించి "మా నాన్న బెదిరింపుకీ నీ పెళ్లికి సంబంధం ఏమిటి?" అనుమానంగా చూసింది.

"మా నాన్నని హత్య చేస్తామంటూ ఉత్తరాలొస్తే పోలీస్ స్టేషన్‌కి వెళ్లను. మునిసిపల్ ఆఫీసులో మా నాన్న డెత్ రిపోర్టు ఇస్తాను. ఘనంగా కర్మకాండ చేస్తాను.



అయినా నా చేతుల్లో తగలడే యోగ్యత మా నాన్నకి వుండద్దూ. అది సరేలే. అసలు విషయానికి వస్తాను. మా ఆస్తి మార్టిగేజ్‌లో వుంది. వెంటనే అప్పుతీర్చకపోతే తాకట్టు వాకట్టు అవుతుందని లాయర్ నోటీసులు వస్తున్నాయి. ఆ బెదిరింపు లేఖలకి భయపడి నన్ను అమ్మడానికి హైదరాబాద్ వెళ్లాడు మా నాన్న" ఏడ్పు ముఖం పెట్టలేదుగాని ఉక్రోషంతో ఉడికి పోతున్నాడు శౌరి.

"కర్మ......కర్మ.....మా నాన్నకి తోడు మీ నాన్న కూడా హైదరాబాద్ వెళ్లాడా? ఇక మనం ప్రిపేరు కావలసినది ఉద్యోగాలకి కాదు, పెళ్లి పరీక్షలకి" హేళనా మిళితంగా అంది.

"అంత సులభంగా సంబంధాలు సెటిల్ అవుతాయా" శౌరి అమాయకత్వం.

"వివాహం వ్యాపార పరమయింది. దానికీ బ్రోకర్లు వున్నారు. క్షణంలో బేరం సెటిల్ చేస్తారు. అందుకని మన జాగ్రత్తలో మనం వుండాలి" ముందు చూపుతో చెప్పసాగింది. కింకర్తవ్యమని ప్రశ్నగుర్తులా మారాడతను.

"మనం రూట్ మార్చాలి. ప్రస్తుత కాలమాన పరిస్థితుల ప్రకారం లంచం, సిఫార్సు లేకుండా ఉద్యోగం దొరకదు. మనకాళ్ల మీద మనం నిలబడితేగాని పెద్దల్ని ఎదిరించలేం. పది రోజుల క్రితం నేను కె.డి. ఆఫీసులో జరిగిన ఇంటర్వ్యూకీ, నువు బి.ఎ.డి. ఆఫీసులో జరిగిన ఇంటర్వ్యూకి వెళ్లాం. రిజల్ట్సు ఇంకా రాలేదు. మనం వెంటనే ఉత్తరం, దక్షిణంగా ప్రయాణిస్తేనే మన ప్రేమ నిలుస్తుంది. నువ్వే దిక్కుకి వెళ్తావు" నేరుగా అతన్ని ముగ్గులోకి లాగింది ధీర సాలోచనగా.

విషయం అర్థం చేసుకున్న శౌరి "నేను దక్షిణం" అంటూ భయకంపితుడై "ధీరా..... మనం పారిపోవాలి" అంటూ చివాల్నలేచాడు.

కూతవేటు దూరంలో మదించిన ఏనుగుల్లా వస్తున్న గూండాగరుడా, కె.డీ నంది ఘర్షణ పడుతున్నారు.

"ప్రమాదం ముంచుకువస్తున్నది. రేపే మన ప్రోగ్రాం అమలుపరచాలి. కమాన్-రన్" కాళ్లకి బుద్ధి చెప్పింది ధీర పిసరంత భయం భయంగా.

అప్పటికే వెనక్కి తిరిగి చూడకుండా పరిగెడుతున్నాడు శౌరి.

పగబట్టిన పాముల్లా కలియబడుతూ, రంకెవేస్తూ ముందుకురుకుతున్నారు గరుడా నంది.

## 2

కోపానికి మారు పేరైన భర్త అంటే మంగమ్మకి భయం. అయినా చొరవ తీసుకుని ధీర పెళ్లి విషయంలో సప్తగిరి మనసు మార్చాలని ధీర్ఘాలు తీసింది.

"ఆడపిల్ల కలవాళ్లం. ఎగిరెగిరి పడితే ఎలా? నష్టపోయేది మనమే. అనవసరపు పట్టుదలలకి పోయి అమ్మాయి జీవితాన్ని నాశనం చేయకండి. మీరు పెద్ద మనసుతో అడగాలేగాని శ్రీశైలం అన్నయ్యగారు దనరు. పిల్లలు ముచ్చటపడుతున్నారు."

"అప్పు నీ దండకం. నాపై కత్తిగట్టిన వాడి కొడుకు కాళ్లు కడగాలా? సిగ్గు లేకపోతే సరి. ఏదో తెలిసీ తెలియని వయసులో కలిసి తిరిగారు. అంతమాత్రానికే పెళ్లి చేయాలా? అయినా ఆ వెధవని మనధీర పూర్తిగా మరిచిపోయింది." భార్యపై వొంటికాలిపై లేచి ధుమ ధుమలాడాడు సప్తగిరి.

హూఈజ్‌హూ పుస్తకం తిరగేస్తున్న ధీర "నాకోసం ఎందుకలా కట్లాడుకుంటారు. అసలు నేనిప్పుడు పెళ్లి చేసుకోను" కసరి నట్లు గొణికింది.

"చేసుకుంటాననా చేసుకొనే వాళ్ల ఎవరు" కొంచెం దాష్టికంగానే ఈసడించింది మంగమ్మ.

కూతురి ప్రేమాయణం కోడైకూస్తున్నది. లోకం మెచ్చేలా భారీ కట్నమిచ్చి పెళ్లి చేద్దామంటే అప్పులతో ఆర్థిక పరిస్థితి అధ్వాన్నంగా వుంది. అందుకే ఆవిడ కూతురి పెళ్లికై మథనపడుతున్నది.

తండ్రిని రెచ్చగొట్టేలా తల్లి మాట మిగలడంతో తల్లడిల్లింది ధీర. తన వాక్‌చాతుర్యంతో సర్ది చెప్పడానికి శతవిధాల ప్రయత్నించింది.

ముగ్గురి మధ్యన సాగిన మాటల కోలాటం సప్తగిరి ప్రతిజ్ఞతో ముగిసింది.

"నేనీ రాత్రికే హైదరాబాద్ వెళ్తున్నాను. అక్కడ భారీ పెళ్లి కొడుకులు విరివిగా దొరుకుతారు. మన అంతస్తుకి మించిన అల్లుడి బేరం సెటిల్ చేస్తాను. ఘనంగా ధీరకి పెళ్లి చేస్తాను."

ఉద్రేకంగా వూగిపోతూ గరుడని ఇంటికి కాపలాపెట్టి రైలెక్కేశాడు సప్తగిరి.

"అమ్మగారూ...అమ్మాయిగారు వచ్చారా అని గరుడ పిలుపు బిగ్గరగా వినబడగానే ఉలిక్కిపడింది మంగమ్మ. గతరాత్రి స్మృతుల నుంచి తేరుకుంది. బాహ్య లోకానికి వచ్చింది.

గరుడని తేరిపార చూస్తూ "ఏమిట్రా ఆ దెబ్బలు-" అంటూ నొచ్చుకుంది.

"నందిగాడిని బాగా మేపుతో మచ్చిక చేసుకుని నాపైకి ఉసికొల్పుతున్నాడు శౌరి. చిన్నమ్మాయిగారిని మాటలతో మభ్యపెట్టి అన్యాయం చేయాలనే పెద్ద ఎత్తులో వున్నారు. వాళ్ల అంతు చూస్తాను" బీరాలు పలుకుతూనే బాధగా బెలూన్‌లా ఉబ్బిన బుగ్గలు తడుముకున్నాడు గరుడ.

"వాళ్ళకిదేం పోయే కాలం"

"అయ్యగారి మీద పగ. ఈ రోజు ఏదో అఘాయిత్యం చేయాలనే నందిని ఇంట్లో కట్టేశాడు శౌరి. అమ్మాయిగారిని అప్రమత్తంగా వుండమనండి."

ప్రత్యర్థి ఎత్తు చిత్తు చేయాలనే ఆలోచనలో వున్నాడు.

"వీడి ప్రేమకూల. మమ్మల్ని సాధించడానికి ధీరపై అత్యాచారం చేస్తాడా."

భయంతో కంపించింది మంగమ్మ.

"మీరేం బెంబేలు పడకండి. ఈ రాత్రికి నేనిక్కడే పడుకుంటాను" అంటూ వరండాలో నడుం వాల్చాడు గరుడ.

వీధి తలుపు వేసి లైట్ ఆర్పి ధీర గదిలోకి తొంగి చూసింది మంగమ్మ. ఆదమరిచి నిద్రపోతున్న కూతుర్ని చూసి తేలికపడ్డ మనసుతో తన గదిలోకి వెళ్ళింది.

అంతవరకు నిద్ర అభినయిస్తున్న ధీర



అంతా గమనిస్తూనే వుంది.

స్లీపింగ్ పిల్స్ వేసుకుని నిద్రాదేవి ఒడిలోకి జారింది మంగమ్మ. పిల్లిలా లేచిన ధీర మెరుపులా ఫోన్ అందుకుని డయల్ చేసింది.

"హల్లో.....శ్రీకామి పి.ఏ. స్పీకింగ్" అని అవతల వైపు నుంచి వినబడగానే "కాబోయే మినిష్టర్‌గారు లేరా" అంటూ సన్నాయి నొక్కులు నొక్కింది.

"ఎలా వుంటారు. మీరు అభినందించారుగా ప్రమాణ స్వీకారం చేయడానికి హైదరాబాద్ వెళ్లారు."

"ఎప్పుడు వస్తారు" సంభాషణ పొడిగించింది ధీర మెరుపులాంటి ఆలోచనతో.

"ఇప్పుడే ఎంత అరగంట క్రితం వెళ్లారు. తన పేరులోనే కాబోయే మినిష్టర్‌ని గుప్తపరచిన శ్రీకామికి ఈసారి మంత్రి పదవి ఖాయం అని ఈవినింగ్ పేపరు న్యూస్ చూడగానే హైదరాబాద్ బస్సెక్కేశారు. నేను వెళ్తున్నాను. ఏమైనా అర్జంట్ పనా."

"అంత అర్జంట్ పని కాదు. జిడ్డు వ్యవహారం. వారు వచ్చాక ఫోన్ చేస్తాను" అంటూ రిసీవర్ పెట్టేసిన ధీర ముఖం వికసించింది.

ఇక ఆలస్యం చేయలేదు. ఇంకో నెంబరు తిప్పింది. అవతల వైపు నుంచి "కె.డి. ఆఫీసర్ హియర్" అని వినబడగానే "అయామ్

## కెరటాలు- కేరింతలు

లేడీ అసిస్టెంట్ టు కాబోయే మినిష్టర్" ఉరఫ్ శ్రీకామి." అంటూ గొంతు మార్చింది ధీర.

"నేనిప్పుడే డా"ర్క్" ఎడిషన్ చూశాను. కామిగారికి నా అభినందనలు చెప్పండి."

"మీ కోసం ఎనిమిది గంటల నుంచి కామిగారు ఫోన్ చేస్తూనే వున్నారు. టి.వీ.లో చిత్రలహరి చూస్తున్నారా" అధికారం చెలాయించింది.

"అన్నన్న ఎంతమాట. అంతా టెలిఫోన్ డిపార్టుమెంట్ మహత్యం. ఏదో నా అదృష్టం బాగుండి ఇప్పటికి మీ కాల్ అందింది. అయినా వారు నాకు ఫోన్ చేయాలా?

**మాట!**

ఇద్దరి మనుషుల మధ్య
చీలుస్తుంది నిశ్శబ్దాన్ని!
ఇద్దరి మనుషుల మధ్య
చేరుస్తుంది నిశ్శబ్దాన్ని!
రెండు మనసుల మధ్య
కురిపిస్తుంది మంటల్ని!
రెండు మనసుల మధ్య
మురిపిస్తుంది మమతల్ని!

—రాప్తాడు గోపాలకృష్ణ

కాకితో కబురంపితే రానూ."

"కాకులు రాత్రివేళ తిరిగ్గా వుండవని, నా కోకిల స్వరంతో మీకో మెసేజ్ ఇవ్వమని యిప్పుడే....ఎంత....పది నిమిషాల క్రితం కారులో హైదరాబాద్ వెళ్లారు...నేనూ ఇంకో అయిదు నిమిషాల్లో బస్సెక్కుతున్నాను" మాటలు నానుస్తున్నది.

"వారేం తెలవిచ్చారో చెప్పారు కాదు" అవతల వైపు అడుగ్తా.

"పదిరోజుల క్రితం మీ ఆఫీసులో ఇంటర్వ్యూ జరిగింది."

"మన కాండిడేట్ ఎవరైనా వున్నారా?"

"కామిగారి రికమండేషన్ లెటర్‌తో క్షేమ అనే అమ్మాయి రేపు మీ ఇంటికి వస్తుంది. ఆ అమ్మాయికి జాబ్ ఇవ్వాలి. అన్నట్లు చెప్పడం మరిచాను ఆ పిల్లది మనకులమే."

"మీరంతగా చెప్పాలా? నా ట్రాన్స్‌ఫర్ విషయం....." అంటూ నసగసాగాడు కె.డి. ఆఫీసర్.

అతని మాటలకి అడ్డువస్తూ "రేపు రాత్రి హైదరాబాద్ నుంచి ట్రంకాల్ చేస్తారు. తిరిగ్గా మీ కథ చెబుతారు గాని. ముందు మా కాండిడేట్ సంగతి చూడండి" పొడిపొడిగా అంటూ ఫోన్ పెట్టేసింది ధీర.

తన ప్లాను పారుతున్నందుకు ఆనందిస్తూ కామిరాసినట్లు సిఫార్సు లేఖ తయారు



## ప్రాణం విలువ పతకమా?

తమిళనాడు, కర్నాటకల్లోని అటవీ ప్రాంతాల్లో వున్న చందనాన్ని అక్రమంగా స్మగ్లింగ్ చేస్తున్న ముఠాను పట్టుకునే సందర్భంగా వారి తూటాలకు బలైపోయిన కర్నాటక పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టర్ శ్రీ డి. జగన్నాథ్. స్మగ్లింగ్ కార్యకలాపాలను విచ్చల విడిగా కొనసాగిస్తున్న వీరప్పన్ ముఠాను కర్నాటకలోని ఎం. ఎం. పర్వత ప్రాంతాల్లో వెంబడించిన పోలీసులపై ఆ ముఠా కాల్పులు జరిపినప్పుడు ముగ్గురు సబ్ ఇన్‌స్పెక్టర్లు, ఒక కానిస్టేబుల్ చనిపోయారు. వారిలో శ్రీ డి. జగన్నాథ ఒకరు. ఈ సంఘటన జరిగిన వారం రోజులముందు తాను పోలీసు శాఖలో చేసిన విశిష్ట సేవలకు గుర్తింపుగా లభించిన స్వర్ణ పతకాన్ని తన చిట్టి తండ్రికి చూపించుకొని మురిసిపోతున్న జగన్నాథ్, తనకు త్వరలో నే ఆయువు మూడబోతున్నదన్న విషయాన్ని తెలుసుకోలేక చిద్విలాసంలో మునిగి తేలుతున్నారు. అందుకే విధి వ్రాతను ఎవ్వరూ మార్చలేరంటారు. ఆ ముఠాను పట్టుకొనివుంటే యింకెన్ని పతకాలు లభించేవో? మళ్ళీ పతకాలు ఎక్కడ సంపాదిస్తాడోనని కాబోలు దేవుడు ఆ ముఠా రూపంలో ఆయనను తన దగ్గరకు తీసుకు వెళ్లాడు.

చేయసాగింది ధీర.

*** *** *** ***

రాత్రి పది గంటలు దాటినా విసుగూ విరామం లేకుండా పట్టువదలని విక్రమార్కుడిలా నోట్ల కట్టల కోసం ఇల్లంతా ఎక్స్‌రే కళ్లతో గాలిస్తున్నాడు శౌరి. పెట్టెలూ, ఇనప్పెట్టె జల్లించాడు. చిల్లర పైసలు రాలాయి.

బ్లాక్‌మనీ చీకటిలో వుంటుందని అతని మెదడులో ఆలోచన మొలిచింది. ఆశగా అటకెక్కాడు. గుండిగలూ, గంగాళాలూ, నేతి జాడీలు, వడి జాడీలు, పాత డబ్బాలు తడిమి తడిమి బూచాడిలా మారాడు. రెట్టించిన పట్టుదలతో తుప్పుపట్టిన ట్రంక్ పెట్టె తెరిచాడు.

ఆ పెట్టెనిండా పుస్తకాలున్నాయి. జనాకర్షణ గ్రంథం విదిలించాడు శౌరి. జలజలా రాలాయి యాభైరూపాయల నోట్లు.

అతని ముఖం చింకి చేటంత అయింది. హుషారుగా 'హౌటూ అపోజ్ అపోజిషన్' బుక్ తీయగానే హండ్రెడ్ రూపీస్ వాన పడింది.

లంకె బిందెలు దొరికినంత సంబరంగా ఓ పెద్ద బైండు పుస్తకం తీశాడు. కాలండర్ బర్త్‌డేకి సూట్ అయ్యే డ్రాయర్లు, జనీన్లు, సాక్సులు, క్రాఫ్‌లు వగైరాల శీర్షిక పేజీల్లో అతనికి ఇరవైరూపాయల నోట్ల బొత్తులు దొరికాయి. పంచాంగం ప్రకారం మీ తిథికి కంచం, నక్షత్రానికి మంచం మీరాశికి సరిపడే వేశ్య అనే శీర్షిక పేజీల్లో అతనికి చాలా నోట్లు చిక్కాయి.

పోగు చేసిన నోట్లు లెక్కించి పదివేలు దాటాయని గుర్తించిన ఆనందంతో 'హిప్ హిప్ హుర్రే' అని అనాలోచితంగా కేకవేస్తూ అటకమీంచి క్రిందికి దూకాడు శౌరి.

అపరిమిత ఆనందమే అనేక అనర్థాలకి మూలం.

అతని కేకలకి భళ్లున కళ్లు తెరిచింది గంగమ్మ. అటక క్రింద ముద్దగా పడి వున్న ఆకారాన్ని చూసి దడుచుకుని "దొంగ..... దొంగ...." అని కేక వేయబోయి కొడుకుని ఆనవాలు పట్టింది. ఆశ్చర్యంగా మాటలు సాగదీసింది.

"శౌరీ....ఏమిట్రా చీకటిలో దేకుతూ వెతుకుతున్నావు. లైట్ వేసుకోకూడదూ."

"దెయ్యాలమ్మా...దెయ్యాలు...నాకల్లోకి వచ్చి పీక్కుతింటున్నాయి. ఆంజనేయస్వామి దండకం కోసం వెతుకుతున్నాను. లైట్ వేస్తే దెయ్యాలు పారిపోతాయి. రెడ్ హ్యాండెడ్‌గా వాటిని ఆంజనేయస్వామికి అప్పగించాలని... ఇలా చీకట్లో ఈదుతున్నాను. దండకం ఎక్కడుందమ్మా."

నారాలుబోతూ తల్లిని మభ్యపెడుతూనే, బెణికిన కాలుని, చేతిని తన స్వాధీనంలోకి తెచ్చుకోలేక తెగ ఇబ్బందిపడుతున్నాడు శౌరి.

"అసలు ఆకారమే లేని దెయ్యాలకి దడిస్తే ఈ జనారణ్యంలో ఎలా బట్టకడతావురా పిచ్చి సన్నాసి. నువ్వింత పిరికిగొడ్డువి కాబట్టే మీ నాన్న ఆటలు సజావుగా సాగుతున్నాయి. నువ్వు అనుభవించవలసిన మీ తాతల తాతల ఆస్తినంతా మీ నాన్న రాజకీయ జూదంలో తగలేస్తున్నారు. నువ్వు ధైర్యం తెచ్చుకోవాలి. దండకం ఎక్కడుందో తెలీదుగాని అమ్మవారి కుంకుమ నా దగ్గరుంది. బొట్టెట్టుకుని స్పెల్లింగ్ మిస్టేకులు లేకుండా దేవీ ఖడ్గమాల స్తోత్రం పారాయణం చేయి. ఆ తల్లి కరుణించి నీ భయాన్ని పోగొడుతుంది. ఆ దేవి అభయమే మన దిక్కు" అంటూ తాను కూడా బొట్టెట్టుకుని కన్నీళ్లు పెట్టుకుంది గంగమ్మ.

ఆ కన్నీళ్ల వెనక గతం పొరాడుతున్నది.

మరిచిపోలేని సంఘటన కదలాడుతున్నది.

వినకూడని మాటలు చెవుల్లో పోరాడుతున్నాయి.

(ఇంకా వుంది)

# ప్రతిఫలం

## ప్రఫుల్లచంద్ర

**ముద్రారావు వెనుక తాతలు మిగిల్చిపోయిన బోలెడు ఆస్తి వుంది. తండ్రి ఒదిలి పెట్టిపోయిన ప్రింటింగ్ ప్రెస్ వుంది. అతని గుండెనిండా ధైర్యం, తల నిండా లెక్కలూ వున్నాయి.**

ఆన్సర్ దొరకని ఒక లెక్కతో సతమతమౌతూ-తన "ఛాంబర్స్"లో కూర్చుని గంభీరంగా అరమోడ్పు కన్నులతో స్ప్రింగ్ డోర్స్ వైపు చూశాడు ముద్రారావు.

ఆ చిరు డోర్స్ వెనుక -

లోనికి వెళ్లాలా - వద్దా అని పది నిముషాలనుండి మధనపడిపోతూ నిలచి వుందొక నీడ.

ఆ నీడ రచనల్రావుది! అతడు ముద్రారావుకు చిననాటి మిత్రుడు.

రచనల్రావు వెనుక తాతలు మిగిల్చిపోయిన తాళపత్ర గ్రంథాలు, ప్రబంధాలు, నీతిశతకాలూ వున్నాయి. తండ్రి ఒదిలిపోయిన తనఖా దస్తావేజు లున్నాయి. అతని తలనిండా ఆలోచనలు, గుండెనిండా ఆశలూ, పిక్కలనిండా బలం వున్నాయి.

ఒకప్పుడు ఉద్యోగమూ వుండేది. ఇప్పుడు లేదు. అయితే పిక్కల్లో బలం వుంది కాబట్టి, కాళ్లకి బలపాలు కట్టుకొని పత్రికల ఆఫీసులచుట్టూ తిరిగాడు. ప్రింటింగ్ ప్రెస్‌లచుట్టూ ప్రదక్షిణాలు చేశాడు.

ఉద్యోగంకోసం ఎవరైనా ప్రభుత్వ ఆఫీసుల చుట్టూ తిరుగుతారు కాని అతడా పనిచేయలేదు. అందుకు కారణమూవుంది!

అతని ఊపిరి - రచనలు!

అతని ఆలోచనలు - రచనలు!!

అతని పెన్ పేరు - రచన!

అతని పేరే - రచనల్రావు!!

పత్రిక ఆఫీసుల్లో తప్ప యితర ఆఫీసులలో అతనికి ఊపిరి ఆడదు. రోజుకోసారి ప్రింటింగ్ ప్రెస్ చూస్తేగాని అతని గుండె కొట్టుకోదు!

ఆ ప్రెస్ చూశాక, దాని యజమాని- తన చిన్ననాటి స్నేహితుడే అని గుర్తుకు తెచ్చుకున్నాక రచనల్రావు మనసు ఆగలేదు. పదిపైసలు పెట్టి మరమరాలు కొని మూటకట్టుకొచ్చి అదిగో అలా స్ప్రింగ్ డోర్స్‌కి అతుక్కుపోయాడు.

తీరా లోనికి వెళ్తే- స్నేహితుడు తనని గుర్తిస్తాడో లేదో, గుర్తించినా "మరమరాలు తెస్తావురా, ఫూల్! నేనంత చవకగా కనిపిస్తున్నానా? గెట్ అవుట్" అంటాడేమోనని సంశయం......

అలా పదినిమిషాలు గుంజాటనపడి- చివరకు ధైర్యం చిక్కబట్టి, తలుపులు గట్టిగా నెట్టి "హాయ్! ముద్రలూ!" అని అరుస్తూ ముందుకు దూసుకుపోగా-

కుర్చీలో కూర్చున్న ముద్రారావు త్రుళ్ళిపడి, రచనల్రావుని చూసి గుర్తించినవాడై, ఒక్కసారిగా కుర్చీలోనుంచి లేచి టేబుల్‌ని మీదుగా ఒక్క దూకు దూకి స్ప్రింగ్ డోర్ వైపు దూసుకురాగా-

పట్టాలు తప్పిన రైళ్ళులాగ అటు ముద్రారావు గోడని ఢీకొని "హబ్బా!" అని అరవగా, ఇటు రచనల్రావు టేబుల్ గుద్దుకొని "హమ్మా" అని అరిచాడు!

తర్వాత యిద్దరూ వెనక్కి తిరిగి కుంటుతూ నడిచివచ్చి కౌగిలించుకొని ఆనంద బాష్పాలు రాల్చాలనుకున్నా అది రాలక ఆ ప్రయత్నం విరమించి యిద్దరూ టేబుల్ మీద కూర్చున్నారు.

భళ్ళుభళ్లున కబుర్లు చెప్పుకుని ఘొల్లుఘొల్లున నవ్వుకున్న తర్వాత ముద్రారావు టీ తెప్పించాడు. రచనల్రావు మూట విప్పి ఆ టీలో మరమరాలు పోశాడు. మరమరాలు నములుతూ, టీ తాగుతూ వుండగా రచనల్రావుకి ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది.

"ఇదిగో ముద్రలూ! నీ కెలాగూ ఒక ప్రెస్ వుందికదా. ఒక వారపత్రిక ప్రారంభించి నన్ను ఎడిటర్‌గా వేసుకోరాదూ?" అన్నాడు. కాస్త ఆశ, మరికాస్త వేళాకోళం కలగలిపిన స్వరంతో.

ముద్రారావు తలలో యింతవరకూ ఆన్సర్ దొరకని ఏదో లెక్కకు యిప్పుడు రక్కున ఆన్సర్ దొరికినట్లు అయింది.

తనది అత్యంత ఆధునికమైన ప్రెస్. కాని టౌన్ నిండా ఎక్కడపడితే అక్కడ ప్రెస్‌లుండటం వల్ల తన ప్రెస్‌లో చేతినిండా పనిలేదు. కాని వర్కర్స్‌మాత్రం జేబునిండా జీతాలు పట్టుకుపోతున్నారు. నిజమే! తను ఒక పత్రిక ప్రారంభిస్తే- వర్కర్స్‌కి చేతినిండా పని కల్పించవచ్చు- అదనపు జీతం యివ్వకుండా.

ముద్రారావు ముఖం గంభీరంగా మారిపోయింది. మరమరాలు నములుతున్న దవుడ ఆగిపోయింది. గబగబా మనసులోనే లెక్కలు వేసుకున్నాడు.

కొత్త పత్రిక కాబట్టి రచయితలకు పారితోషికం యివ్వనక్కరలేదు. రెండు మూడు వేల కాపీలు అమ్మగలిగితే లాభం నష్టం లేకుండా బయటపడవచ్చు. ముఖ్యంగా- వర్కర్స్ నుండి యిస్తున్న జీతానికి సరిపడా పని రాబట్టుకోవచ్చు.

రచనల్రావు- మిత్రుని ముఖం ఆసక్తిగా, ఆశగా పరిశీలిస్తున్నాడు.

"పోరా, నీ ముఖానికి పత్రిక ఒకటీ! నిన్ను నమ్ముకుని పత్రిక పెడితే చిత్తుకాగితాల వ్యాపారం చేయాలి!" అనలేదు ముద్రారావు. పైగా గంభీరంగా టేబుల్ మీద నుండి కిందకు దిగి కుర్చీలో రీవిగా కూర్చున్నాడు.

రచనల్రావుకి సూచన అందింది! తనూ టేబుల్ దిగి ఎదురుగా వినయంగా నిల్చున్నాడు.

"ఒరేయ్ ముద్రలూ! ఇకనుండి నిన్ను అలా పిలవను. నువ్వు పత్రిక పెడితే నిన్ను బాస్ అని పిలుస్తా. విధినిర్వహణలో మన స్నేహాన్ని వాడుకోను! భయపడకు!" అన్నాడు ఆశగా.

అప్పటికి తేరుకున్న ముద్రారావు చిన్నగా నవ్వేస్తూ "పత్రిక ప్రారంభించడానికేం గానీ, అసలు నువ్వు ఎడిటర్‌గా పనికొస్తావా అని!" అన్నాడు సగం అనుమానం, సగం వేళాకోళం కలగలిపి.

"రెండు మూడు పత్రికల్లో సబ్ ఎడిటర్‌గా పనిచేశాను, బాస్! చాకిరీ అంతా నాది, పేరు మాత్రం సంపాదకుడిది! అదికాక నా మనసుకు వ్యతిరేకంగా సంపాదకీయాలు రాయవలసివచ్చేది. అందుకు నేను అంగీకరించకపోవడం వల్ల ఉద్యోగం ఊడింది" అన్నాడు రచనల్రావు బాధగా.

భవిష్యత్తులో నన్ను కూడా ఎదిరించడుకదా వీడు!- అన్న అనుమానాన్ని- అప్పుడు మానుకోవచ్చులే- అన్న ధీమాతో ఆవలకు నెట్టి, అర్జంట్‌గా ఒక నిర్ణయాన్కి వచ్చేశాడు ముద్రారావు

* * * * * * * * * * *

ఉగాదినాడు "ఊహల ఊయల" కొత్త పత్రిక ప్రారంభం అయింది.

మొదట్లో పత్రిక సర్క్యులేషన్ అంతంత మాత్రమే. అయితే ముద్రారావు కోరిక నెరవేరింది. ప్రెస్ వర్కర్స్‌కిప్పుడు చేతినిండా పని! అదనపు ఖర్చులేదు. పత్రిక వల్ల నష్టం రాలేదు! అంతేచాలు!

అయితే రచనల్రావుకి ప్రతిభవుంది. దీక్ష వుంది. సత్తావుంది. తానేమిటో నిరూపించుకోవాలన్న పట్టుదల వుంది.

అతనికి ప్రజల నాడి తెలుసు.

కొత్త కొత్త శీర్షికలతో పత్రిక పుంజుకుంది.

నవలేష్ ఈ దశాబ్దపు రచయిత. రెండు చేతులతోనూ ఏక కాలంలో రెండు నవలలు రాయగల దిట్ట! అతని సీరియల్ వుందంటే

చాలు! పత్రికను ఎగరేసుకుపోతారు పాఠకులు.

అతనితో కాస్త పరిచయం వుంది. రచన్రావుకి.

ఆయన యింటికి వెళ్లేడు. ఆ సమయంలో ఆయన రెండు చేతుల్తోనూ రెండు నవలలు రాసేస్తున్నాడు.

రచన్రావుని చూడగానే చిన్నగా నవ్వి, కూర్చోమని సైగచేశాడు. ప్రక్కనే ఫోన్ మోగుతున్నా పట్టించుకోలేదు ఆయన. ఫోన్ ఎత్తితే - ఆ చేతితో రాస్తున్న నవల ఆగిపోతుంది మరి!

ఫోన్ మోగిమోగి ఆగిపోయాక - "మాకొక నవల కావాలండీ" అన్నాడు రచన్రావు వినయంగా.

"చూస్తున్నారుగా! రెండు చేతులకూ ఖాళీ లేదు. ఇక కాళ్లతో రాయడం నేర్చుకోవాలి" అని నవ్వేశాడు నవలేష్.

అంతమాత్రానికే ఒదిలిపెట్టే రకంరాడు రచన్రావు.

"మీ చేతులకు ఖాళీలేదు. నిజమే. కానీ నోరు ఖాళీగానే వుందికదా! మా బామ్మరిది కూడా ఖాళీగానే వున్నాడు. వాడ్ని మీ యింటికి పంపుతాను. మా కొక నవల డిక్టేట్ చేసి పెట్టండి. అదో కొత్తదనం! పైగా ఏకకాలంలో మూడు నవలలు సృష్టించిన ఘనత మీకు దక్కుతుంది. అదో రికార్డుకూడానూ! ఈ దెబ్బతో మీరు గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కవచ్చు" ఆశపెట్టాడు రచన్రావు.

గిన్నిస్‌బుక్‌లో దూరాలని అందరికీ ఉబలాటమే.

నవలేష్ వెంటనే ఒప్పుకున్నాడు.

కరెంట్ రాకడ, నవల పోకడ - ఎవరూ చెప్పలేరు. ఒక్కో నవలని దెయ్యాలూ భూతాలూ ఆకాశానికెత్తేస్తాయి. అవే భూతాలు మరో నవలని పాతాళంలోకి తొక్కేస్తాయి!

నవలేష్ రెండు చేతులతోనూ రాసిన రెండు నవలలూ, ఒక్క నోటితో డిక్టేట్ చేసిన నవలా - ప్రజల్లోకి ఒకేసారి వెళ్లాయికాని, డిక్టేట్ చేసిన నవల బ్రహ్మాండంగా క్లిక్ అయి ఊహలఊయలను ఆకాశానికి ఎత్తేసింది.

అధిక సర్క్యులేషన్ గల పాత పత్రికల సరసన రీవిగా కూర్చొని "హలో" అని పలకరించగల స్థాయికి ఎదిగింది కొత్త పత్రిక.

ముద్రారావు ఉప్పొంగిపోయాడు. రచన్రావు ఛాతీ ఉబ్బిపోయింది.

* * * * * * * * * * * *

జన్మదిన సంచిక అత్యద్భుతంగా తయారుచేయాలని రెండు నెలల ముందుగానే రచన్రావు ప్రయత్నాలు మొదలుపెట్టాడు. అనేకరకాల పోటీలు ప్రవేశపెట్టాడు.

ఉన్నట్టుండి అతనికో బ్రహ్మాండమైన ఐడియా వచ్చింది.

పాఠకులు తెలివిమీరిపోయారు. ఫలానా పత్రికలో కథలు ఫలానా విధంగా వుంటాయని ముందుగానే ఊహించగలుగుతున్నారు. సంపాదకుని అభిరుచులను వాళ్లు పసిగట్టగలుగుతున్నారు.

అందువల్ల కొన్ని లాభాలున్నా, నష్టంకూడా లేకపోలేదు. ఫలానా సంపాదకుడు వున్నంతకాలం ఆ పత్రిక చదవనక్కరలేదు! అని అభిప్రాయానికొచ్చేస్తారు కొందరు!

ఎంత ప్రమాదం!

తమ పత్రిక విషయంలో అలా జరగడానికి వీల్లేదు!

ఇంట్లో భార్య చక్కగా వండిపెడుతున్నా, బోర్ కొడుతుంది కొందరికి. అలాంటివాళ్లు కొంత కాలం హోటల్ భోజనం అడపా దడపా చేస్తేంటే చాలు యింటి భోజనంమీద మక్కువ పెరుగుతుంది.

లేదా తను వండిన కూరనే - పక్కింటి పుల్లమ్మగారు యిచ్చారు - అని చెప్పి వడ్డిస్తే చాలు, "చాలా బాగుంది స్మీ" అని మింగి కూర్చుంటారు మగమహారాజులు.

అందుకే తమ పాఠకులకు "హోటల్ భోజనం" వడ్డించాలనుకున్నాడు రచన్రావు.

వెంటనే నవలేష్‌గారింటికి వెళ్లి "మా జన్మదిన సంచికను మీరే ఎడిట్ చేయాలి సార్" అన్నాడు.

ఆయనకూ మనసులో ఆ కోరిక వుందిగాని తీరికేలేదు.

"సరే, ఆ తిప్పలన్నీ నేనేపడతాను. కాని గౌరవసంపాదకుడుగా మీ పేరు వేసుకుంటాం' అన్నాడు రచన్రావు పరిష్కారంగా.

తల వూపాడు నవలేష్.

నవలేష్ గౌరవ సంపాదకత్వం గురించి ప్రచారం జోరు అందుకుంది. పాఠకుల ఆసక్తి ఉప్పొంగింది.

జన్మదిన సంచిక సూపర్‌హిట్ అయింది.

ఆ ఉత్సాహంలో పాఠకుల కోరికమేరకు తర్వాత రెండు సంచికలకు కూడా నవలేష్ గౌరవసంపాదకత్వం "వహించాడు."

* * * * * * * * * * * *

ఇప్పుడు "ఊహల ఊయల" అత్యధిక సర్క్యులేషన్ గల పత్రిక.

దాని సంపాదకుడు - రచన్రావు కాదు! నవలేష్.

ఇప్పుడు రచన్రావు ఉద్యోగంకోసం పత్రికల ఆఫీసులచుట్టూ తిరుగుతున్నాడు!



ప్రఖ్యాతి చెందిన "మేడ్" మాగజైన్ అతడ్ని "జీన్సీ ఇండియన్ నట్"గా అభివర్ణించింది. అంతేకాదు– అతని కార్టూన్లతో మూడు పేజీల స్ప్రెడ్ ప్రచురించింది. 'ది వాషింగ్టన్ పోస్ట్', 'సాటర్ డే రివ్యూ' వంటి ఫారిన్ పత్రికలు అతడ్ని ప్రశంసిస్తూ వ్యాసాలు రాశాయి. అతడే ప్రసిద్ధ చిత్రకారుడు సుధీర్‌ధార్.

మరో ప్రముఖ కార్టూనిస్ట్ మేరియో మిరాండా అభిప్రాయం ప్రకారం "కాప్షన్"లెస్ కార్టూన్స్. అతి తక్కువగాను– పొదుపుగాను పదాలువాడి, గొప్ప కార్టూన్లు సృష్టించడంలో సుధీర్‌ధార్ మాష్టరే. సందేహంలేదు. నిరంతరం ఆ తరహా కార్టూన్లకు సంబంధించిన ఐడియాలు– ప్లాన్లతో బిజీగా వుంటారు...."

ఢిల్లీలోని 'హిందూస్తాన్ టైమ్స్' ఆఫీసుకు వెళ్ళినవారికి ఎవరికైనా ఇందులో అతిశయోక్తి ఎంతమాత్రం లేదనిపిస్తుంది. ఆరు అడుగుల రెండు అంగుళాలు ఎత్తు.

బట్టతల ఆసామీ సుధీర్‌ధార్ చాలా నిరాడంబరుడు కూడా.

అలహాబాద్ వాస్తవ్యుడైన సుధీర్ జాగ్రఫీలో మాస్టర్ డిగ్రీ చేశాడు. ఆల్‌ఇండియా రేడియోలో రెండేళ్ళు, ఎయిర్‌ఇండియాలో ఒక ఏడాది ఉద్యోగాలు చేశాడు. 1960లో 'ఔట్ ఆఫ్ మై మైండ్' శీర్షికన 'ది స్టేట్స్‌మన్' పత్రిక మొదటి పేజీలో పాకెట్ కార్టూన్స్ ప్రచురించడం ప్రారంభించి. 1967లో 'దిస్ ఈజ్ ఇట్' శీర్షిక 'హిందూస్థాన్ టైమ్స్'లో కార్టూన్లతో స్థిరపడ్డాడు.

సోషల్ సెటైర్స్ పేల్చడానికి మంచి అవకాశం వుందని చెప్తూనే, మన దేశంలో రాజకీయపరమైన కార్టూన్లు బాగా పేలతాయి అంటాడతడు. స్టేట్స్‌మన్ పత్రికలో పనిచేస్తున్నప్పుడు, అప్పటి ఎడిటర్ సుధీర్‌ధార్ కిచ్చిన ఇన్‌స్ట్రక్షన్స్ ప్రకారం "నో పాలిటిక్స్, నో వర్స్... ఓన్లీ ప్యూర్ హ్యూమర్" వుండాలంటే, అలాంటివే గీశాడు. మనవాళ్ళు జీవితాన్ని చాలా సీరియస్‌గా తీసుకుంటారు. ఇదే



విషయాన్ని కార్టూనిస్టులు ఎక్స్‌పోజ్ చెయ్యగలిగితే, మన సమాజంలో మనచుట్టూ వున్న వ్యక్తుల అతి తెలివి లేదా తెలివితక్కువ నమ్మకాల్ని- ఆచారాల్ని కార్టూన్లలో చూపించవచ్చు!

'మంచి కార్టూన్' విషయం గురించి చెప్తూ "చక్కని భావం– చక్కని గీత ఈ రెండూ ముఖ్యం. స్కెచ్‌గానీ, పొజిషన్‌గానీ తర్వాత చెప్పుకోదగ్గ అంశాలే అవుతాయి. మంచిభావం

చాలామంది ప్రశంసించిన 'అభీతో మైజవాఁహూ' కార్టూన్ ఇది



వుండీ రేఖలు చెడగొడితే కార్టూన్‌కున్న ఇంపాక్ట్ పోతుంది. కాని రేఖలు బాగుంటే ఒక్కోసారి ఐడియా వీక్‌గా వున్నా కవర్ అయి పోవచ్చు! రెండూ అమోఘంగా వుంటే, అది కాక్‌టెయిల్ పార్టీయే" అంటాడు– సుధీర్‌ధార్.

కార్టూన్లలో అతిశయోక్తి ద్వారానే కాక అసంబద్ధత (అబ్సర్డ్) ద్వారా కూడా ఒక్కోసారి హాస్యాన్ని సృష్టించవచ్చు! అసలు అతడి ఉద్దేశ్యంలో కార్టూనే అబ్సర్డ్ అట.



**ఈ కార్టూన్ విశ్వ వ్యాప్తంగా ప్రఖ్యాతి పొంది "గ్రేట్ కార్టూన్స్ ఆఫ్ ది వరల్డ్" పుస్తకంలో కూడా చోటు చేసుకుంది**

విదేశాల్లో లాగ మనదేశంలో కూడా ఒక్కొక్క ప్రత్యేకమైన ఫీల్డ్‌కు సంబంధించిన పత్రికలుంటే, కార్టూనిస్టులు కూడా ఆయా రంగాలకు సంబంధించిన కార్టూన్లలో 'స్పెషలైజేషన్' చేసే అవకాశం వుంది. లేనప్పుడు జనరలిస్ట్‌గా అన్ని విషయాలూ టచ్ చెయ్యక తప్పదంటాడు సుధీర్ ధార్. కొద్ది సంవత్సరాల్లో ఆ దశ ఇండియాలో రావచ్చునని ఆశాభావం వ్యక్తం చేశాడాయన.

మంచి కార్టూన్ రావడానికి కాన్‌సన్‌ట్రేషన్ (తదేకదృష్టి) అవసరం. ఒక్కోసారి మెరుపులా ఐడియా తట్టవచ్చు! మనం విన్నవీ – కన్నవీ కూడా కార్టూన్ సృష్టిలో ఉపకరించవచ్చు!

## "మీకు నచ్చిన కార్టూన్ ఏది?"

అని సుధీర్‌ను ప్రశ్నిస్తే, "అది చెప్పడం కష్టమేనండీ! ప్రజాదరణ పొందినవన్నీ నాకు నచ్చాలని లేదు. అభిరుచి వ్యక్తిగతం. విశ్వవ్యాప్తంగా కొన్ని కార్టూన్లకు జనం ఆనందించారు. "అభీ తో మై జవాఁ హూఁ" (నేనిప్పుడు నవ యువకుడినయాను) అనే భావం గల నా కార్టూన్‌ని ప్రజలు బాగా రిసీవ్ చేసుకున్నారు. మొరార్జీ దేశాయ్ అంతకుముందే రాజకీయ సన్యాసం చేసెయ్యడం, క్రియాశీల రాజకీయాల్లోంచి చరణ్‌సింగ్ తప్పుకుంటానని ప్రకటించడంతో, ఊపిరి పీల్చుకున్న జగ్జీవన్‌రామ్ హార్మనీ మీద ఈ గజల్ బిట్ పలికిస్తాడన్నమాట! ఇలాంటి ప్రజాదరణ ఇంకో కార్టూన్‌కూ లభించింది. బస్ అద్దాల మీద వర్షపు



Courtesy:Hindustan Times

చినుకుల్ని ఓ అవుతొక వైపర్‌లా తుడవడం. ఇది ప్రపంచమంతటా ప్రదర్శించ బడింది. పోస్టర్‌గా కూడా వేశారు దీన్ని. ప్రసిద్ధ అమెరికన్ కార్టూనిస్టు హెర్బ్లాక్ "గ్రేట్ కార్టూన్స్ ఆఫ్ ది వరల్డ్" అనే గొప్ప పుస్తకం కోసం దీన్ని సెలక్ట్ చేశారు.

"అభీతో మై జవాఁ హూఁ" కార్టూన్ వేసేసరికి ఆయనకు అంతకు ముందురోజే (మే 14) ఎభై ఏళ్ళు వచ్చాయిట. అలహాబాద్‌లో అతని అన్నగారూ – కుటుంబ సభ్యులూ పుట్టిన రోజు గ్రీటింగ్స్ పంపుతూ "నువ్వు ఇప్పుడు నవ యువకుడివి. అభినందనలు" అనే సందేశం వచ్చిందట. ఎన్నో కార్డులు – సందేశాలూ వచ్చినా ఇది నన్ను బాగా ఆకర్షించింది అన్నాడు సుధీర్.

ఆ మధ్య ఓ ఐదేళ్ల క్రిందట కామన్వెల్త్ వుమెన్ అసోసియేషన్ ఢిల్లీలో జరిపిన సమావేశాలకు హాజరైన

(67 వ పేజీ చూడండి)

# సినిమా... సినిమా...



“కొదమ సింహం”లో చిరంజీవి

## శ్రీ లక్ష్మిపిక్చర్స్ తొలి చిత్రం

"విశాఖ పరిసరాలలో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు దినేష్‌బాబు. ఈయన ఛాయ, దర్శకత్వంలో ఎన్. సూర్యనారాయణ నిర్మించే శ్రీలక్ష్మి పిక్చర్స్ తొలి చిత్రంలో డాక్టర్ రాజశేఖర్, శోభన, రాజాకృష్ణమూర్తి, నాజర్, ఆహుతి ప్రసాద్, బ్రహ్మానందం, కుళ్ళ మణి, వై. ఆర్. వరలక్ష్మి, బేబి షాలిని, సి. ఆర్. సరస్వతి, చంద్రిక పాత్రధారులు. టి. మధు మాటలు, సి. నారాయణరెడ్డి గీతాలు, రాజ్-కోటి సంగీతం, రాంచంద్రసింగ్, విక్రమ్‌ధర్మా సాహసాలు, శివశంకర్ నృత్యాలు, ఉల్లిగంటి నాగేశ్వరరావు సంయుక్త దర్శకత్వం, ఎస్. కుమార్-శీతిరాల రామారావు సహకార దర్శకత్వం, నాగేశ్వరరావు- సత్యం కూర్పుతో ఎస్. ఎ. ప్రసాద్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. వి. బుల్లి సుబ్బారావు సారథ్యంలో నందిగం నాగవంశీనాథ్ సమర్పణ.

## దాసరి రూపకల్పన “అభిసారిక”

"జీవితమనే బండికి భార్యాభర్తలు రెండు చక్రాలని సోదాహరణంగా తెలిపే ఇతివృత్తం. జూన్, జూలై నెలల్లో రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది. ఇందులో కొందరు కొత్త కళాకారులను పరిచయం చేస్తున్నాం," అన్నారు కళాప్రపూర్ణ దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో బంగారెడ్డి గూడెం మండలాధ్యక్షుడు కరాటం కృష్ణమూర్తి నిర్మించే నాగరత్న ఫిలిమ్స్ "అభిసారిక" చిత్రంలో డాక్టర్ భానుమతి రామకృష్ణ, సురేష్, నవనటుడు నానాజీ ప్రధాన నటవర్గం. వాసూరావు సంగీతం, ఇక్బాల్ ఛాయ, సూర్యకుమారి శిల్పం, కృష్ణంరాజు కూర్పు తెర వెనుక హంగులు.



“మహాజనానికి మరదలు పిల్ల”లో రాజేంద్రప్రసాద్, నిరోషా

## “కొదమసింహం”

"మే 11 నుంచి జూన్ 10 వరకు చివరి షెడ్యూల్ హొగెనకల్, ఊటీ, కొచ్చిన్ ప్రాంతాలలో అత్యధిక వ్యయంతో నిర్మించాం" అన్నారు కె. సత్యనారాయణ. ఈయన సమర్పించే రమాఫిలింస్ "కొదమసింహం" చిత్రంలో చిరంజీవి, రాధ, వాణీవిశ్వనాథ్, సోనమ్, సత్యనారాయణ, మోహన్‌బాబు, ప్రాణ్, గొల్లపూడి, కన్నడ ప్రభాకర్, రంగనాథ్, ప్రసాద్‌బాబు, అల్లు రామలింగయ్య, అన్నపూర్ణ ఆదిగాగల వారు పాల్గొంటున్నారు. పరుచూరి సోదరులు, సత్యానంద్, వేటూరి, రాజ్‌కోటి, కె. ఎస్. హరి, భాస్కరరాజు, నాగేశ్వరరావు, సత్యం, సుందరం, శివసుబ్రహ్మణ్యం, రాజు, మోహన్, పద్మాభి, నరసయ్య ప్రభృతి సాంకేతిక వర్గంతో కె. నాగేశ్వరరావు నిర్మిస్తున్న ఈ భారీ చిత్రానికి కె. మురళీమోహనరావు దర్శకుడు.

## 'విష్ణు'

"యాక్షన్ ప్లస్ సెంటిమెంట్ ప్లస్ వెరైటీ ఎంటర్‌టైనర్. మే 19 నుంచి 23 వరకు కృష్ణ, సితారలపై రెండు పాటలు చిత్రీకరించడంతో షూటింగ్ ముగిసింది. మెయిన్‌విలన్‌ని ఢీకొనే కార్పొరేటర్‌గా కృష్ణగారిది వెరైటీ క్యారెక్టర్. ఈయన, నాగేంద్రబాబులతో జూబ్లీహాల్స్‌లో ఎక్సర్‌సైజ్ చేసిన ఫైట్ ఈ చిత్రంలో హైలైట్" అన్నారు ఎ. ఎ. ఎల్. వి. ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి. టి. లక్ష్మి నిర్మించిన శ్రీ విజయలక్ష్మి ఎంటర్‌ప్రైజెస్ వారి 'విష్ణు' చిత్రంలో కె. ఆర్. విజయ, శరత్‌కుమార్, సంయుత, సుధాకర్, నరేంద్ర, అహుతి ప్రసాద్, సుధారాణి, స్పందన, రాధాబాయి, జయమాలిని నటించారు. ఎం. బాలయ్య కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. వేటూరి, జాలాది, ఓంకార్, డి. నారాయణవర్మ గీతాలకు రాజ్-కోటి స్వరపరిచారు. కబీర్‌లాల్ ఛాయ, సాయికుమార్ శిల్పం, శీను- శివశంకర్ నృత్యాలు, ఎస్. శేషు సంయుక్త దర్శకత్వం, ఎం. సత్యనారాయణ సహకార దర్శకత్వం, రాజా సాహసాలు, మురళీరామయ్య కూర్పుతో వాస్తుతోట రఘురామ్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. ఎం. వెంకటేశ్వరరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. 'జూన్ రెండవ వారంలో రిలీజ్ చేయడానికి సన్నాహాలు చేస్తున్నాం' అన్నారు దర్శకుడు.



"విష్ణు"లో కృష్ణ, సితార



## 'ముద్దుల మేనల్లుడు'

"మే 18 నుంచి 25 వరకు ఊటీలో ఒక పాట, రెండు ఫైట్లు ఎక్సర్‌సైజ్ చేశాం. మరో రెండు పాటలకు అన్నపూర్ణ స్టూడియోలో భారీ సెట్స్ వేశాం. వేరుపడి, చివరికి ఒకటైన అన్నదమ్ముల కుటుంబాల కథ. ఇది ప్రతి ఇంటి కథ", అన్నారు ఎస్. గోపాలరెడ్డి. ఈయన నిర్మిస్తున్న భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "ముద్దుల మేనల్లుడు" చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి, నాజర్, జయంతి, వసంతకుమార్, బాలాజీ, బ్రహ్మానందం, త్రిపురనేని రాంగోపాల్, అనిత, సంగీత, శ్రీలలిత, బాబూ మోహన్, కుక్క పద్మ, ప్రీతి, మాడా, ప్రసన్నకుమార్ పాత్రధారులు. గణేశ్‌పాత్రో, సి. నారాయణరెడ్డి, వెన్నెలకంటి, కె. వి. మహదేవన్, కె. ఎస్. హరి, శ్రీనివాసరాజు, తిరునావుక్కరసు, ఎం. రంగారావు, ఆర్. సి. దొరై, రావుశ్రీ, ముక్క కృష్ణప్రసాద్, కె. అమరేశ్వరరావు ప్రభృత సాంకేతిక వర్గంతో కోడి రామకృష్ణ దర్శకుడు.

## "లవ్ 90"

"మలయాళ తార షబ్నమ్‌ను నాయికగా పరిచయం చేస్తున్నాం. జూన్ 1 నుంచి విశాఖ ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తవుతుంది". అన్నారు కె. వి. వి. సత్యనారాయణ. ఈయన సమర్పణలో కె. వేణుగోపాల్ నిర్మించే సౌదామినీ మూవీస్ "లవ్ 90" చిత్రంలో మాస్టర్ చక్రవర్తి, షణ్ముఖ శ్రీనివాస్, మాస్టర్ గణేష్ ప్రభృత నటవర్గం. కొంపెల్ల విశ్వం సంభాషణల కర్త. సంగీత రాజా స్వరకల్పనలో జొన్నవిత్తుల, రాజశ్రీ గీతాలు రాశారు. సురేష్ ఛాయ, వెనర్జీ కూర్పు, కె. నాగేశ్వరరావు నిర్వహణతో ఎ. వి. రాజా దర్శకుడు.

## మహాజనానికి మరదలు పిల్ల

"ప్రథమార్థం కాలేజీ వాతావరణంలో, తక్కిన భాగం కుటుంబ సమస్యలతో హాస్యం మేళవించి ఉంటుంది. నాయిక బాగా చదువు కున్నది. పల్లెటూరి నుంచి వచ్చిన నాయకుడు శ్రీమంతుడు కాకపోయినా మంచి ఉద్యోగస్తుడని నమ్మి పెళ్ళికి అంగీకరిస్తుంది. తీరా పెళ్ళాయాక అతను ఒక మామూలు ఉద్యోగి అని తెలిసి అలుగుతుంది. ఆమెకు జీవిత పరమార్థాన్ని తెలియ చేస్తాడు నాయకుడు" అన్నారు విజయ బాపినీడు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎం. నరసింహారావు నిర్మించే రాశీ మూవీ క్రియేషన్స్ "మహాజనానికి మరదలు పిల్ల" చిత్రంలో రాజేంద్రప్రసాద్, నిరోషా, సత్యనారాయణ, శ్రీధర్, రాళ్ళపల్లి, మర్గశాబు, బ్రహ్మానందం, మహర్షి రాఘవ, కుష, శ్రీలక్ష్మి, నిర్మల, మమత, అనిత, రజిత, పవిత్ర పాత్రధారులు. కాశీ విశ్వనాథ్ మాటలు, భువనచంద్ర గీతాలు, ఉపేంద్రకుమార్ సంగీతం, శ్రీనివాసరెడ్డి ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, శివసుబ్రహ్మణ్యం- ప్రమీల నృత్యాలు, విక్కీ సాహసాలు, త్రినాథరెడ్డి కూర్పు నిర్వహిస్తున్నారు.



నరేష్, వాణీ విశ్వనాథ్, ప్రభాకరరెడ్డి, సుధాకర్, వేలు, రాజసులోచన, అన్నపూర్ణ, కోట శ్రీనివాసరావు, రావి కొండల రావు, శ్రీలక్ష్మి, ధర్మవరపు సుబ్రహ్మణ్యం ప్రభృత నటవర్గం. శాతవాహన కథ, వేటూరి గీతాలు, రాజ్-కోటి సంగీతం, జానీ ఛాయ, తంగవేలు శిల్పం, ఆంథోని నృత్యాలు, ముస్తాఫా సాహసాలు, పి. ఎ. రమణబాబు సంయుక్త దర్శకత్వం, రాజ్ గోపాల్ కూర్పుతో సి. చంద్రశేఖర్, సి. రామకృష్ణ ఎగ్జిక్యూటివ్ నిర్మాతలు.

"రాజశేఖర్ అర్థాంగిగా జీవిత గెస్ట్ పాత్రలో కనిపిస్తారు. వీళ్ళిద్దరూ కలిసి నటించిన చివరి చిత్రం ఇదే అవుతుంది. అర్జున్ అనే కొత్త నటుణ్ని పరిచయం చేస్తున్నాం." అన్నారు కె. మధు. ఈయన దర్శకత్వం వహించిన శ్రీ నవనేత్రా ప్రొడక్షన్స్ "మగాడు" చిత్రంలో మురళీమోహన్, దేవదాస్ కనకాల, త్యాగరాజన్, బాబూ ఆంథోని రాజేష్, రమణారెడ్డి, బాలాజీ, రవిబాబు, హరిబాబు, పి. జె. శర్మ, హేమసుందర్, కె. కె. శర్మ, మదన్, ఆలీ, బాబూమోహన్, లిజీ, ప్రతాప్ చంద్రన్, ఎ. ఆర్. వరలక్ష్మి, శైలజ, ప్రేమి, శ్యామ్, బేబీ కామాక్షి, బేబీ షాలినీ నటించారు. కె. ఎల్. ప్రసాద్, రాజ్-కోటి, విపిన్ దాస్, పి. సి. కృష్ణన్, రాజన్, త్యాగరాజన్, గుణశేఖర్, జె. వి. వి. సత్యనారాయణ, సాయిరత్న ప్రభృత సాంకేతిక వర్గంతో జీవిత సమర్పణ.



"పెద్దల నీడ- ప్రవర్తన ఇరుగిల్లయినా- పొరుగిల్లయినా పిల్లల మీద పడితే, వక్రమార్గం పట్టే ప్రమాదముంది. అలాంటి దశలో ఒక యువకుడు పిల్లలను, పెద్దలను ఎలా సక్రమ మార్గంలో పెడతాడన్నదే ప్రధాన ఇతివృత్తం. ఈ చిత్రానికి జంధ్యాల సంభాషణలు అదనపు ఆకర్షణ." అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన దర్శకత్వంలో ప్రముఖ పంపిణీదారుడు సి. సత్యనారాయణ నిర్మించే కృష్ణా ఎంటర్ ప్రైసెస్ సినీ క్రియేషన్స్ "ఇరుగిల్లు- పొరుగిల్లు" చిత్రంలో

# గుర్తుపెట్టుకోండి, పోషణనిచ్చే సమపాళ్లుగల ఆహారాన్నివకపోతే ఏమి జరుగుతుందో? చురుకుదనాన్నివ్వడానికి అవసరమయ్యే, 'సరియైన' తీరులోని కేలరీలు మీ పాపకి అందవు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

అసలు 'సరియైన' కేలరీలు అంటే ఏమిటి?
డాక్టర్లు అనేదిది. ఆహారంలోని ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, ఖచ్చితమైన సమపాళ్లు యీ కేలరీలలో వుంటాయని. నిజానికి ఇవి పాప బాగా పెరగటానికి, చురుకుగా వుండటానికి, అవసరమైన కీలకమైన ఆహార పదార్థాలు. మీ పాపకు 'సరియైన' కేలరీలు లభించేటట్లు ఖచ్చితంగా చూడాలి.
ఇవి ప్రతిసారి యిచ్చే ఆహారంలో వుండాలి. రోజూ మామూలుగా వారం పర్యంతంగా యిచ్చే ఆహారంతో అలా యివ్వగలగటం చాలా మంది తల్లులకి సాధ్యంకాదు.
దానికి పరిష్కారం ?
సెరిలాక్ పోషణ నిచ్చే సమపాళ్లుగల సంపూర్ణ ఆహారం. పాపకు 4 నెలలు వచ్చినప్పటి నుండి అంటే. కేవలం పాలు యిస్తే చాలని వయస్సు నుంచి, యిచ్చే ఆహారం.
సెరిలాక్‌లో ప్రొటీన్లూ, కార్బోహైడ్రేట్లూ, కొవ్వు పదార్థాలూ విటమిన్లూ, ఐరన్, కాల్షియం, వున్నాయి. దాంతో మీ పాప చురుకుగా వుండటానికి అవసరమైన 'సరియైన' కేలరీలు లభిస్తాయి. రుచికరంగానూ వుంటుంది.
అందుకే యివ్వండి వెంటనే మీ పాపకు. పోషణనిచ్చే సమ పాళ్లలోగల సెరిలాక్. మీ పాపకు 6 నెలలు వచ్చినప్పటి నుంచి వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, మరియు వీట్-వెజిటబుల్ అదనపు లాభం అందించండి.
దయచేసి ప్యాక్‌పైన యివ్వబడిన సూచనలను పాటించండి.

ఉచితం : సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి : సెరిలాక్, పోస్ట్ బాక్స్ నెం. 21, న్యూ ఢిల్లీ 110029.






## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

సీరియల్

# హాట్‌లిప్స్

## జి.వి.అమరేశ్వరరావు



(గత సంచిక తరువాయి)

**నిర్మానుష్యంగా చీకటిగావున్న ఆ వీధిలోకి మారుతి ప్రవేశించింది. దాన్ని ఇంటి వెనక్కు తీసుకువెళ్లిఆపాడు శివాజీ. రజని అతడివంక ఆశ్చర్యంగాచూసింది.**

"ఎవడో వెధవ....కీస్ అలాగేవుంచి కారు ఇంటిముందు వదిలేశాడు. వెంటనే కొట్టు కొచ్చేశాను" అన్నాడు నవ్వుతూ -

ఖచ్చితంగా పన్నెండు గంటలప్పుడు శివాజీ, రజని వెంటరాగా మారుతిలో బయలుదేరాడు. కాళీప్రసాద్ ఇంటికి వెళ్ళడానికి అరగంట సమయం పట్టింది. శివాజీ ఇంటి వెనగ్గా మారుతి ఆపాడు. కాంపౌండ్‌లో దట్టంగా పెరిగిన చెట్ల నీడలు రోడ్డుమీదకు వచ్చిపడుతున్నాయి. దూరంగా వెలుగుతున్న స్ట్రీట్‌లైట్ కాంతి తప్ప అక్కడంతా నిర్మానుష్యంగావుంది.

శివాజీ, రజని పిట్టగోడమీదుగా కాంపౌండ్‌లోకి దూకారు. కాంపౌండ్‌లో ఆల్సేషన్ డాగ్స్ కానీ, డాబర్‌మన్ డాగ్స్‌గానీ ఉంటాయనుకున్న శివాజీ ఊహ అబద్ధం అయ్యింది. అతడి దృష్టి ఎత్తుగా పెరిగిన పున్నాగచెట్టు మీద పడింది. ఆ చెట్టుకొమ్మలు పై అంతస్థు బాల్కనీ వరకూ వ్యాపించివున్నాయి. శివాజీ పొద్దున తను చూసిన 'అర్ధరాత్రి అప్సరస' సినిమాలో సీన్సు గుర్తుకు తెచ్చుకున్నాడు.

పున్నాగచెట్టుమీదుగా బాల్కనీమీదికి చేరుకుంటే అక్కడ్నించి మాస్టర్ బెడ్‌రూంలోకి వెళ్ళడం చాలా తేలిక.

అర్ధరాత్రి అప్సరస సినిమాలో హంతకుడుకూడా పున్నాగచెట్టు ఎక్కి దాని కొమ్మల మీదుగా ప్రయాణించి బాల్కనీలో దిగుతాడు.

"మనం 'అర్ధరాత్రి అప్సరస' సినిమా చూడడం మంచిదయింది. ముందు పున్నాగచెట్టు ఎక్కుదాం పద."

రజని సరే అన్నట్టు తల వూపింది.

అంతకుముందు సినిమాలో చూసివున్నాడు కనక శివాజీ చాలా నేర్పుగా చెట్టు ఎక్కి బాల్కనీలోకి దిగాడు. రజని అతన్ని అనుసరించింది. జీన్స్ వేసుకుని వుండడంవల్ల ఆమె చాలా తేలిగ్గా చెట్టు ఎక్కింది.

సరిగ్గా అదేసమయంలో - బెడ్‌రూం వెనకవైపునున్న వాటర్ పైపును పట్టుకుని కురియన్ ఎక్కసాగాడు. వాటర్‌పైప్ నుంచి కొంతదూరం పైకి వెళ్ళిన తర్వాత తెరిచివున్న అద్దాల కిటికీగుండా బెడ్‌రూంలోకి వెళ్ళాలనేది అతని ప్లాను.

నేలమీద నిలబడివున్న ఎర్రతేలు, నల్లముత్తు చాలా టెన్షన్‌లో కురియన్‌వైపుకు చూస్తున్నారు. కురియన్ కిటికీ దాకా చేరుకున్నాడు. భుజాన వేలాడుతున్న ఫోల్డర్ బ్యాగ్‌నుండి గ్లాస్‌కట్టర్ పైకి తీశాడు. చాలా నేర్పుగా గ్లాస్‌కట్టర్‌తో కిటికీ అద్దాన్ని మూడు పక్కలా కోసేశాడు. నాలుగోప్రక్క కోయడానికి ముందు పట్టుకోవడానికి వీలుగా హ్యాండిల్‌వున్న వ్యాక్యూంగ్రిప్ (పిల్లలు ఆడుకునే వ్యాక్యూం యారోవంటి సాధనం) తీసి అద్దానికి బలంగా అదిమిపట్టాడు. వ్యాక్యూంగ్రిప్ అద్దానికి అతుక్కుపోయింది. దాని హ్యాండిల్‌ను నోటితో పట్టుకుని ఒకచేత్తో అద్దాన్ని కోయసాగాడు. ఇప్పుడు కేవలం కాళ్ళతోనూ ఒంటి చేత్తోనూ వాటర్‌పైప్ పట్టుకునివున్న కురియన్ ఏమాత్రం అజాగ్రత్తపడినా కిందపడి ఎముకలు విరగ్గొట్టుకోవడం ఖాయం.

నాలుగోప్రక్క కూడా అద్దాన్ని కట్‌చేసిన తర్వాత గ్యాస్‌కట్టర్ ఫోల్డర్ బ్యాగ్‌లో వేసుకున్నాడు. వ్యాక్యూంగ్రిప్ హ్యాండిల్‌కి ఒక నైలాన్ తాడు కట్టి మెల్లగా వెనక్కులాగాడు. అద్దం వూడివచ్చింది. తర్వాత చేతిలోని తాడు మెల్లగా జార్చసాగాడు.

అద్దం చేతికి అందేదూరంలోకి రాగానే ఎర్రతేలు దాన్ని అందుకుని నిశబ్దంకాకుండా ఒక ప్రక్కగా పెట్టాడు.

కురియన్ కిటికీగుండా బెడ్‌రూంలోకి దూరి గుండెల నిండుగా ఊపిరి పీల్చుకున్నాడు. కుడికాలికున్న సాక్స్ తడిమిచూశాడు. పొడవాటి చురకత్తి చేతికి తగిలింది. వెంటనే ఎర్రతేలు, నల్లముత్తుల్ని పైకి రమ్మనమని సైగచేశాడు.

ఇద్దరూ ఒకళ్లతర్వాత ఒకళ్లు వాటర్ పైప్ మీదుగా పైకి రాసాగారు. వాళ్ల చేతులకు నల్లటి గ్లౌజస్ మెరుస్తున్నాయి.

* * * * * *

మంకీ క్యాప్స్ ధరించిన శివాజీ, రజని మాస్టర్ బెడ్‌రూంలోకి ప్రవేశించారు.

ఈ సంఘటన జరిగిన - జరగడానికి రెండు గంటలముందు -

శివాజీ తల్లి, తండ్రి, చెల్లెలు ప్రయాణిస్తున్న దోసకాయలపాలెం బస్ సడన్‌బ్రేక్‌తో ఆగింది. విపరీతంగా కురిసిన వానలకు ఎద్దువాగు పొంగి రోడ్డుకు అడ్డంగా ప్రవహిస్తోంది. ప్రవాహపు ఉరవడికి బస్సు కొట్టుకుపోయే ప్రమాదం వుంది.

**ఇంతవరకూ సాగిన కథ-8:** మారుపేర్లతో మోసాలకు అలవాటుపడి వచ్చినదాంట్లో సమానంగా పంచుకుంటూ కాలం గడుపుతుంటారు శివాజీ-రజని. ఒకవైపు మోహినిని భార్యగా స్వీకరించేందుకు అసలు భార్య పార్వతిని చంపాలని బిజినెస్ మాగ్నెట్ కాళీప్రసాద్ పథకాలు వేస్తుండగా మరోవైపు పార్వతిని కిడ్నాప్ చేయాలని శివాజీ-రజని పథకం వేస్తుంటారు.

డ్రైవరూ, కండక్టరూ ప్రయాణీకుల సలహామీద బస్సును ముందుకు పోనిచ్చే ప్రయత్నానికి స్వస్తిపలికారు. దోసకాయలపాలెం వెళ్ళాల్సిన బస్ వెనక్కు తిరిగి హైదరాబాద్ వైపు పోసాగింది.

* * * * * *

శివాజీ డోర్ హ్యాండిల్ మెల్లిగా తిప్పాడు.

క్లిక్ మనే శబ్దాన్ని సృష్టిస్తూ తలుపు తెరుచుకుంది.

గండుపిల్లిలా ఏమాత్రం అలికిడి కాకుండా లోపలికి అడుగుపెట్టాడు. రజని అతడిని అనుసరించింది. బెడ్ రూంలో జీరో క్యాండిల్ బల్బ్ వెలుగుతోంది.

విశాలమైన డబుల్ కాట్ బెడ్ మీద పార్వతి ఒక్కతే నిద్రిస్తోంది. అతడు ఊహించినట్టు కాళీప్రసాద్ అక్కడ లేదు.

బెడ్ రూం వెనకవైపునుండి లోపలకు అడుగుపెట్టబోయిన కురియన్ మంకీక్యాప్ పెట్టుకున్న శివాజీ, రజని కనిపించడంతో ఒక్కసారిగా షాక్ తిన్నవాడిలా ఆగిపోయాడు. ఈ పరిస్థితిల్లో కనక ఏదన్నా గొడవ జరిగితే వర్కర్స్ క్వార్టర్ లో నిద్రిస్తున్న పనిమనుష్యులు మేలుకోవచ్చు.

కురియన్ తన వెనకే లోపలకివచ్చిన ఎర్రతేలు, నల్లముత్తుల వంక అరవద్దన్నట్టు సైగచేశాడు. అతడి దృష్టి ప్రక్కనేవున్న బాత్ రూంమీద పడింది. వాళ్ళని అందులోకి రమ్మనమని సైగచేసి ముందుకు కదిలాడు. చీకటిగావున్న బాత్ రూంలో నిలబడి వారగా తెరిచిన తలుపు సందులోంచి చూస్తే పార్వతి పడుకున్న మంచం స్పష్టంగా కనబడుతుంది.

చివరిగా బాత్రూంలోకివచ్చిన నల్లముత్తు తలుపు దగ్గరకు వేశాడు.

కిర్రుమంటూ శబ్దం అయ్యింది.

కురియన్, ఎర్రతేలు, నల్లముత్తుల మెడమీది జుట్టు నిక్కపొడుచుకుంది. వాళ్ల గుండె శబ్దం వాళ్ళకే స్పష్టంగా వినపడసాగింది.

బాత్రూం తలుపుశబ్దం వింటూనే శివాజీ ఎలర్టయ్యాడు.

ఈసారి కురియన్ చాలా తెలివిగల పని చేశాడు.

శబ్దం అవుతున్నాకూడా బాత్రూం తలుపు పూర్తిగావేసి బోల్టుపెట్టేసి లైటువేశాడు.

ఎర్రతేలు, నల్లముత్తు అతడివైపు మతిపోయినవాళ్లలాగ చూశారు. కురియన్ వాళ్లను శబ్దం చేయవద్దంటూ సైగచేసి పంపుతిప్పాడు. నీళ్లుధారగా కారసాగాయి.

బాత్రూంలో లైటు వెలగడం, నీళ్ల కారుతున్న శబ్దం వినపడడంతోనే శివాజీ రజనితో చాలా మెల్లిగా చెప్పాడు.

“కాళీప్రసాద్ బాత్ రూంలో వున్నాడు. వాడు వచ్చేలోపే మనపని పూర్తి అయిపోవాలి.”

రజని తలవూపి షోల్డర్ బ్యాగ్ లోంచి హ్యాండ్ కర్చిఫ్ పైకితీసింది. శివాజీ దానిమీద క్లోరోఫాం చల్లాడు. కుడిచేత్తో హ్యాండ్ కర్చిఫ్



పట్టుకుని బెడ్ వైపు నడిచాడు.

గాఢనిద్రలోవున్న పార్వతి గుండెలు పైకీ కిందికీ కదులుతున్నాయి.

శివాజీ హ్యాండ్ కర్చీఫ్ ఆమె ముక్కుకేసి బలంగా అదిమాడు. ఒక అరనిమిషంపాటు ప్రతిఘటించిన పార్వతి తల ప్రక్కకు వాల్చేసింది. వెంటనే ఆమెను భుజంమీదికి ఎత్తుకుని బయటకు నడిచాడు.

కురియన్ తన ప్రక్కనే నిలబడివున్న ఎర్రతేలు, నల్లముత్తులతో చెప్పాడు.

"మన ముగ్గురం ఊహించింది అబద్ధం అయ్యింది. వా డెవడో పార్వతిని చంపడానికి రాలేదు. అవిడ్ని కిడ్నాప్‌చేసి ఎత్తుకుపోతున్నాడు. ఆ తర్వాత నా ఉద్దేశ్యం ప్రకారం మన బాస్‌కు ఫోన్‌చేసి లక్షో, రెండు లక్షలో ఇస్తేనే నీ పెళ్లాన్ని వదుల్తానని బెదిరిస్తాడు."

"అయితే మన ముగ్గురమూ ఆ ముగ్గుర్నీ సఫాచేసేద్దామా?" జేబులోంచి పేష్కవ్‌తీసి గాలిలో ఆడిస్తూ అన్నాడు నల్లముత్తు. ఆ మాట వింటూనే ఎర్రతేలు జర్కిన్ పాకెట్‌లోంచి పాయింటు ఫార్టీఎయిట్ రివాల్వర్ పైకితీశాడు.

కురియన్ వాళ్లను విసుక్కుంటూ తిట్టాడు.

"మీకు తలలోవుంది మెదడుకాదు. బంకమన్ను. ఇపుడు మనం చేయాల్సింది వాళ్లముగ్గుర్నీ చంపడంకాదు. బాస్ మనకు అప్పగించిన పని సక్రమంగా పూర్తిచేయడం. ముందు బయటకు వెళ్దాంపదండి. ఆ తర్వాత ఏం చేయాలో చెప్తాను." కురియన్ రెండు క్షణాల్లో తన ప్లాన్ వివరించాడు. అతడి ఆజ్ఞ ప్రకారం నల్లముత్తు గది వెనకభాగం నుంచి అద్దంలేని కిటికీగుండా క్రిందికి దిగాడు. కురియన్ బాత్రూం తలుపు కాస్త తెరిచిచూశాడు. అతడికి బెడ్‌రూంలో మంచం ఖాళీగా కనపడింది. రజని, శివాజీ ఆ గదిలో లేరు.

## హిట్ లిస్ట్

శబ్దంకాకుండా నడవసాగాడు. గుమ్మందాకా వచ్చి ఆగిపోయాడు. తనుకనక బయటకు వెడితే వాళ్లకంటపడవచ్చు. కురియన్ చాలా జాగ్రత్తగా తల బయటపెట్టి చూశాడు.

శివాజీ పార్వతిని భుజంమీద మోస్తూ పిట్టగోడదాకా నడిచాడు. పిట్టగోడమీదకు పున్నాగచెట్టు కొమ్మ వాలివుంది. తాము వచ్చేటపుడు ఆ కొమ్మమీదగా వచ్చారు. కాని తిరిగి అదే దారిన పార్వతిని మోస్తూ వెళ్లడం అసంభవం.

సరిగ్గా అదేసమయంలో -

పున్నాగచెట్టు ప్రక్కనే నక్కివున్న నల్లముత్తుకు ఔట్‌హౌస్‌లో పాతసామాన్ల మధ్య పడివున్న పనికిరాని ఒక నిచ్చెన గుర్తుకువచ్చింది. అసలు తను ఆ నిచ్చెనమీదగా బాల్కనీలోకి ప్రవేశించి అక్కడ్నించి పార్వతి బెడ్‌రూంలోకి వెళ్దాం అన్నాడు. కాని కురియన్ ప్లాన్ మార్చాడు. స్టోర్‌రూంలో నిచ్చెనకనక బయటకుతీసి దాని సహాయంతో బెడ్‌రూంలోకి చేరుకుంటే, అది తెలిసినవాళ్లు చేసిన హత్య అని పోలీసులు అనుమానించే అవకాశం కనక నిచ్చెన ఉపయోగించే క్వొశ్చనే లేదన్నాడు కురియన్. అందుకనే వెనకవైపునుంచి అద్దాన్ని ఊడదీసి లోపలికి రావాల్సివచ్చింది.

శివాజీ, రజని పార్వతిని క్రిందికి ఎలా దించాలా అని ఆలోచిస్తున్న విషయం నల్లముత్తుకు అర్ధం అయ్యింది.

వెంటనే అతడు మెరపువేగంతో ఔట్‌హౌస్‌వైపు పరుగుతీశాడు. ఔట్‌హౌస్ బిల్డింగ్‌కి వెనకప్రక్కన వుండడంవల్ల అతడ్ని శివాజీగాని, రజనిగాని చూసే అవకాశంలేదు.

కేవలం అరనిమిషంలో పని పూర్తి అయ్యింది. నల్లముత్తు చీకట్లో కీనీడలా కదుల్తూ నిచ్చెనతెచ్చి బాల్కనీ కిందుగావుంచి తిరిగి గోడవారగా నడుస్తూ, బిల్డింగ్ వెనక్కు వెళ్లాడు. అదేవేగంతో ఇంటివెనకప్రక్క ఆపివున్న కారుదగ్గిరికి చేరుకున్నాడు. డ్రైవింగ్ సీట్‌లోకి జంప్‌చేస్తూనే ఇంజన్ ఆన్‌చేసి హెడ్‌లైట్స్ వెలిగించి కారు ముందుకు దూకించాడు.

కారు స్టార్టుఅయిన శబ్దం వింటూనే శివాజీ, రజని, కురియన్, ఎర్రతేలు ఉలిక్కిపడ్డారు.

నల్లముత్తు కారు ఎడంవేపు తిప్పి బిల్డింగ్‌ముందుగా పోనిచ్చాడు. హెడ్‌లైట్స్ కాంతి బిల్డింగ్ గేట్‌లోంచి ప్రవేశించి ఒక్కక్షణం బాల్కనీ కిందిభాగాన్ని కాంతివంతంచేసింది. ఆ ఒక్కక్షణంలోనూ శివాజీని గోడవారగా నిలబెట్టివున్న నిచ్చెన ఆకర్షించింది.

నల్లముత్తు కొంతదూరం కారు తీసుకుపోయి ఎలక్ట్రిక్‌పోల్ కింద ఆపి ఇంజన్ ఆఫ్‌చేసి కురియన్, ఎర్రతేళ్ళకోసం ఎదురుచూడసాగాడు. అతడు కారు ఆపినచోట వీధిలైటు గుడ్డిగా వెలుగుతోంది.

ఆమాత్రం వెలుగుచాలు. ఎర్రతేలు, కురియన్ కిటికీనుంచి వెనక్కువచ్చేటపుడు తమ కారు గుర్తుపట్టడానికి.

కారు హెడ్‌లైట్స్ కాంతిలో ఒక్కక్షణకాలంపాటు నిచ్చెన కనపడగానే శివాజీ ఎలర్టయ్యాడు.

అతడు రజని చేయవలసిన పనేంటో చెప్పాడు. వెంటనే ఆమె పున్నాగచెట్టు కొమ్మమీదుగా క్రిందికి దిగింది.

నిచ్చెన తీసుకువచ్చి గోడకు ఆన్చింది. శివాజీ మెల్లిగా పార్వతిని మోసుకుంటూ క్రిందికి దిగసాగాడు. కాని తాను ఒక భయంకరమైన ఉచ్చులో చిక్కుకున్నట్టు అతడు ఊహించలేదు.

శివాజీ క్రిందికి దిగడం ప్రారంభించగానే కురియన్, ఎర్రతేలు కిటికీవైపు పరుగుతీశారు. చకచకా వాటర్‌పైప్ మీదుగా కిందికి దిగారు. అదే వేగంతో స్ట్రీట్‌లైట్ క్రింద ఆపివున్నఫియట్‌వైపు దూసుకుపోయారు. డ్రైవింగ్ సీట్‌లో కూర్చునివున్న నల్లముత్తు ప్రక్కకు జరిగాడు. కురియన్ స్టీరింగ్‌ముందు కూర్చుంటూ నల్లముత్తు భుజంమీదుగా మెచ్చుకోలుగా తట్టాడు.

శివాజీ పార్వతిని చాలా జాగ్రత్తగా క్రిందికి దింపాడు. ఇక అక్కడ్నించి పిట్టగోడమీదగా ఆమెను కార్లోకి చేర్చటం ఏమంత కష్టంకాలేదు. అతడు మారుతి డ్రైవింగ్ సీట్ అక్యుపై చేయగానే మంకీక్యాప్ తీసేశాడు. ఫియట్‌లో కూర్చుని టెన్షన్ తగ్గడానికి సిగరెట్ దమ్ముకొడుతున్న కురియన్, నల్లముత్తు, ఎర్రతేలు దూరంగా చీకట్లో పార్క్






అనిల్ కపూర్ చిత్రాల పబ్లిసిటీకోసం అతని సోధరులు అనేకపాట్లు పడుతుంటారు. అనిల్ చిత్రాలు విజయవంతం అయినా కాకపోయినా అతని సోదరుడు బోనీకపూర్ పత్రికలవాళ్లకు ఏదో ఒకటి ముట్టచెప్తుంటాడట. మరొక సోదరుడు సినిమాహాలు నిండినా నిండకపోయినా హౌస్‌ఫుల్ బోర్డులు పెట్టమని థియేటర్ యజమానులకు కూడా ముట్టచెప్తుంటాడట. అనిల్ పబ్లిసిటీకోసం సోదరులుపడే పాట్లు చూసి అందరూ ముక్కున వేలేసుకుంటున్నారట.

చేసివున్న మారుతి లైట్లు వెలగడంతోనే నిటారుగా అయ్యారు.

మారుతి కొంతదూరం వెళ్ళగానే ఫియట్ ఇంజన్ స్టార్ట్‌చేశాడు కురియన్.

మారుతికి, ఫియట్‌కు కనీసం అర్థ కిలో మీటరు దూరం వుండేలా జాగ్రత్తపడుతూ డ్రైవ్‌చేయసాగాడు.

తమను ముగ్గురు క్రిమినల్స్ వెంబడిస్తున్నారన్న విషయం తెలియని శివాజీ రోడ్డు మీదికి చూస్తూ డ్రైవ్‌చేయసాగాడు.

రోడ్డు చాలావరకు నిర్మానుష్యంగా వుంది. కాకపోతే ఒకటి, అర, కార్లు, ఆటోలు చాలా వేగంగా వెడుతున్నాయి.

అయిదు నిమిషాల ప్రయాణం తర్వాత శివాజీ రోడ్డుకు అడ్డంగా నిలబడివున్న కానిస్టేబుల్స్‌ని చూసి సడన్‌బ్రేక్‌తో కారు ఆపాడు. కారు ఆపమంటూ సైగచేసిన కానిస్టేబుల్స్ శివాజీ దగ్గిరకి నడిచారు.

నగరంలో పెరుగుతున్న దొంగతనాలను,. దోపిడీలను అరికట్టడానికి ప్రభుత్వం పెట్రోల్ స్క్వాడ్స్‌ను ఏర్పాటుచేసింది. పెట్రోల్ స్క్వాడ్స్ కింద పనిచేసే కానిస్టేబుల్స్ చేయవలసిన పనుల్లో రాత్రివేళల్లో సంచరించే వాహనాలను తనిఖీచేయడంకూడా ఒకటి.

శివాజీని టాస్క్‌ఫోర్స్ కానిస్టేబుల్ ప్రశ్నించసాగాడు.

"మీ పేరు?"

"అప్పారావు."

"ఎక్కడికి వెడుతున్నారు?"

"హాస్పటల్‌కి."

కానిస్టేబుల్ రెండు క్షణాలు మౌనంవహించాడు. అతడి దృష్టి వెనకసీట్‌లో పడుకునివున్న పార్వతిమీద పడింది. అతడు అడగబోయే ప్రశ్న ఊహించుకుంటూ చెప్పాడు శివాజీ.

"ఆమె మా అక్కగారు. ఆరోగ్యం బాలేదు. అందుకే హాస్పటల్‌కు తీసుకువెళ్ళవలసివచ్చింది."

"ఏదీ మీ డ్రైవింగ్ లైసెన్స్ చూపించండి."

ఆ మాటతో శివాజీ గుండె రఝల్లుమంది. అతడిదగ్గిర డ్రైవింగ్ లైసెన్స్ లేదు.

దూరంగా పోలీసులు మారుతిని ఆపగానే కురియన్ భ్రుకుటి ముడివడింది. అతడు వెంటనే ఫియట్‌ను రాకెట్ వేగంతో ప్రక్కసందులోకి పోనిచ్చాడు. రెండు మూడు మలుపులు తిప్పిన తర్వాత ఆ సందుచివర్న చీకటిగావున్నచోట ఆపాడు.

ఇపుడు అతడికి మెయిన్‌రోడ్ ప్రక్కగా ఆపివున్న మారుతి, శివాజీని ప్రశ్నిస్తున్న పోలీసులు స్పష్టంగా కనపడుతున్నారు. అంతేకాదు ఫియట్‌కు మారుతికి యాభైగజీల దూరానికి మించి వుండదు.

"గురుడు ట్రబుల్లో వున్నట్టున్నాడు. వెళ్లి సంగతిచూడు" ఎర్రతేలు నుద్దేశించి చెప్పాడు కురియన్.

తలవూపిన ఎర్రతేలు కిందికి దిగి పోలీసులవైపు నడిచాడు. అతడికి నగరంలో పోలీస్‌డిపార్ట్‌మెంటుకు చెందిన ప్రతిమనిషీ పరిచయం. కాళీప్రసాద్ మనిషిగా పోలీసులకు అతడిగురించి తెలుసు.

మారుతిని సమీపించిన ఎర్రతేలుకు టాస్క్‌ఫోర్స్ మనిషి డ్రైవింగ్ లైసెన్స్ గురించి అడుగుతున్న ప్రశ్న వినపడింది. వెంటనే ఎర్రతేలు మెల్లిగా దగ్గాడు. టాస్క్‌ఫోర్స్ మనుషులు వెనక్కుతిరిగి ఎర్రతేలువేపు చూశారు. శివాజీని ప్రశ్నిస్తున్న కానిస్టేబుల్ వెంటనే ఎర్రతేలును గుర్తుపట్టి అడిగాడు -

"ఏంటిసార్! మీరు ఇంతరాత్రి వేళ........ "

"బండి పాడయ్యింది. అందుకని దాన్ని అక్కడేవదిలేసి వస్తున్నా. ఏంటీ డ్యూటీ చేస్తున్నారా?"

"ఔనుసార్. టాస్క్‌ఫోర్స్‌కు ట్రాన్స్‌ఫర్ అయిందగ్గిర్నుంచీ నైట్‌డ్యూటీలు ఎక్కువయిపోయాయి. వర్క్ విపరీతంగా పెరిగింది."

"మీరు మళ్ళీ లా అండ్ ఆర్డర్‌కివస్తే సంపాదన మళ్ళీ పెరుగుతుంది. ఈ నాలుగు రోజులకూ ఏడుపు ఎందుకు చెప్పు" ఆమాట అంటూనే ఎర్రతేలు శివాజీవంక తిరిగి అన్నాడు.

"మీరు వెళ్లండిసార్....మావాడు అడ్డమయిన ప్రశ్నలు వేస్తుంటాడు."

శివాజీ టాస్క్‌ఫోర్స్ మనిషివంక చూశాడు. టాస్క్‌ఫోర్స్ మనిషి తల ఊపగానే మారుతి ముందుకు దూకించాడు.

"నువ్వు ఎటువయిపు వెడుతున్నావ్?" ఎర్రతేలు టాస్క్‌ఫోర్స్ మనిషిని అడిగాడు.

"టాంక్‌బండ్ వయిపు."

"నేనూ అటే పద.... నాకు కంపనీ ఇద్దువుగాని. టాంక్‌బండ్ నుంచి నేను దోమల్‌గూడా వెళ్లిపోతాను" అన్నాడు ఎర్రతేలు.

వాళ్లు రెండు అడుగులు వేశారో లేదో వేగంగా దూసుకువచ్చిన ఫియట్ కీచుమనే శబ్దాన్ని సృష్టిస్తూ ఎర్రతేలు పక్కగా ఆగింది. కురియన్ విండోలోంచి తల బయటపెట్టి అన్నాడు.

"ఏయ్ ఎర్రతేలూ ఇక్కడ ఏం చేస్తున్నావ్?"

"బండి పాడయ్యింది. దోమలగూడా వైపు వెళ్లాలి."

కురియన్ తలుపు తెరిచాడు.

ఎర్రతేలు కూర్చోగానే ఫియట్ కదిలి వేగం పుంజుకుని దూసుకుపోసాగింది.

డ్రైవింగ్‌సీట్‌లోవున్న కురియన్‌కు మారుతి కనిపించలేదు. అతడు యాక్సిలేటర్‌ను అదిమిపట్టాడు. కొద్దిక్షణాల తర్వాత ఒక చౌరస్తాను చేరుకున్న కురియన్ మూడువైపులా చూశాడు. ఎడమవయిపు రోడ్డులో దూసుకువెడుతున్న మారుతి అతడికి కనపడింది. వెంటనే ఫియట్ అటువైపు తిరిగింది.

రోడ్డుమీదికి దృష్టి కేంద్రీకరించి నడుపుతున్న శివాజీ అడిగాడు.

"ఇందాక మనల్ని టాస్క్‌ఫోర్స్ మనుషుల బార్నించి తప్పించింది ఎవరో తెలుసా?"

"ఎవరు?" రజని అన్నది.

"వాడు కాళీప్రసాద్ మనిషి. ఆరోజు బండమైసమ్మ గుడిదగ్గిర కాళీప్రసాద్ తన

ముగ్గురు అనుచరులతో వచ్చినపుడు నేను ఓ ప్రక్కన దాక్కుని వాళ్లమాటలు విన్నాను గుర్తుందా?"

"గుర్తుంది. ఆ మాటలు వినేగా పది లక్షలూ కొట్టేశావ్."

"అవును....అపుడు కాళీప్రసాద్ తోపాటు వచ్చిన ముగ్గుర్లో వీడుకూడా వున్నాడు. వీడికి కాళీప్రసాద్ భార్యకూడా తెలిసివుంటుంది. పొరపాటున వాడు వెనక సీట్ వైపు చూసివున్నట్టయితే మనపని అయిపోయేది..... వాడు అక్కడికక్కడ మనల్ని అరెస్ట్ చేయించేవాడు."

కాని ఇక్కడే శివాజీ అంచనా తప్పయ్యింది.

వెనకసీట్ లో పడుకోపెట్టివున్న పార్వతిని అతడు చూశాడని, అయినా చూడనట్టు నటించాడని శివాజీకి తెలియదు.

ఫియట్ ను డ్రైవ్ చేస్తున్న కురియన్ ఎర్రతేలును ఉద్దేశించి అన్నాడు.

"మన బాస్ పెళ్లాం నీకు కనపడిందా?"

ఎర్రతేలు తలవూపి చెప్పాడు.

"కనపడింది గురూ! ఆమె ప్రక్కనే పచ్చికొబ్బరిముక్కలాంటి పన్నెల విసనకర్ర కూర్చునివుంది."

గుటకమింగుతూ అన్నాడు ఎర్రతేలు.

"నేను సీరియస్ గా మాట్లాడుతున్నపుడు

## హిట్ లిస్ట్

పిచ్చిపిచ్చి కామెంట్లు చేయకు" కురియన్ విసుక్కున్నాడు.

"మనం ఆ బాధకవ్ గాడికి హెల్ప్ చేస్తున్నాంకదా! మన ప్లాన్ సక్సెస్ అవుతుందంటావా?" నల్లముత్తుకు అనుమానం వచ్చింది.

కురియన్ ఒక విషపునవ్వు నవ్వి చెప్పాడు.

"నేనుకనక ఒక ప్లాన్ వేస్తే అది సక్సెస్ అవ్వకపోవడం అంటూ జరగదు."

"మరి యింతకుముందు మన బాస్ పెళ్లాన్ని చంపడానికి నువ్వుచేసిన ప్లాన్ పారలేదుకదా గురూ?"

నల్లముత్తు మాటకు కురియన్ ఏదో అనబోయాడు.

కాని అదే సమయంలో దూరంగా వేగం తగ్గుతున్న మారుతి అతడి దృష్టిని ఆకర్షించింది.

స్పీడ్ గా డ్రైవ్ చేస్తున్న శివాజీ మారుతి వేగంలో వచ్చిన మార్పు చూసి ఉలిక్కిపడ్డాడు. మారుతి రెండు జర్కులిచ్చి ఆగిపోయింది. తిరిగి ఇంజన్ స్టార్ట్ చేద్దామని అతడు చేసిన ప్రయత్నాలు వ్యర్థం అయ్యాయి. ముందు పెట్రోల్ అయిపోయిందేమో అనుకున్నాడు. కాని ఫ్యూయల్ ఇండికేటర్ నీడిల్ ట్యాంక్ నిండా పెట్రోలు వున్నట్లు చూపుతోంది. శివాజీకి కారు మెకానిజం గురించి తెలియదు.

"ఇపుడు ఏం చేద్దాం?" రజని భయంగా అడిగింది.

స్పృహలేకుండా పడివున్న పార్వతిని చూస్తుంటే ఆమె భయం మరీ పెరుగుతోంది.

"ఏంచేస్తాం? ఎవర్నన్నా లిఫ్ట్ అడుగుదాం. అలా ఊర్కే కంగారుపడకు" శివాజీ విసుక్కుంటూ కారుదిగాడు.

"మరి ఆవిడను అలాగే వదిలేద్దామా?"

"ఆమెను కిడ్నాప్ చేసింది పదిలక్షల కోసం. అంతడబ్బు వచ్చేవరకూ ఆమెను ఒదిలేదిలేదు. తెల్సా."

రజని మాట్లాడలేదు. ఆమెకు యింకా భయంగానేవుంది.

శివాజీ దూరంగా వస్తున్న ఒక మటాడోర్ వ్యాన్ కనపడింది. మటాడోర్ వ్యాన్ దగ్గరికి రాగానే లిఫ్ట్ కోసం అన్నట్టు బొటనవేలు పైకెత్తి చూపించాడు.

మటాడోర్ ను నడుపుతున్న డ్రైవర్ శివాజీవంక నిర్లక్ష్యంగాచూసి వ్యాను వేగాన్ని పెంచాడు.

"ఇంతరాత్రివేళ మనకు కారు దొరుకుతుందన్న నమ్మకంలేదు. నామాట విని

ఈమెను ఇక్కడే వదిలేసి వెళ్లిపోదాం. నాకెందుకో భయంగావుంది."

"షటప్" శివాజీ కోపంగా అరిచాడు.

రోడ్డుప్రక్కగా చీకటిగావున్న ప్రదేశంలో ఫియట్ ఆపాడు కురియన్. మారుతి ఆగిపోవడంతో అతనికి అసహనంగావుంది. అర్జంటుగా శివాజీ గమ్యస్థానాన్ని చేరాలి..... ఎలా?

కురియన్ క్రిందపెదవి కొరుక్కుంటూ రెండే రెండుక్షణాలు ఆలోచించాడు. అతడి మనసులో సులేమాన్ ప్రత్యక్షం అయాడు. వెంటనే కురియన్ కారు దిగి ఓ వందగజాల ముందుకు నడిచాడు.

పేవ్‌మెంట్ ప్రక్కనేవున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లోకి ప్రవేశించి సులేమాన్ సర్వీస్‌స్టేషన్ నెంబరు త్రిప్పాడు.

అవతల్నించి ఫోన్ మోగుతున్న శబ్దం వినపడుతోంది. రెండు నిమిషాల తర్వాత సులేమాన్ లైన్‌లోకి వచ్చాడు. నిద్రలో తూగుతున్నట్టు అతడి కంఠం బరువుగావుంది.

"నేను కురియన్ని. ఏంటి ఇవ్వాళ షెడ్ త్వరగా మూసేశావ్?" కురియన్ అన్నాడు.

కురియన్ అనే పేరు వింటూనే సులేమాన్ ఎలర్టయిపోయాడు.

"నేను చెప్పేది జాగ్రత్తగా విను. నీ సర్వీస్‌స్టేషన్ నుంచి సికింద్రాబాద్ రోడ్డువైపు వస్తుంటే 'రెయిన్‌బో' టవర్స్ వస్తాయి గుర్తుందా!"

"అవును. గుర్తుంది."

"ఖచ్చితంగా ఆ టవర్స్‌కు ఎదురుగా ఒక మారుతి బ్రేక్‌డౌన్ అయి ఆగిపోయింది. నువ్వు యిపుడే బయల్దేరివెళ్లి రిపేర్‌చెయ్. మారుతి వెంటనే అక్కణ్ణించి కదలాలి. అర్ధం అయిందా?.... నేను నీకు ఫోన్‌చేసి పంపించినట్టు మారుతిలోవున్నమనుషులకు తెలియకూడదు. సంర్ఝే...."

"అలాగే సర్... ఇపుడే బయల్దేరుతున్నా."

సులేమాన్ రిసీవర్ క్రెడిల్‌చేసి బయటకు పరుగుతీశాడు. కార్లను రిపేరుచేయడంలో సులేమాన్ మంచి ఎక్స్‌పర్ట్.

రెండు నిమిషాలు గడిచాయి.

డబడబమని శబ్దంచేస్తూ వచ్చిన ఒక పాత వ్యాన్‌గార్డ్ కారు మారుతి ప్రక్కన ఆగింది. డ్రైవింగ్‌సీట్‌లోవున్న సులేమాన్ శివాజీని ఉద్దేశించి అడిగాడు.

"ఏదన్నా రిపేరా?" అంటూ.

శివాజీ అవునన్నట్టు తల ఊపాడు. వ్యాన్‌గార్డ్‌మీద రాసివున్న 'సులేమాన్ సర్వీస్‌స్టేషన్' అని అక్షరాలు చూసినతర్వాత అతడికి ఎంతో రిలీఫ్‌గా అనిపించింది.

శివాజీ తలవూపగానే సులేమాన్ ఒక



చిన్న లెదర్‌బ్యాగ్‌తో క్రిందికి దిగాడు. మారుతి బానెట్ ఎత్తాడు.

రెండే రెండు నిమిషాల్లో ఇంజన్ స్టార్ట్ అయ్యింది.

"మీరుచేసిన సహాయానికి చాలా థాంక్స్" అంటూ శివాజీ చొక్కాజేబులో చెయ్యిపెట్టాడు.

అతడిని వారిస్తూ చెప్పాడు సులేమాన్.

"ప్లీజ్.... నేను చేసింది చాలా చిన్న రిపేరు.... మీరు ట్రబుల్‌లో వుండడం వల్ల హెల్ప్‌చేశానంతే. హెల్ప్‌చేసినందుకు నేను డబ్బులు పుచ్చుకోను."

సులేమాన్ వ్యాన్‌గార్డులో కూర్చున్నాడు. మరుక్షణం అది డబడబమని శబ్దం చేస్తూ కదిలింది.

సులేమాన్ రిపేరుచేయడం, మారుతి కదలడం కురియన్ చూస్తూనేవున్నాడు. ఫియట్‌కూ మారుతికి కనీసం పావుకిలోమీటరు దూరంవుండేటట్టు జాగ్రత్తపడుతూ ఫాలో చేయసాగాడు.

శివాజీ తన ఇంటికి చేరుకోవడానికి పదిహేను నిమిషాలు సమయం పట్టింది.

వీధి ఈ చివర్నించి ఆ చివరివరకూ చీకటిగా, నిర్మానుష్యంగావుంది.

## వన్నెలాడి కాదు... వన్నెలాడు!

ఎవరీ వన్నెలాడి అనుకుంటున్నారా? వన్నెలాడి కాదు వన్నెలాడు. స్విమ్మింగ్‌డ్రస్‌లో వున్న ఈ వన్నెలాడు ఎవరో కాదు హిందీ చలన చిత్ర నటుడు నసీరుద్దీన్ షా. కళాత్మక చిత్రాల్లో తప్ప నటించనన్న ఈ నటుడు యిలాంటి వేషాల్లో ఎందుకు నటిస్తున్నాదంటారేమో? ఆ చిత్రాలు తీసే నిర్మాతలు కరువైపోతే యిటువంటి చిత్రాలకు (ఏ పాత్రల కైనా) తల ఒగ్గక తప్పే దేముంది? 'తెహల్‌కా' అనే చిత్రంలో షా ఈ డ్రస్సు వేసుకుని ఒక డ్యాన్స్ సన్నివేశంలో నటించాడు. ఇతనితో పాటు మరో యిద్దరు నటులు కూడా యిదే డ్రస్సులో కనువిందు చేస్తారట. డబ్బు కోసం ఎటువంటి పాత్రలకైనా వీళ్లు సిద్ధపడతారనే విషయాన్ని యిది రుజావు చేస్తోంది కదూ!

శివాజీ, రజనీ పార్వతిని మోసుకుంటూ ఇంట్లోకి వెళ్ళి ఒక కుర్చీలో కూర్చోపెట్టారు.

శివాజీ రిలీఫ్‌గా ఊపిరి పీల్చి రజనితో చెప్పాడు.

"గదిలో అమూల పడివున్న తాళ్లు, గుడ్డపీలికలు పట్రా."

రజని ఎందుకు? ఏమిటి? అని అడగలేదు. ఆమె అతడు చెప్పినపని చేసింది. రజని తెచ్చిన తాళ్లతో శివాజీ పార్వతి కాళ్లూ, చేతులూ కట్టేశాడు. గుడ్డపీలికలతో అరవకుండా నోటిని బంధించాడు.

శివాజీ ఈపని పూర్తిచేయగానే పార్వతి కళ్లు తెరిచింది. ఆమెకు స్పృహవచ్చిందని గ్రహించిన శివాజీ అన్నాడు.

"చూడండి! మేం మిమ్మల్ని ఏమీ చేయం. మీకు హానిచేసే ఉద్దేశంకూడా మాకు లేదు. కేవలం డబ్బుకోసం మిమ్మల్ని కిడ్నాప్ చేశాం. మీ భర్త కాళీప్రసాద్‌కు ఇప్పుడు ఫోన్ చేసి పది లక్షలు కావాలని బెదిరిస్తాం. ఆయన మేం అడిగిన డబ్బు యివ్వగానే మిమ్మల్ని వదిలేస్తాం. ప్లీజ్ నన్ను నమ్మండి."

పార్వతి కళ్లలో భయం, ఆశ్చర్యం ప్రస్ఫుటమవుతున్నాయి.

"రజనీ మనం యిప్పుడు వెంటనే బయటకువెళ్లి కాళీప్రసాద్‌కు ఫోన్‌చేద్దాం. పది లక్షలు యిమ్మని డిమాండ్ చేద్దాం. అన్ని కోట్లు సంపాదించినవాడికి ఆఫ్టాల్ పది లక్షలు ఒక లెక్కకాదు. వెళ్దాంపద."

రజని తల వూపింది.

ఇద్దరూ బయటకు నడిచారు.

శివాజీ బయట తలుపును గొళ్లెంపెట్టి తాళంవేశాడు.

ఆ వీధి దాటినతర్వాత, రెండు వీధుల అవతల ఒక పబ్లిక్ టెలిఫోన్‌బూత్ వుంది.

శివాజీ మారుతి ఎక్కి టెలిఫోన్‌బూత్ వైపు వెళ్లగానే వీధి మొదట్లోవున్న ఫియట్ కదిలింది. కురియన్ శివాజీ ఇంటి ముందు కారు ఆపాడు. గుమ్మానికి వేలాడుతున్న పాత తాళంకప్ప చాలా తేలిగ్గా పగలకొట్టేశాడు.

కురియన్, నల్లముత్తు, ఎర్రతేలు లోపలకి నడిచాడు. వాళ్లను చూడగానే పార్వతి కళ్లు ఆనందంగా మెరిశాయి. ఆ ముగ్గురినీ రెండు మూడుసార్లు ఆమె కాళీప్రసాద్‌తో చూసింది. వాళ్లు తనను విడిపిస్తారనే భ్రమలోవున్న పార్వతి మనసు ఒక్కసారిగా దూదిపింజలా తేలిగ్గా అయ్యింది.

కురియన్ ఆమెవంక క్రూరంగాచూసి చెప్పాడు.

"మేం వచ్చింది నిన్ను విడిపించడానికి కాదు.... నిన్ను చంపడానికి. అసలు మామూలుగా అయితే నిన్ను మేం ముగ్గురం తనివిదీరా రేప్‌చేసి చంపి పారేయాలనుకున్నాం. కాని యిపుడు అట్టే టైంలేదు. ఇపుడు నీ మొగుడికి ఫోన్‌చేయాలని బయటకు వెళ్లినవాడు తిరిగివచ్చేస్తాడు. వాడు వచ్చేలోపే నిన్ను అనుభవించాలనే మా ముగ్గురి కోర్కె తీరకపోయినా, నిన్ను సఫాచేసి పారేయాలనే నీ మొగుడి కోర్కెమాత్రం తీర్చక తప్పదు. కొద్దిక్షణాల్లో చస్తున్నావ్ కనక చివరగా నీకు ఒక నిజం చెపుతున్నాను. నీ మొగుడు మోహిని అనే అమ్మాయిని చాలాకాలంగా వుంచుకున్నాడు. నీ పేర్న అయిదు లక్షలు ఇన్స్యూర్‌చేశాడు. ఇపుడు మేం నిన్ను చంపితే ఆ అయిదు లక్షలూ రావడమేకాదు. మోహిని అతడి భార్యగా మారుతుంది."

చెప్పడం పూర్తికాగానే కురియన్ జర్కిన్ పాకెట్‌లోంచి పొడవాటి చురకత్తి పైకితీ

# హిట్ లిస్ట్

శాడు. లైటు కాంతిలో అది ఒక్కక్షణం జిగేల్‌మని మెరిసింది. ఎర్రతేలు, నల్లముత్తు తమ ఆయుధాలుకూడా బయటకు తీశారు.

కాళ్లూ చేతులూ బలంగా బంధించివుండడం, అరవకుండా నోటిని కట్టివేయడంతో పార్వతి వాళ్లని ప్రతిఘటించలేక పోయింది. కనీసం అరవడానికికూడా ఆమెకు అవకాశంలేదు. అయితే ఆమె ముంచుకువచ్చిన మృత్యువును చూసి ఏడవడంలేదు. తను హృదయపూర్వకంగా ప్రేమించిన కాళీప్రసాద్ తనను హత్యచేయడానికి మనుషుల్ని నియమించాడన్న నిజాన్ని ఆమె తేలిగ్గా జీర్ణంచేసుకోలేకపోతోంది. ఒకరకమైన షాక్‌తో ఆమె మెదడు స్థంభించిపోయింది.

కురియన్ కత్తి తీయగానే నల్లముత్తు, ఎర్రతేలుకూడా తమ దుస్తులచాటు నుంచి ఆయుధాలు పైకితీశారు. చురకత్తి పార్వతి గుండెలవరకూ పోనిచ్చిన కురియన్ ఛటుక్కున ఆగిపోయాడు.

అతడి దృష్టి ఒకప్రక్కగా బల్లమీద పడివున్న యాపిల్‌పళ్లమీద, ఒక యాపిల్‌పండులో గుచ్చివున్న కత్తిమీద పడింది. మరొక చాకు కూరగాయల బుట్టలో పడివుంది. వాటిమీద పార్వతిని కిడ్నాప్‌చేసిన మనుషుల వేలిముద్రలు వుండవచ్చుననే ఊహ రాగానే, కురియన్ తన చేతిలోని కత్తి తిరిగి జర్కిన్ జేబులోకి తోసేశాడు. తమ ముగ్గురి చేతులకూ గ్లౌజస్ వున్నాయికనక ఫింగర్ ప్రింట్సుపడే ప్రశ్నేలేదు. వెంటనే కురియన్ యాపిల్‌పండుకు గుచ్చిన కత్తి, కూరల బుట్టలో పడివున్న చాకూ తీసుకున్నాడు. చాకు ఎర్రతేలువైపు విసిరాడు.

పార్వతివైపు ఒక్కసారిగా క్రూరంగా చూశాడు. అతడి మనస్సులో కాళీప్రసాద్ ప్రామిస్‌చేసిన యాభై వేల రూపాయలు మెదులాయి. వెంటనే కత్తి నేరుగా బలంగా కసిగా ఆమె గుండెల్లో దించాడు.

కురియన్ చేతిలోని కత్తి పార్వతి ఎడమరొమ్మును చీల్చుకుంటూ గుండెలో దిగబడింది.

భరించలేని బాధ.

ఆమె ఆర్తనాదం చేయాలనీ, కాళ్లూ చేతులు విదిల్చాలనీ విశ్వప్రయత్నంచేసింది. కాని ఆమె ప్రయత్నం ఫలించలేదు.

కురియన్ పిడివరకూ దిగిన కత్తి బయటికి లాగాడు. మరుక్షణం ఫౌంటెన్‌లా చిమ్మిన పార్వతి రక్తంతో అతడి ముఖం తడిసింది. కురియన్ ఎడమచేత్తో ముఖాన్ని తడిపిన రక్తాన్ని తుడిచి ఆ చేతిని గోడకు రుద్దాడు. అతడు అంతటితో ఆగకుండా మరో అరడజనుసార్లు పార్వతి గుండెను తూట్లుతూట్లుగా పొడిచాడు.

ఎర్రతేలు తన చేతిలోని చాకు ఆమె పొత్తికడుపులోకి దించాడు. చాకు బాగా లోపలికి దిగినతర్వాత దాన్ని గుండ్రంగా తిప్పుతూ బయటకులాగాడు. ఆ చర్యతో ఆమె కడుపులోని పేగులు ముక్కలుముక్కలుగా తెగాయి. ఎర్రతేలు మరొక నాలుగుసార్లు ఆమె పేగుల్ని చాకుతో కలియబెట్టాడు. అతడిపని పూర్తి అవగానే నల్లముత్తు చాకు అందుకుని కుర్చీ వెనక్కు నడిచాడు. వెనకవైపు నుంచి తెల్లగా ఆమె వీపు కనపడుతోంది.

వెన్నుపూస పక్కగా వీపుకు కిందిభాగంలో తన బలం మొత్తాన్నీ ప్రయోగిస్తూ చాకుతో పొడిచాడు. పార్వతి శరీరంలోకి దూసుకువెళ్లిన చాకు సరిగ్గా ఆమె కిడ్నీలో దిగబడింది. అలాంటి ఒక పోటు చాలు మనిషిని చంపిపారేయడానికి. బలంగా లోపలకి దిగిన చాకు పైకితీసి అదే వేగంతో రెండో కిడ్నీలోకి దించాడు. ఇక దాన్నిపైకి తీయడం అనవసరం. నల్లముత్తు కిడ్నీలోకి దిగిన చాకు అలాగే వుంచేశాడు. ఆప్రకారంగా పార్వతిని చంపే కార్యక్రమం అయిదునిమిషాల్లో పూర్తి అయ్యింది.

కురియన్ తన చేతిలోని కత్తి ఆమె కుడిరొమ్ములోకి దించాడు. దాన్ని అక్కడే వదిలేసి యిక వెడదాం అన్నట్టు మిగిలిన యిద్దరివైపు చూశాడు.

సరిగ్గా ఆసమయంలో వాళ్లవెనగ్గా అలికిడి అయింది. ముగ్గురూ తలలు తిప్పిచూశారు. మరుక్షణం షాక్ తిన్నట్టు నిలబడిపోయారు.

(ఇంకావుంది)





స్వంతం చేసుకోండి ఒక గృహం ...




... ఎన్నుకోండి దీనికై

వైశ్యాబ్యాంక్ వారి **సరియైన పథం**

# ఫస్టు హోమ్ స్కీమ్

(నేషనల్ హౌసింగ్ బ్యాంక్ వారి హెచ్.ఎల్.ఎ. పథకం)

మీ కలలను నిజం చేసేందుకు ఋణంతో జోడింపబడ్డ ఒక ఆకర్షణీయమైన పొదుపు పథకం.

పథకం యొక్క ప్రముఖ అంశాలు:

★ పొదుపులో వ్యవధి మరియు వాయిదాల పద్ధతిలో మార్పులకు స్వేచ్ఛ.

★ పొదుపుపై ఆదాయపు పన్ను రియాయితీ. ఐశ్వర్యపు పన్ను వినాయింపులు కూడా.

★ తక్కువ వడ్డీ రేట్లలో ఖచ్చిత ఋణాలు.

★ అత్యవసర సందర్భములో పొదుపుకాలము కాక మునుపే బ్రిడ్జిలోను సౌకర్యం.

★ మీరు ఎంపిక చేసిన వ్యక్తికి నామ నియామక సౌకర్యం.

★ స్వంత గృహము లేని మీ అప్రబుద్ధ పిల్లల పేరులో పొదుపు సౌకర్యం.

★ వైశ్యా బ్యాంక్ క్రెడిట్ కార్డ్‌కి ఉచిత సభ్యత్వం.

★ వివిధ గృహ అభివృద్ధి పథకాలలో ఖాతాదారులకు ప్రత్యేక కేటాయింపు.

★ సాంకేతిక సలహా.









## ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్

రిజిష్టర్డు ఆఫీసు : 489, ఎవెన్యూ రోడ్, బెంగుళూరు - 560 002.

ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు : 72, సైంట్ మార్క్స్ రోడ్, బెంగుళూరు - 560 001.

చైర్మన్ : రమేష్ గల్లి.

Crest/90/248

# ఆత్మీయత

దేవినేని ఉష

"అమ్మా అక్క ఇవాళ కాలేజీ ఎగ్గొట్టి క్లాస్‌మేట్స్‌తో సినిమాకు వెళ్ళిందే!" ఇంటర్ ఫస్టియర్ చదువుతున్న సరళ రిపోర్ట్ చేసింది.

అప్పుడే ఇంటికి వచ్చిన రేవతి చెల్లెల్ని మింగేసేలా చూసింది.

మధ్యాహ్నం రెండు క్లాస్‌లు లేవు. అందరూ సరదాగా వెళ్ళారు.

సరళ కూడా అదే కాలేజీలో చేరిన దగ్గర నుండి రేవతికి పెద్ద తలనొప్పి అయిపోయింది.

రేవతి బి. ఎ సెకండియర్ చదువుతోంది.

సరళ, రేవతి అక్క చెల్లెళ్ళు అయినా బద్ధ శత్రువులకంటే ఎక్కువ.

వాళ్ళ నాన్న హైకోర్టులో గుమస్తా, తల్లి కాంచన ప్రైవేట్ కాన్వెంట్‌లో టీచర్.

ఆడపిల్లలే అయినా ఇద్దరు చాలు అనుకున్నారు. పెరిగి పెద్ద అవుతున్న కొద్దీ ఆ ఇద్దరూ శత్రువుల్లా పది మంది పిల్లలున్నంత విసిగిస్తున్నారు.

అక్కడకూ కాంచన చాలా జాగ్రత్తగా ఉంటుంది. కూతుళ్ళిద్దరూ ఒకరి మీద ఒకరు చెప్పుకునే చాడీలు ఆమె సామాన్యంగా పట్టించుకోదు.

అయినా వాళ్ళిద్దరూ ఒకళ్ళమీద ఒకళ్ళు ఎప్పుడూ కయ్యానికి కాలు దువ్వుకుంటూనే ఉంటారు.

వయసు పెరుగుతున్నా జ్ఞానం తెలుసుకోలేని వాళ్ళను అదుపులో పెట్టలేక కాంచన వదిలేసింది.

ఎవరి వ్యక్తిత్వంలోనూ లోపం లేదు. కానీ ఒకరి విషయంలో మరొకరు అనవసరంగా కలగజేసుకుని వాదం ఆడుకుంటూ ఉంటారు.

రాత్రి నిద్రపోయే వరకూ రేవతి సినిమాకు వెళ్ళిన విషయం మీద రేవతి, సరళ పోట్లాడుకుంటూనే ఉన్నారు.

★ ★ ★ ★ ★ ★ ★

మర్నాడు సరళ కాలేజీకి వెళ్తూ దారిలో ఫ్రెండ్ ఇంటికి వెళ్ళి ఆ ఫ్రెండ్‌తో అరగంట లేట్‌గా కాలేజీకి వెళ్ళింది.

ఆ రోజు రేవతి చెల్లెల్ని సాధించి వదలి పెట్టింది. కాంచన ఇద్దర్నీ కేకలు వేసింది.

"మీ ఇద్దరూ ఇక ఎప్పుడూ ఇంతేనా! ఆడపిల్లలు ఒకరికి ఒకరు తోడుగా ఉంటారని నేను ఎంతో సంబరపడ్డాను. ఒకరి కష్ట, సుఖం ఒకరికి చెప్పుకునేది పోయి ఇలా తగాదాలు ఆడుకుంటున్నారా!

"అసలు నా సంగతి నీ పెద్ద కూతురికి



ఎందుకూ?''

సరళ కచ్చుగా అరిచింది.

కాంచన రేవతి వేపు తిరిగింది.

''రేవతీ! అదంటె చిన్న పిల్ల. పెద్దదానివి. నీ బుద్ధి ఏమయింది?''

రేవతి కళ్ళు కలువల్లా అయ్యాయి.

''ఎంతయినా నీకు చిన్న కూతురు అంటేనే ప్రేమ. నిన్న నేను ఫ్రెండ్స్‌తో సినిమాకు వెళ్ళానని అది ఎంత రాద్ధాంతం చేసింది. నువ్వు దాన్ని ఏమైనా అన్నావా!''

కాంచన తల పట్టుకుని కుర్చీలో కూలబడింది.

★ ★ ★ ★ ★ ★

రేవతి బి. ఎ ఫైనల్ ఎగ్జామ్స్ రాసింది.

సరళ, రేవతి ఏమాత్రం మారలేదు.

వాళ్ల చిలిపి తగాదాలు పెరుగుతున్నాయే తప్ప తగ్గటం లేదు.

కాంచన, రామారావు పెద్దకూతురు రేవతికి పెళ్ళి సంబంధాల వేటలో పడ్డారు.

త్వరలోనే అందరికీ నచ్చిన సంబంధం ఒకటి సెటిల్ అయింది.

రేవతి కాదనలేదు. ఆమెకూ పెళ్ళి చేసుకుని ఈ ఇంట్లో నుండి వెళ్ళిపోతే చెల్లెలిపోరు తప్పుతుందని, హాయిగా కాలక్షేపం చేయవచ్చుని మనస్సులో అనిపిస్తోంది.

ఈ ఇంట్లో నుండి బైట పడాలంటే పెళ్ళి ఒక్కటే దారి.

పెళ్ళికొడుకు గోవింద్ హైదరాబాద్‌లోనే సెక్రటేరియట్‌లో క్లర్క్ చేస్తున్నాడు.

తల్లి, తండ్రీ ఎక్కడో పల్లెటూరిలో ఉంటున్నారు. పెళ్ళి కావటమే వేరు కాపురం.

రేవతి కన్నె హృదయం ఎన్నో ఊహలు అల్లుకోసాగింది.

అక్క పెళ్ళికి తెస్తున్న చీరలు, నగలు చూస్తున్న సరళకు కుళ్ళు ఎక్కువైపోతోంది.

అక్కకు తెచ్చిన ప్రతి వస్తువూ తనకు కావాలని పేచీ పెట్టసాగింది.

''నీ పెళ్ళి వరకూ ఓపిక పట్టాల్సిందే!'' అంటూ రామారావు, కాంచన కూతురికి నచ్చజెప్పసాగారు.

రేవతి పెళ్ళి ఉన్నంతలో సంతోషంగా జరిగిపోయింది.

సరళ హుషారుగానే తిరిగినప్పటికీ అక్కను చూసి లోలోపలే అసూయతో రగులుతోంది.

రేవతి వేరు కాపురం పెట్టుకుంది.

★ ★ ★ ★ ★ ★ ★

సరళ ఉదయం ఆరు గంటలకే లేచింది.

పెళ్ళి హడావుడిలో కాంచనకు కీళ్ళవాతం పట్టుకుంది. ఆమె ఇంకా నిద్ర లేవలేదు.

రామారావు అలవాటు చొప్పున ఐదు గంటలకే లేచి మార్నింగ్ వాక్‌కు వెళ్ళిపోయాడు.

సరళకు ఇల్లంతా ఒక్కసారిగా నిశ్శబ్దం అయిపోయినట్టు ఉంది.

ఆదే అక్క ఉంటే ఈ పాటికి ఏదో వాదాలు పోతూ




వినోద్ చోప్రా కొత్తవాళ్లతో ఒక ప్రేమ కథను చిత్రంగా తీయాలని నిర్ణయించుకున్నాడట. అందులో కిరణ్ జునేజాకు హీరోయిన్ పాత్ర లభించబోతోంది. మహాభారత్, బునియాద్, ఏజోహై జిందగీ, కథాసాగర్ సీరియల్స్ ద్వారా టి.వి. ప్రేక్షకులకు జునేజా సుపరిచితురాలే. తాను చోప్రా చిత్రంలోనే కాకుండా 'అంబా, హమ్‌షకల్, ధరమ్, అకయ్‌లా' చిత్రాలలో శశికపూర్, అమితాబ్, జాకీష్రాఫ్, ఆదిత్య పాంచోలీల సరసన నటిస్తున్నానని ప్రకటించి అందర్నీ ఆశ్చర్యపరిచింది. మరి ఆ అమ్మాయి అందంచూసో, నటన చూసో...యిన్ని చిత్రాల్లో బుక్ చేసుకున్నారు నిర్మాతలు. చిత్రాల జయాపజయాలు దైవాధీనాలే మరి!



ఉండేవాళ్ళు.

తల్లి విసుగులు, తమ పోట్లాటలతో ఇల్లంతా సందడిగా ఉండేది.

ఇంత నిశ్శబ్దం, ఒంటరితనం అనిపించేది కాదు.

అక్క ఒక్కతి లేకపోతే బోర్‌గా ఫీల్ అవసాగింది సరళ.

మార్నింగ్ వాక్ నుండి రామారావు తిరిగి వచ్చాడు. కాంచన మౌనంగా తన పనులు తను చేసుకుపోతోంది.

ఎన్నడూ లేనిది ఈ రోజు సరళ మనసంతా ఒక విధమైన ఒంటరితనంతో నెర్వస్‌గా ఫీల్ అవసాగింది.

పదే పదే అక్కమాటలు, చేతలు గుర్తు రాసాగాయి.

అక్క ఉంటే బాగుండు అన్న భావన కలగసాగింది.

హాలీడేస్ కాబట్టి కాలేజీ లేదు.

రామారావు ఆఫీస్‌కు వెళ్ళిపోయాడు.

కూతురి భావాలు పట్టించుకోని కాంచన ఒక పని వెనుక మరొక పని చేసుకోసాగింది.

సరళ ఉదాసీనతను వదుల్చుకునేందుకు తల్లికి పనుల్లో సహాయ పడబోయింది.

కానీ అలవాటు లేని పనులు.

సరళకు చేతకాలేదు.

"నేను చేసుకుంటాను. నువ్వు వెళ్ళు సరళా"! చెప్పింది కాంచన.

సరళ గదిలోకి వచ్చేసింది.

అక్కతో కలసి మాట్లాడుకున్నా, పోట్లాడుకున్నా గలగలా ఉండే తత్వం. ఇప్పుడు హఠాత్తుగా నోరు కట్టేసినట్టు అయింది.

సరళకు రెండు రోజులు అతి భారంగా గడిచాయి. అక్కలేని లోటు ఎంతో తెలుస్తోంది.

వెళ్ళి చూడాలంటే అక్క ఉండేది ఈ వూళ్ళోనే.

# ఆత్మీయత

కానీ సరళకు అక్కను ఒకు విసిగించిన వైనాలు, తిట్టిన తిట్లు గుర్తు వస్తున్నాయి.

ఇక్కడున్నంత కాలం అక్కకు తనెంతో ద్రోహం చేసినట్టుగా ఫీల్ అవసాగింది.

అందుకే అక్క ఇంటికి వెళ్లలేక పోతోంది.

అక్కపట్ల తన ప్రవర్తనకు ఇప్పుడు సరళ మనస్సు పశ్చాత్తాపంతో నిండిపోసాగింది.

ఈ సారి అక్క వస్తే తన తప్పులన్నీ ఒప్పుకుని ఆమెను క్షమాపణ కోరి అక్కతో ఇక ముందు నుండి అయినా సఖ్యతగా ఉండాలని అనిపిస్తోంది.

* * * * * *

చేతిలోని నావెల్ విసుగ్గా పక్కన పడేసింది రేవతి.

చదివి, చదివి తల పట్టేసినట్టు అవుతోంది.

కొత్త కాపురం పెట్టి పదిహేను రోజులు అయింది.

భర్త గోవింద్ ఉదయం తొమ్మిది గంటలను బయల్దేరి ఆఫీస్‌కు వెళ్ళి తిరిగి సాయంత్రం ఏడు అవుతుంటగా గాని ఇంటికి చేరడు.

ఆఫీస్ దూరం కావటంతో మధ్యాహ్నానికి క్యారేజీ తీసుకు వెళ్ళిపోతాడు.

వంటపని అంతా అతను ఉండగానే పూర్తి అయిపోతుంది. మరో గంట అయితే మిగిలిఉన్న పని అంతా పూర్తి అయిపోతుంది.

ఇక అంతే అప్పటి నుండి రాత్రి ఏడుగంటల వరకూ ఒంటరితనం.

పుట్టింట్లో అయితే చెల్లి, తను పోట్లాడుకున్నా సందడిగా గడచిపోయేది.

ఇప్పుడు మాట్లాడే వాళ్ళు లేరు. పోట్లాడే వాళ్ళు లేరు.

భరించలేని ఒంటరితనం. పిచ్చెక్కించేలా ఉంది.

పూర్వంలా పుట్టింట్లో ఉండిపోయి చెల్లెలితో దెబ్బలు కయ్యాలు పెట్టుకుంటే బావుండు అనిపించసాగింది.

చెల్లెలిని తను అన్న మాటలు, తల్లికి ఆమె మీద చాడీలు చెప్పి తిట్టించిన సందర్భాలు గుర్తువచ్చి రేవతి కళ్ళు చెమ్మగిల్లాయి.

ఉన్న ఒక్క చెల్లెలితో తను సఖ్యతగా ఉండక ఆమెతో రోజూ పోట్లాట పెట్టుకునేది.

అవే భావాలతో రేవతి హృదయం బాధతో దహించుకు పోసాగింది.

పుట్టింటికి వెళ్ళి అప్పటికప్పుడు చెల్లి దగ్గర జేరి కరువుతీరా మాట్లాడాలనిపించేది.

కానీ చెల్లెలిపట్ల అప్పటి తన ప్రవర్తన గుర్తు వచ్చి పుట్టింటికి వెళ్లలేక పోయేది.

* * * * * *

రెండు రోజులకు రేవతికి జ్వరం వచ్చేసింది.

గోవింద్ కంగారు పడిపోయాడు.

ఆటోలో భార్యను ఎక్కించుకుని అత్తగారి ఇంటికి తీసుకు వచ్చాడు.

జ్వర తీవ్రతలో తూలి పడిపోతున్న రేవతిని చూసి రామారావు, కాంచన కంగారు పడ్డారు.

కొత్త జంటను డిస్టర్బ్ చేయకూడదని వాళ్ళు ఈ పదిహేను రోజుల్లో కూతురి ఇంటికి వెళ్లలేదు.

సరళ మనసు అక్కకు వచ్చిన జ్వరం చూసి తల్లడిల్లిపోయింది.

ఆమెలో అణగారి పోయి ఉన్న సోదరి ప్రేమ వెల్లువలా బైటకు దూకింది.

అక్కను కంటికి రెప్పలా చూసుకుంది.

తను నిద్రాహారాలు మాని అక్కకు చాకిరీ చేసింది.

అక్కా, చెల్లెలు అనే పదాల్లోని ఆత్మీయత అంటే ఏమిటో ఆమెకు ఇప్పుడు తెలుస్తోంది.

నాలుగు రోజుల తరువాత రేవతి స్పృహలోకి వచ్చింది. కళ్లముందు చెల్లెలు కనబడే సరికి ఆమెకు దుఃఖం ముంచుకు వచ్చింది.

ఆ సమయంలో గోవింద్ కూడా అక్కడే ఉన్నాడు

"రేవతీ ఎందుకు ఏడుస్తావు? సరళ నిన్ను ఎంతో శ్రద్ధగా చూసుకుంది. ఆమె దగ్గర లేకపోతే నువ్వు ఇంత త్వరగా కోలుకునే దానివి కాదు" అన్నాడు.

రేవతి చెల్లెలి వేపు కృతజ్ఞతగా చూసింది.

"అక్కా! ఇలాగైనా నా పాపం పరిహారం చేసుకున్నాను. ఇంట్లో ఉన్నంత కాలం నిన్ను విసిగించాను. నన్ను క్షమించు" సరళ కన్నీరు కారుస్తూ అక్క ఒడిలో తల పెట్టుకుంది.

రేవతి చెయ్యి ఆప్యాయంగా సరళ తలను నిమిరింది.

"సరళా మనం ఇకనుండైనా ఆత్మీయతగా మసులు కుందాం. ఆలస్యంగానైనా మన తప్పును దిద్దుకుందాం!" అంది.

"అలాగే అక్కా"! సరళ మాటల్లో ఎంతో ఆత్మీయత ఒలికింది.



# దుష్యంతుడు చంద్రమోహన్

వీరిని మరిచి పోలేము

హిందీ చిత్రాల పాత నటుల్లో కంఠబలం గల నటుల్లో ప్రథమ స్థానం చంద్రమోహన్‌ది. 15 సంవత్సరాలు తన నటనతో ఉర్రూత లూగించిన మహా నటుడు. ఆయన నటించిన చిత్రాలు చూచిన ఆనాడు సినీమా ప్రేక్షకులు ఇప్పటికీ అతన్ని తలుచుకుంటారు. నిప్పులుకక్కే ఆ గంభీర కంఠ ధ్వని ఇంకా వినిపిస్తున్నట్లే వుంటుంది. పిల్లి కళ్లతో ఆకలిగొన్న పెద్ద పులిలా చూసేవాడు ప్రతి నాయక పాత్రలు వేసినప్పుడు.

చంద్రమోహన్ పౌరాణిక, చరిత్రాత్మక, సాంఘిక చిత్రాలలో నాయక, ప్రతి నాయక, వృద్ధ పాత్రలు ఎంతో సమర్థవంతంగా నటించి గొప్ప కీర్తి నార్జించాడు. పుకార్, అమృతమంతన్, షహీద్, రోటీ వంటి చిత్రాలలో అతని నటన ఉన్నత శిఖరాలను అందుకుంది.

చంద్రమోహన్ కాశ్మీర బ్రాహ్మణ కుటుంబంలో నర్సింగపూర్ గ్రామంలో 2-7-1906 సం.లో జన్మించాడు.

స్కూల్లో చదువు కుంటున్న రోజుల్లో చాలా తెలివిగలవాడిగా మంచి మార్కులు సంపాదించేవాడు. ఈయన తండ్రి గ్వాలియర్ సంస్థానంలో చిన్న ఉద్యోగి. తండ్రి చనిపోయాక ఆర్థిక బాధలకు గురయి, చదువుకు స్వస్తి చెప్పి ఉద్యోగంలో చేరాడు. అదీ ఒక సినీమా పంపిణీ సంస్థలో. సంస్థ అధిపతి చంద్రమోహన్‌ని కొల్హాపూర్ పంపించి ప్రభాత్‌వారి "సైరంధ్రి" చిత్రాన్ని కాంట్రాక్ట్ చేయమన్నాడు.

ప్రభాత్ స్టూడియోకి వెళ్లి ఆ చిత్ర నిర్మాత దర్శకులను కల్సుకున్నాడు. సయ్యద్ ఫతేలాల్, వి. శాంతారామ్ తదితరులు చంద్రమోహన్ గంభీర కంఠ ధ్వని, రూపం, ప్రత్యేకించి చూపులకు ముగ్ధులయ్యారు. "మా చిత్రాల్లో నటించడానికి వస్తావా!" అని అడిగారు. దానికి చంద్రమోహన్ నిరాకరించాడు. 'నటన అంటే నాకు తెలీదు. పైగా దానిమీద నాకు ఇంట్రస్ట్ కూడా లేద"న్నాడు. పని చూసుకొని వెళ్లిపోయాడు.

జీతం చాలక పోవడం, ఆర్థిక బాధలు అధికం కావడంతో కొన్నాళ్ల తర్వాత ప్రభాత్ స్టూడియోకి వెళ్లి, "మీ సినిమాల్లో నటిస్తా" నన్నాడు. వెంటనే "అమృత మంథన్" చిత్రానికి కంట్రాక్ట్ కాగితంపై సంతకం పెట్టాడు. ఇది 1934 సం.లో జరిగింది.

ఆ తర్వాత 1935 "ధర్మాత్మ"లో నటించాడు. ఈ రెండు చిత్రాల ద్వారా నటుడిగా మంచి పేరు తెచ్చుకున్నాడు.

అమర్‌జ్యోతి, పుకార్, రోటీ, జ్వాలా, షహీద్, ద్రౌపది, శకుంతల, తక్‌దీర్, రామ్‌బాణ్ వంటి అనేక చిత్రాలలో ప్రధాన భూమికలు ధరించి అఖండ ఖ్యాతి నార్జించుకున్నాడు.

### నాటి సూపర్ స్టార్

ఆ రోజుల్లో ఇతని నెల జీతం రు. 3500.00లు. ఇంత పెద్ద మొత్తం అప్పటికి భారత దేశంలో ఏ నటుడికీ ఇవ్వలేదంటే, ఈయన పేరు, ప్రఖ్యాతులు, గిరాకీ ఎంత అధికంగా ఉండేవో మనకు అర్థం కాగలదు.

సినీమా తెరపై గర్జించిన ఈ సింహం హృద్రోగంతో అకస్మాత్‌గా 1950 ఏప్రిల్ 2న మృత్యువాత బడింది.

ఇంత గడించినా మరణించేనాటికి ఇంట్లో ఒక్క రూపాయి కూడా లేదట! గుర్రప్పందాలకు, త్రాగుడుకి ఈయన సంపాదనంతా కర్పూరంలా హరించుకు పోయింది. అదృష్టవశాత్తు జీవితకాలం అవివాహితుడుగా వున్నాడు.

పృథ్వీరాజ్‌కపూర్, మోతీలాల్, బొంబాయి టాకీసు సిబ్బంది అంతా కలసి చంద్రమోహన్ దహన సంస్కారాలు ఘనంగా జరిపించారు. ఈ అంతిమ యాత్రను చిత్రీకరించి న్యూస్ రీల్‌లో చూపించడం జరిగింది.

నాటికీ నేటికీ గ్రేట్ అతడు.

-ఆరిపాక సూరిబాబు



## వర్మ చిత్రంలో మిస్ ఇండియా

ప్రకాష్‌వర్మ నిర్మిస్తున్న 'ప్రిన్సెస్ ఫ్రం ఖాట్మండు' చిత్రంలో నవీదా మెహదీ నటిస్తోంది. ఈమె 1989లో మిస్ ఇండియాగా ఎన్నికైందట. మోడల్‌గా కూడా వుండే ఈ 17 ఏళ్ల నవీదాకు యు.కె.లో జరిగే మిస్ వరల్డ్ పోటీల్లో పాల్గొనేందుకు అవకాశం కూడా వచ్చింది. మరి మోడల్‌గా పేరు పొందిన నవీదా ఈ చిత్రంలో ఏమాత్రం పేరు సంపాదిస్తుందో వేచి చూడాల్సిందే! ఈమె సరసన అమితాబ్ నటిస్తున్నాడట.



# లవ్ గేమ్



## చల్లా సుబ్రహ్మణ్యం

సువర్ణ- పేరు వినగానే అతనికి హఠాత్తుగా కారులో లిఫ్ట్ అడిగిన అపర్ణ గుర్తొచ్చింది.

"అంటే అపర్ణ చెల్లెలివా?" చప్పున అడిగాడు.

చివాలున తలెత్తి చూసింది నవ్య అతన్ని.

"అపర్ణ మరో గోపికా డియర్?" అడిగిందామె నవ్వుతూ-

"షటప్- ఇలాంటి చీప్ ట్రిక్స్‌తో నన్నేమి చేయలేవని మరోసారి హెచ్చరిస్తున్నాను-"

"ట్రిక్ కాదు డియర్- థ్రిల్- ఒక్క ఆడదానితో జీవితాంతం గడపడంలో థ్రిల్ లేదని అనేవాడివి- మర్చిపోయావా?"

"అసలింతకు ఎవర్నువ్వు?"

"చెప్పానుగా?"

"ఏం కావాలి నీకు?"

"నువ్వే కావాలి-"

"గోటు హెల్!!" విసురుగా ఫోన్ పెట్టి నుదుటిమీద పట్టిన చెమటను అద్దుకుంటూ నవ్య వేపు చూశాడు.

ఆమె చూపులో తీక్షణతను గమనించి- క్షణం తొట్రుపడి- చిన్నగా నవ్వి-

"ఇది వరకు ఈవ్‌టీజర్స్ వుండేవారు. కాలం మారింది- ఇప్పుడు ఏడమ్ టీజర్స్ తయారయ్యారు-" అన్నాడు.

ఆ గదిలో ఎవ్వరూ మాట్లాడలేదు.

ఇంతలో-

మళ్లీ ఫోన్ మోగింది.

నవ్య అందుకోబోయి- ఆగి స్వాగత్‌ని చూసింది. స్వాగత్ రెండు క్షణాలు ఆగి- నెమ్మదిగా ఫోనెత్తి అన్నాడు.

(గత సంచిక తరువాయి)

"హలో..."

"హలో... నేను శ్రీమతిని నవ్యని పిలవండి."

నిశ్శబ్దంగా ఆమెకు ఫోనందించాడు స్వాగత్.

నవ్య ఫోనందుకుని అంది.

"హలో..."

"ఏవిటి నవ్యా- నేను విన్నది నిజమేనా?" కంగారుగా అడిగింది శ్రీమతి.

"అవును..." నెమ్మదిగా అంది నవ్య.

"మైగాడ్- ఎలా జరిగింది?" ఆశ్చర్యంగా అంది శ్రీమతి.

"తెలీదు-"

ఒక్క క్షణం నిశ్శబ్దం తర్వాత అంది శ్రీమతి.

"ఇప్పుడర్థమైంది నవ్యా-"

"ఏవిటి?"

"స్వాగత్- అవును. శైలజకు అతనికీ ఏవో గొడవొచ్చుంటుంది. అతని మనస్తత్వం నీకు తెలుసుగదా- నీలా అందరూ ఖర్మ అని రాజీపడలేరుగదా- శైలజ ఎదురు తిరిగి వుంటుంది. ఆమె పీడ వదిలించుకోడానికి ఆమెను హత్య చేసుంటాడు. ఆ డిటెక్టివ్‌గాడితో నీకు ఫోన్ చేయించి- తెలివిగా- ఈ హత్యలో నిన్ను ముద్దాయిని చేసి నిలబెట్టాడు. ఏమంటావ్?"

నవ్య మాట్లాడలేదు. ఆలోచిస్తోంది.

డిటెక్టివ్ దగ్గర్నుంచి ఫోన్ రావడం- తాను హడావుడిగా బయల్దేరడం- భాగ్యరాజ్- భార్గవిలు అడ్డురావడం- వారిని వదిలించుకుని రోడ్మీదకు రావడం- ఆటో స్ట్రయిక్- కారులో యువతి లిఫ్ట్...

ఆమె ఉలిక్కిపడింది.

మరోసారి- మరోసారి ఆలోచించింది.

చాలా తీవ్రంగా ఆలోచించింది.

అవును. కారులో తనను డ్రాప్ చేసిన యువతికి- తానెక్కడ కెళ్లాల్సిందీ చెప్పలేదు. అసలు తనకి మాట్లాడ్డానికి ఆమె అవకాశం ఇవ్వలేదు. ఆటో డ్రైవర్స్- సమ్మెలు- సామాన్య జనం బాధలూ వీటిగుర్చి చాలా ఆవేశంగా మాట్లాడింది. హోటల్ దగ్గరకు రాగానే తాను ఆపమనకముందే కారాపింది.

తాను హోటల్ పేరు చెప్పకుండానే- ఆ హోటల్‌కి ఆమె ఎలా తీసుకెళ్లగలిగింది?

అంటే- స్వాగత్ ఆమెను ఏర్పాటు చేసి వుంటాడు.

ఆమె స్వాగత్ మనిషయుంటుంది.

అవును.సందేహంలేదు.

"హలో..." శ్రీమతి స్వరం వినిపించింది.

"హ...హలో..." అంది నవ్య బలహీనంగా.

"ఏవి టాలోచిస్తున్నావ్. నువ్వు ఉత్త అమాయకురాలివి. అతను వేసే పథకాలకు ఊరికినే మోసపోతావ్".

"అవును. నిజమే"- దృఢంగా అంది నవ్య.

"డోంట్ వర్రీ- మా మొగుడింకా వదల్లేదు. ఇంకో గంటలో పూర్తవుతుంది. నేను వస్తాను. భయపడకు. ధైర్యంగా వుండు".

"అలాగే- థాంక్యూ"-

ఫోన్ పెట్టి- తననే ఆశ్చర్యంగా గమనిస్తున్న స్వాగత్‌ని చూసింది. ఎంత నటన?

ఆడపిల్లల జీవితాల్తో ఆడుకోవడమే ఇతని నైజం అనుకుంది. ఎదురు తిరిగిన అమ్మాయిల్ని హత్య చేసే హంతకుడని ఇప్పుడు తెలుసుకుంది. అంతేకాదు. ఆ హత్యా నేరాన్ని స్వంత భార్య మీద మోపి ఆమెను ఉరికంబం ఎక్కించడానిక్కూడా సిద్ధపడ్డాడన్న మాట. ఛీ- ఇలాంటి హంతకుడితోనా తనింత కాలం ఒకే గదిలో గడిపింది? - ఇలాంటి నెత్తురు తాగే రాక్షసుడింట్లోనా తనింతవరకూ భార్య హోదాలో గడిపింది?

భయం- జుగుప్స- అసహ్యంతో ఆమె ఒళ్లు జలదరించింది.

★ ★ ★ ★

మేక్ లవ్ టు ఎవిరీ గర్ల్ యు మీట్. ఈవెన్ ఇఫ్ రిటర్న్ ఈజ్ వన్ పర్సెంట్. ఇట్ ఈజ్ ఏ గుడ్

ఇంతవరకూ సాగిన కథ-16: తనను వ్యతిరేకిస్తున్న భార్య నవ్యను దారికి తెచ్చుకునే విషయంలో స్వాగత్‌కు మేనమామ భాగ్యరాజ్ సహకరిస్తాడు. సెక్రటరీ శైలజతో స్వాగత్ హోటల్లో కులుకుతున్నాడని డిటెక్టివ్ రావ్ కబురు పెట్టడంతో నవ్య హోటల్‌కు చేరుకుంటుంది. అక్కడ పొరబాటున జరిగిన శైలజ హత్య కేసులో జైలు పాలయిన నవ్యను స్వాగత్ విడిపించుకు తీసుకు వస్తాడు.

ఇన్వెస్ట్‌మెంట్.

వెనక్కి తిరిగి చూసింది నవ్య.

నవ్వుతూ నిలబడి వున్నాడు స్వాగత్‌రాయ్‌వర్మ!




అతనా కాలేజ్‌లో గొప్ప రొమాంటిక్ హీరో-స్టూడెంట్స్‌కు అతనంటే విపరీతమైన క్రేజ్- కొందరమ్మాయిలకు అతను సింహ స్వప్నమైతే- మరి కొందరికి అతను ఆరాధ్యుడు. ఆ కాలేజ్‌లో డిగ్రీ సెకెండ్ ఇ..ర్‌లో ... గా చేరిన నవ్య స్వాగత్‌ను గురించి విని- అతని పట్ల విపరీతమైన అసహ్యాన్ని పెంచుకుంది.

నవ్య కాలేజీలో జాయినయిన రెండో రోజే- అంతా ఆమెను కాలేజ్ బ్యూటీగా తీర్మానించారు.

ఆ

హడావుడిగా క్లాసు వేపు నడుస్తున్న నవ్య-

"హలో... మిస్..." అన్న మాటలు విని వెనక్కి తిరిగి చూసింది. నవ్వుతూ నిలబడిన స్వాగత్‌ని చూసి- మండిపడుతూ-

"యస్"... అంది.

"అయాం స్వాగత్‌రాయ్‌వర్మ- మే ఐ నో యువర్ స్వీట్ నేమ్ ప్లీజ్"

"చెప్పు తీసుకుని నీ రెండు చెంపలూ ఎడాపెడా వాయించడానికి నువ్వొప్పుకుంటే- అప్పుడు చెబుతాను నా పేరు-"

విసురుగా అని వేగంగా క్లాసుకెళ్ళిపోయింది నవ్య-

తమ మొదటి పరిచయమే అలా జరిగినందుకు మొహం చిన్నబుచ్చుకుని వెనక్కి తిరిగాడు స్వాగత్.

"హాయ్-" క్లాసులోకి వెళ్తూనే ఆప్యాయంగా పలకరించింది సుధ.

జాయినయిన వారంరోజుల్లోనే సుధ నవ్యకు చాలా క్లోజయిపోయింది. వాళ్ళిద్దరి మధ్యా ఏదో తెలియని ఆత్మీయత ఏర్పడింది.

ఎప్పుడూ తన ప్రపంచంలో తానున్నట్లుగా కనిపించే సుధ- ఆ రోజు క్యాంటీన్‌లో కూర్చుని చెప్పిన విషయం విని నిశ్చేష్టురాలైంది నవ్య. ఎప్పుడూ అబ్బాయిల వేపు కన్నెత్తి చూడని సుధ మనస్సులో ఇంతటి నిజం దాగుందని ఆమె నమ్మలేకపోయింది. సుధ స్వాగత్‌ని ప్రేమిస్తోంది!

"మైగాడ్- ఏమిటి దారుణం... నీలాంటి మంచి అమ్మాయి అలాంటి జులాయి వెధవని ప్రేమించడమా? వాడికసలు ప్రేమనే పదానికి అర్థం

తెలీదు. అనవసరంగా మనసు పాడు చేసుకోకు సుధా..." నచ్చచెప్పడానికి ప్రయత్నించిన నవ్య ముందు- ఓ ఉత్తరాల కట్ట పెట్టింది సుధ!

అవి- స్వాగత్ సుధకి రాసిన ఉత్తరాలు.

నవ్యకేం చేయాలో అర్థం కాలేదు. చూస్తూ చూస్తూ స్నేహితురాలు ఓ రౌడీని నమ్ముకోవడం భరించలేకపోయింది.

స్వాగత్ విషయంలో మనసు మార్చుకొమ్మని సుధకి బ్రెయిన్ వాష్ చేయడం దిన చర్యలో భాగమైపోయింది నవ్యకు.

అయితే- సుధ తన పక్కనున్నప్పుడు కూడా- ఫ్రెండ్స్‌తో కలిసి స్వాగత్ తనను టీజ్ చేయడం నవ్యకు అతని పట్ల మరింత అసహ్యం కలిగేలా చేసింది.

"నీతో ప్రేమ వ్యవహారం నడుపుతూ- వేరే అమ్మాయిల్ని అతను టీజ్ చేస్తుంటే నీకేమనిపించడం లేదా?" ఆవేశంగా అడిగింది నవ్య.

సుధ నవ్వింది తేలిగ్గా

"ఏదో సరదాకలా అంటాడేగానీ- అతని హృదయంలో నాకు తప్ప ఎవరికీ స్థానంలేదు"- అంది.

నవ్య హతాశురాలైంది.

రెండు నెలలు గడిచాయి-

ఆ రోజు క్లాసుకొస్తూనే చెప్పింది సుధ-

"నవ్యా... ఈ రోజు సాయంత్రం నాకు పెళ్ళిచూపులు. ఏం చేయాలో అర్థం కావడంలేదు..."

సుధ ఏడుస్తోంది.

"నీ పిచ్చేవిటో నాకర్థం కాదే సుధా- స్వాగత్‌లాంటి వాడు నీతో ప్రేమించానని చెప్పినంత మాత్రాన పెళ్ళి చేసుకుంటాడా?"

"ఎందుకు చేసుకోడు? కానీ... చదువు పూర్తవకుండా పెళ్ళి చేసుకోమనడం బావుండదని ఆలోచిస్తున్నాను..."

## లవ్ గేమ్

"ఓహో... ఆదోఅర్థం పెట్టాడా?"

"కాదు. అతనెప్పుడూ అలా మాట్లాడలేదు. నేనే అనుకుంటున్నాను"-

"మరైతే ఇంకేం? అతన్నే అడుగు. నీ మీద నిజంగా ప్రేమ వుంటే మీ నాన్నగారితో మాట్లాడి- చదువయే వరకూ గడువైనా తీసుకుంటాడు. లేదా వెంటనే పెళ్ళయినా చేసుకుంటాడు. అదీ కాకపోతే- ఈ పెళ్ళిచూపులు తప్పించుకోవడానికి ఏదైనా సలహా అయినా ఇస్తాడు-

"అలాగే- అతన్నే అడుగుతాను-" అంటూ క్లాసు మధ్యలోంచి లేచి వెళ్ళిపోయింది సుధ.

రెండు పీరియడ్స్ పూర్తయ్యాక ఉబ్బిపోయిన కళ్ళతో వచ్చింది సుధ.

"... పాజిటివా? నెగటివా?" అడిగింది నవ్య.

సుధ మాట్లాడలేదు.

"నీ ముఖం చూస్తుంటే నెగటివేననిపిస్తోంది... అందుకేకదా మొదట్నుంచీ నేను వద్దు మొర్రో అని చెప్తోంది? ఏదేవే- జరిగిందేదో జరిగింది. హాయిగా మీ వాళ్ళు చూసిన సంబంధానికి ఒప్పుకో... ఈ క్షణం నుంచీ ఆ రౌడీ వెధవని మర్చిపోయే ప్రయత్నం చెయ్"- అంది నవ్య.

సుధ మాట్లాడలేదు. ఆ రోజంతా ఆమె మూడీగానే వుంది.

మర్నాడు-

కాలేజీ ఆవరణలో అంతా గుంపులు గుంపులుగా నిలబడి చర్చించుకుంటున్నారు.

క్లాసువేపు వెళ్ళబోతున్న నవ్యతో ఎవరో అన్నారు-

"మిస్- ఈ రోజు మనకి హాలీడే-"

"ఎందుకు?"

"మీకు తెలీదా? సుధ... అదే మీ ఫ్రెండ్ ఆత్మహత్య చేసుకుంది"-

"వా...ట్..."

ఆమె చేతిలోని పుస్తకాలు జారి కింద పడ్డాయి.

సుధ చచ్చిపోయింది...

లేదు... చంపబడింది....

ఓ ఆవేశపు కెరటం ఆమెలో ఎగసిపడింది.

"స్వాగత్... యూ... చీట్..."

కాలేజంతా వెదికింది. ఎక్కడా అతను కనిపించలేదు.

అతని అడ్రెస్ కనుక్కొని- అక్కడికెళ్ళింది

తలుపు తీసిన స్వాగత్ ఆమెని చూసి ఆశ్చర్యపోతూ లోపలికి ఆహ్వానించాడు.-

నవ్య అతను ఊహించని విధంగా- అతని చెంప మీద ఛెళ్ళున కొట్టి-

"ఇడియట్- ఆడదంటే ఆటవస్తువు కాదురా- ఇప్పుడు- నీ మనసు శాంతించిందా? సుధ చావుని సెలబ్రేట్ చేసుకో రాక్షసుడా? నీ వంచనకు ఓ అమాయకురాలి, జీవితం నిలువునా నాశనమైపోయింది. ఇంకెందరి అభాగినుల కన్నీళ్లతో నీ దాహం తీరుతుందిరా రాస్కెల్-"

ఆవేశం- దుఃఖం- అన్నీ ఒక్కసారిగా ముప్పిరిగొనగా వణికిపోతూ అంది.

స్వాగత్ నివ్వెరపోయాడు.

కొన్ని క్షణాలు మాట్లాడలేదు. ఆ తర్వాత నెమ్మదిగా తలెత్తి అన్నాడు.

"మిస్ నవ్యా.... నిజానిజాలు తెలుసుకోకుండా ఆవేశంతో మీరేం మాట్లాడుతున్నారో మీకు తెలీదు- సుధ మరణానికి నాకూ ఏ సంబంధమూ లేదు. అసలు సుధని నేనెప్పుడూ ప్రేమించానని చెప్పలేదు. ఆమె రాసిన ప్రేమ లేఖలకి ఒక్క దానికీ నేను జవాబివ్వలేదు. అసలు ఏ అమ్మాయికీ ఇంతవరకూ నేను ప్రేమిస్తున్నానని చెప్పలేదు. నాతో స్నేహం కోరి వచ్చిన వాళ్ళతో నేను స్నేహంగా వున్నాను తప్ప- ఏనాడూ ప్రేమ- పెళ్ళి అని ఎవరితోనూ చెప్పలేదు. అసలెవరితోనూ నాకెలాంటి గొడవాలేదు- ఒక్క సుధ మాత్రమే నన్ను తప్పుగా అర్థం చేసుకుంది".

"షటప్- ఆ అమాయకురాల్ని తప్పుదారి పట్టించింది నువ్వు. హాయిగా పెళ్ళి చేసుకుని సుఖంగా వుండాల్సిన దాని జీవితాన్ని నాశనం చేసి- అమాయకత్వం నటిస్తున్నావా?" కోపంగా అరిచింది నవ్య.

"ఇట్సాల్‌రైట్- ఇప్పుడు నేనేం చెప్పినామీరు అర్థం చేసుకునే స్థితిలో లేరు- కానీ ఒక్కటి మాత్రం నిజం....."

"ఏవిటది? సుధకి నువ్వు ప్రేమలేఖలు రాయలేదా? ఆ భగవంతుడు అడ్డొచ్చినా లెక్కచేయను- నిన్నే పెళ్ళి చేసుకుంటానని ప్రమాణాలు చేయలేదా..."

"లేదు- లేదు- నేనే పాపమూ ఎరుగను- నేను సుధకి ఏనాడూ ఒక్క ఉత్తరం కూడా రాయలేదు. ఏనాడూ ఎలాంటి ప్రమాణాలూ చేయలేదు. ఇదంతా ఆ కామేష్‌గారి కుట్రని నా అనుమానం" ఆవేశంగా అన్నాడతను.

ఒక్క క్షణం ఆగి అంది నవ్య.

### మీనాక్షికోసం పోటీ!

'ఘర్ హోతో ఐసా' చిత్రంలో బాగా నటించాననుకుంటున్న మీనాక్షి శేషాద్రిని బుక్ చేసుకునేందుకు సుభాష్ ఘయ్, మన్‌మోహన్ దేశాయ్ పోటీ పడుతున్నారు. 'తుఫాన్' చిత్రం ఫ్లాప్ అయినా కూడా దేశాయ్ మీనాక్షినే బుక్ చేసుకోవటంలోని ఆంతర్యమేమిటో అర్థం కావటంలేదు సినిమా జనాలకి. విశ్వామిత్ర రిలీజ్ అయితే ఆమె స్టార్‌వాల్యూ పెరగవచ్చునన్న ఆశ వుందేమో!



"ఒకే మిస్టర్ చీట్- రోజులన్నీ నీవనుకుని విర్రవీగకు- నిన్ను పదిమంది ముందు నిలబెట్టి- నీ బ్రతుకును నడిబజార్లో వేలం వేయందే నా పేరు నవ్యకాదు. మైండిట్" విసురుగా వెళ్ళబోతున్న ఆమె-

"మిస్ నవ్యా-" అన్న అతని పిలుపుకు ఆగి వెనక్కి తిరిగి చూసింది. జీవితంలో నా మీద చెయ్యి చేసుకున్న మొదటి స్త్రీవి నువ్వు. నువ్వు చేసిన పనికి- ఇంకొకరయితే ఇక్కడే ఈ గదిలో నే... ప్రతీకారం తీర్చుకునే వాణ్ని- బట్..."

అతనో క్షణం ఆగి అన్నాడు.

"అలా చేయను నేను. ఎందుకో తెలుసా? నేను నిన్ను ప్రేమిస్తున్నాను గనుక-"

"ప్రేమా? ను....వ్వు...న....న్ను..."

హేళనగా నవ్వి-

"నువ్వు చాలా ఫాస్టని తెలుసు. కానీ ఇంత ఫాస్టనుకోలేదు- సుధ చచ్చిపోయి ఇరవై నాలుగ్గంటలు కాకుండానే- మరో ఆడదాన్ని ప్రేమిస్తున్నానని చెప్పడానికి సిగ్గుగా లేదా?" కంఠం నిండా అసహ్యాన్ని నింపుకుని అడిగింది.

"నీ మిస్... సుధ చావుకీ- నా ప్రేమకీ సంబంధం లేదు- ప్లీజ్ మైండిట్!" అన్నాడు కోపంగా.

"ఓ... అయితే నువ్ నన్ను ప్రేమిస్తున్నానంటావ్?"

"యస్... భగవంతుడి సాక్షిగా-"

"అదే నిజమైతే విను.... నాలోని ప్రతి అణువూ నిన్ను ద్వేషిస్తోంది- ఈ జన్మకి నువ్ నా ప్రేమను... ఛ... ప్రేమేంటి? కనీసం సానుభూతిని కూడా పొందలేవు. నన్ను పొందలేక... మరో ఆడదానితో సరిపెట్టుకోలేక నువ్వు కుళ్ళి కుళ్ళి ఛస్తుంటే చూడాలని వుందిగానీ- నీలాంటి రౌడీ- నీలాంటి డిబాచర్ని ఆ స్థితిలో చూడాలనుకోవడం తీరని కోరికని నాకు తెలుసు. ప్రేమ పేరుతో నువ్వు సుధకి చేసిన అన్యాయం ప్రపంచానికి చాటి చెప్పి- సుధ ఆత్మ శాంతించేలా చేస్తాను- దిసీజ్ మై ఛాలెంజ్"

"ఓ.... ఛాలెంజ్‌ల దాకా వచ్చావా మిస్ నవ్యా- అయితే విను. నిన్ను పెళ్ళి చేసుకుని- నీ నోటితోనే నా మొగుడు శ్రీరామచంద్రుడు అని చెప్పించకపోతే- నా పేరు స్వాగత్ కాదు- దిసీజ్ మై ఛాలెంజ్!" అన్నాడు.

వెటకారంగా నవ్వింది నవ్య.

"పగటి కలలు కనకు మిస్టర్! నీలాంటి తిరుగుబోతు వెధవని చేసుకునే ఖర్మ నాకు పట్టలేదు. మరో విషయం... తెలిసిన ఏ అమ్మాయీ నిన్ను పెళ్ళి చేసుకోకుండా మౌత్ పబ్లిసిటీ ఇస్తాను-"

"నీకా శ్రమ అక్కర్లేదు మిస్... నిన్నే పెళ్ళి చేసుకుని- సంవత్సరం తిరిగేలోగా- నా బిడ్డకు నిన్ను తల్లిని చేస్తాను"

"ఛీ... నీలాంటి వాడితో మాట్లాడినందుకు డెట్టాల్‌తో నోరు కడుక్కుంటాను- థూ" అని ఉమ్మేసి అక్కడి నుంచి పరుగులాంటి నడకతో వెళ్ళిపోయింది నవ్య.

మరుసటి రోజు నుంచీ స్వాగత్ ఆమెకు కాలేజీలో కనబడలేదు. అతని తల్లీదండ్రి హఠాత్తుగా కారు యాక్సిడెంట్‌లో పోవడంతో - అతను టి.సి తీసుకుని వెళ్ళిపోయాడని తెలిసి- హాయిగా ఊపిరి పీల్చుకుంది నవ్య.

బి. ఎ. అవగానే- ఇంట్లో పెళ్ళి చేస్తామంటే- వద్దని తెలుగు ఎమ్మేలో చేరింది. ఎమ్మే అవగానే ఓ ప్రైవేట్ కాలేజీలో లెక్చరర్‌గా చేరింది నవ్య.

తర్వాత సరిగ్గా ఆరు నెలలకు జరిగిందా సంఘటన- భాగ్యరాజ్ నవ్య ఇంటికొచ్చి నవ్య తండ్రి సుందరమూర్తితో మాట్లాడాడు. కారులో సూటేసుకుని దిగిన భాగ్యరాజ్‌ని చూసి- ఆ ఇంటిల్లిపాదీ ఆశ్చర్యపోయారు. భాగ్యరాజ్ చెప్పిన విషయం విని సుందరమూర్తి అది కలో నిజమో తేల్చుకోలేకపోయాడు.

కోట్లాది రూపాయల ఆస్తికి వారసుడైన ఆయన



మేనల్లుడికి తన కూతురిని ఇచ్చి - పైసా కట్నం లేకుండా పెళ్ళి చేయాలి. ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బై వెంటనే అంగీకరించాడు సుందరమూర్తి. అమ్మాయిని కూడా ఓ మాట అడిగి ఏ విషయం నాకు వెంటనే ఉత్తరం రాయమని చెప్పి వెళ్ళిపోయాడు భాగ్యరాజ్-

తండ్రి చెప్పిన విషయాలు విని నవ్య నిర్భాంతపోయింది. ఈ మూడు సంవత్సరాల కాలంలో ఆమె స్వాగత్‌ని పూర్తిగా మర్చిపోయింది. సుధ చావు చేసిన గాయం- ఆమె మనస్సులో రేగినప్పుడు మాత్రం స్వాగత్‌ని కసిదీరా తిట్టుకోవడం తప్ప అతని గురించి ఆమె ఎప్పుడూ ఆలోచించలేదు.

అలాంటిది ఇన్నాళ్ళ తర్వాత తన పందెం సంగతి గుర్తు పెట్టుకుని- మేనమామని రాయబారం పంపిన అతని ధైర్యానికి ఆశ్చర్యపోయింది ఆమె.

ఇంట్లో అందరూ ఆమె అదృష్టాన్ని పొగుడుతుంటే- కోపంగా అరిచి చెప్పింది.

"నాకీ పెళ్ళి ఇష్టం లేదు. నేను చేసుకోను-"

ఓ క్షణం ఆమె మాటలు అక్కడి వారి కర్థం కాలేదు. ఆ తర్వాత తండ్రి వెర్రి కోపంతో ఏవేవో అరిచాడు. తల్లి, బామ్మ- అక్క శోకాలు పెట్టారు. తండ్రి చచ్చిపోతానని కత్తి తీసుకుని పొడుచుకోబోయాడు. తల్లి ఆత్మహత్య చేసుకుంటానని బావిలో దూకబోయింది. అక్క- బామ్మలు ఆమెను అనుసరించారు. ఇల్లు రణరంగంగా- భీభత్సంగా- భయానకంగా తయారైంది. ఇరవై వేలు కట్నం ఇవ్వడానికి- ఇల్లు అమ్మేయాలని ఆలోచిస్తోన్న సుందరమూర్తికి స్వాగత్‌లాంటి కుర్రాడు పైసా కట్నం లేకుండా చేసుకుంటాననటే- వద్దంటున్న కూతుర్ని చూస్తుంటే- కోపం- ఆవేశంతో వణికి పోతున్నాడతను.

స్వాగత్ నాకు కాలేజీలోనే తెలుసు. అతను నా ఫ్రెండ్ సుధ మరణానికి కారకుడు అని చెప్పాలనుకుంది కానీ- తన బావ మన్మథరావు ఎలాంటివాడో, ఇంటిల్లిపాదికీ తెలుసు. అయినా- అల్లుడిగా అతనికి సకల మర్యాదలూ జరుగుతున్న ఆ ఇంట్లోని మనుషులకి స్వాగత్- చేసింది తప్పనిపించకపోవచ్చు.

ఏదో కుర్రాడు- చిన్న తనంలో సరదాగా ఓ అమ్మాయిని ప్రేమించినంతమాత్రాన- ఆ అమ్మాయి ఖర్మచాలక ఆత్మహత్య చేసుకుంటే-దానికి అతను బాధ్యుడెలా అవుతాడు. మగాడన్న తర్వాత తిరక్కుండా వుంటాడా? తిరిగే కుర్రాళ్ళంతా పెళ్ళి కాగానే మారిపోవట్లేదూ? అసలిన్నాళ్ళూ నిన్ను గుర్తుపెట్టుకుని నిన్నే పెళ్ళాడతానంటున్న అతను దేవుడితో సమానం-

అని తేల్చేస్తారని తెలుసు. అతని ఛాలెంజ్‌ని తేలిగ్గాకొట్టేస్తారని తెలుసు...

అందుకే ఆమె చెప్పలేదు-

వారం రోజుల భీభత్సం తర్వాత-

నవ్య పెళ్ళికి ఒప్పుకుంది.

ఆ రోజే- ఆమె నిర్ణయించుకుంది. అతని జీవితాన్ని నరకంగా మార్చి సాధ్యమైనంత త్వరలో అతనితో విడిపోవాలని-

పెళ్ళయిన మర్నాడే స్వాగత్ లండన్ వెళ్ళిపోయాడు.

కన్నీటితో దిండు తడిసిపోతుండగా అసహనంగా తల విదిల్చింది నవ్య. తన జీవితంతో ఆమెను ఎన్ని విధాలుగా ఆడుకున్నాడో తలచుకుంటే ఆమెకు దుఃఖం, కోపం, అసహ్యం కలుగుతున్నాయి. చివరకు తనను హంతకురాలిగా ముద్ర వేసి ఉరికంబం ఎక్కించబోతున్నాడు. ఆవేశంతో ఆమె హృదయం దహించుకు పోతోంది.

ఒక్కసారిగా గదంతా వెలుతురుతో నిండింది.

"లైట్ వేసుకోకుండా పడుకున్నావేం నవ్యా" స్వాగత్ గదిలోకి వచ్చి లైట్ వేస్తూ అన్నాడు.

ఆమె చివాలున లేచి నిల్చుంది.

# మీ "బాస్" x మీ ఆరోగ్యం

మీ "బాస్" ప్రవర్తనవల్ల మీ ఆరోగ్యం దెబ్బ తినే ప్రమాదం వుందా? లేదా మంచి జరుగుతోందా? అనే విషయంక్రింద క్విజ్ ననుసరించి తెలుసుకోవచ్చు.

మ్యూ ఆర్‌లీన్స్ ట్యులేన్ విశ్వ విద్యాలయంలోని సోషల్ సైకాలజీ ప్రొఫెసర్ డా. ఫ్రెడరిక్ కోనిన్ 200 మంది సిబ్బందిపై ఒక ఎనిమిది సంవత్సరాలు అధ్యయనంచేసి ఒక మంచి బాస్ తన సిబ్బంది ఆరోగ్యానికి న్యాయమైన రక్షణ కలుగజేస్తాడు అని అన్నారు.

"బాస్ మంచివాడు కాకపోతే సిబ్బంది మానసిక ఒత్తిడికి గురై అనారోగ్యం పాలవుతుంటారు."




## బాస్ చెడ్డాడైతే

"చెడ్డవాడైన బాస్ క్రింద పనిచేసే సిబ్బంది హృద్రోగాలకు, నిద్రలేమికి, జీర్ణకోశ వ్యాధులకు, రక్తంలో కొలెస్టరాల్, మానసిక ఒత్తిడివంటి సమస్యలతో బాధపడుతుంటారు."

ఈ క్విజ్ ద్వారా మీ బాస్ మీ ఆరోగ్యానికి కీడు చేస్తున్నారా? మేలు చేస్తున్నారా? అనే విషయం తెలుసుకోవచ్చు. ప్రతి ప్రశ్నకి "ఎప్పుడూ లేదు", "అప్పుడప్పుడు", "ఎల్లప్పుడు" అనే జవాబులు యిచ్చుకొని స్కోర్‌ని పరిశీలించండి.

1) మీ నిర్ణయాల వెనుక మీ బాస్ ప్రమేయం వుంటుందా?

2) మీ బాస్ మీతో కూర్చుని అన్ని విషయాలపై మీతో చర్చించను యిష్టపడతారా?

3) మీ బాస్ చేసిన నిర్ణయాలను తిరిగి ఒకసారి పరిశీలించమని అడిగే చనువు ఆయన దగ్గర మీకు వుందా?

4) మీపై గౌరవంతో మీ బాస్ మీ సలహాలను అడుగుతారా?

5) మీ ఆఫీసు పనిపై ప్రభావం చూపే మీ వ్యక్తిగత సమస్యలను గురించి వినే ఓపిక మీ బాస్‌కి వుందా?

6) మీ పనిని మీ బాస్ మెచ్చుకుంటారా?

7) మీ పనిలో మీరు అగ్రగామిగా వున్నారనే భావన మీ బాస్ మీలో కలుగజేస్తుంటారా?

8) పర్యవసానం ఎలా వుంటుందో అని ఆలోచించకుండా మీ బాస్‌ని వ్యాఖ్యానించగల ధైర్యం మీకు వుందా?

9) మీరు పనిలో చూపిన నేర్పరితనానికి మా బాస్‌నుంచి గుర్తింపు వుంటోందా?

10) మీ పనిలో సామర్థ్యాన్ని పెంచుకొనగలిగే సలహాలను మీ బాస్ మీకు యిస్తున్నారా?

**స్కోరింగ్:** ప్రతీ "ఎప్పుడూ లేదు" అనే జవాబుకు సున్నా పాయింట్లు, ప్రతీ "అప్పుడప్పుడు" అనే జవాబుకి ఒక పాయింటు, "ఎల్లప్పుడు" అనే జవాబుకి 2 పాయింట్లు చొప్పున లెక్క తీసుకోవాలి. మొత్తం ఎన్ని పాయింట్లు వచ్చాయో కూడండి.

జవాబు: 0 నుంచి 9 పాయింట్లు వగకయితే మీ బాస్ మీ ఆరోగ్యానికి కీడు కలుగజేస్తున్నాడని అర్థం. సమస్యను ఆయనతో చర్చించండి. ముందుగా ఆయనలోని మంచి గుణాలని పొగడి ఆయన సంస్థలో మీరు ఒక భాగమేనని ఆయన తలిస్తే మీరు మరికొంత సామర్థ్యంతో పని చేయగలమని తెలియజేయండి.

10 నుంచి 15 పాయింట్లు స్కోరు వస్తే మీ బాస్ మధ్యరకం వ్యక్తి అని అర్థం. ఇలాంటివారి మూలంగా ఉద్యోగరీత్యా మీరు కొంత అనారోగ్యానికి గురికాకతప్పదు. మీ బాస్‌తో సమావేశమై ఆయనకు మీ పనిలోవున్న సాధక బాధకాలను అర్థమయ్యే విధంగా చెప్పండి. 16 నుంచి 20 పాయింట్లు వస్తే మీ బాస్ గొప్పవాడు. మీ ఆరోగ్యానికి చాలా మంచివాడు. టానిక్‌లాంటివాడు. కనుక యూ సెర్వ్‌హిమ్ బెటర్.

[సేకరణ: ప్రమీల]

## లవ్ గేమ్

కన్నీటితో తడిసి కందిపోయిన ముఖం- ఎర్రగా ఉబ్బిన కళ్ళు- రేగిపోయిన జుట్టు-

అతని మనసు బాధగా మూలిగింది.

ఆమె భుజంమీద చేయి వేసి అన్నాడు.

"నవ్యా-" విసురుగా లేచిన ఆమె చేతిని పట్టుకుని అన్నాడు.

"నవ్యా- ఏమిటిది- ఎందుకిలా చేస్తున్నావ్?"

"ఎందుకా- ఏనాడు నాకు పరిచయమయ్యావో గానీ- ఆనాటినుంచి నాకు మనశ్శాంతి లేకుండా చేసి నీ పంతాలకూ- పందాలకూ నన్ను పావుగా ఉపయోగించుకున్నావు. ఎందుకు, ఎందుకు నన్నిలా హింసిస్తున్నావ్- నేనేం ద్రోహం చేశాను నీకు" ముఖం చేతుల్లో కప్పుకుని ఏడుస్తోందామె.

అతను బాధగా నిట్టూర్చి అన్నాడు.

"నవ్యా- ఇంకెప్పుడు నన్నర్థం చేసుకుంటావ్ నువ్వు? నీ కోణంలోంచి తప్ప- వేరేవిధంగా ఆలోచించవేం?"

ఆమె రోషంగా తలెత్తి-

"అవును- ఆనాడు సుధ చావుకు కారణం నువ్వు కాదని నమ్ముతుంటావ్- ఈనాడు శైలజ హత్యకు కారణం కూడా నువ్వు కాదని నేను నమ్మాలి-అప్పుడే నిన్ను నేను అర్థం చేసుకున్నట్టు... అవునా!" అంది.

"నవ్యా అప్పుడే కాదు- ఇప్పుడు చెప్తున్నాను. సుధ మరణానికి కారణం నేను కాదు. ఆ కామేష్- నిజా నిజాలు తెలుసుకోకుండా కనీసం ఆలోచించకుండా ఓ మనిషిని నేరస్తుడిగా చిత్రించడం దారుణమైన విషయం-" ఆవేశంతో అన్నాడు.

"అవును- సుధ మరణానికి కారణం కామేష్ ఇప్పుడు శైలజ హత్యకు కారణం నేను- అవునా" తీవ్రస్వరంతో అంది.

"నవ్యా-" ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును మిస్టర్ స్వాగత్- నామీద ద్వేషంతో- కసితో నన్ను హత్యానేరంలో చాలా తెలివిగా ఇరికించావ్. అసలు హంతకుడివి నువ్వు. కానీ అన్ని సాక్ష్యాలతో నన్ను హంతకురాలిగా మార్చి నిరూపించబోతున్నావని తెలుసు-"

"నవ్యా"- ఆవేశంతో చెయ్యెత్తి చిరాగ్గా ఆగిపోయి- "ఛీ- నీకెలా చెబితే అర్థమౌతుందో నాకు తెలీడం లేదు-

అసలలా మాట్లాడ్డానికి- నీకు మనసెలా ఒప్పింది? అంత దుర్మార్గుడిలా కనిపిస్తున్నానా నేను?" అన్నాడు.

"ఏం! కళ్ళెదురుగా సాక్ష్యాలు చూస్తూ- కళ్ళు మూసుకుని నిన్ను నిర్దోషి అనుకునేంత పతివ్రతను కాదు నేను" కోపంగా అంది.

"ఏవిటా సాక్ష్యాలు?" విసురుగా అడిగాడు స్వాగత్.

(ఇంకా వుంది)




అడ్వొకేట్: బి.భాస్కరరావు ఎం.ఎ., ఎల్.ఎల్.బి.

### బి.వెంకటేశ్వరరావు,రాజేంద్ర నగర్, హైదరాబాద్.

ప్రశ్న:మాతండ్రి నాకు 3 సంవత్స రములు వయస్సు అప్పుడు మర ణించారు. నా వయస్సు ఇప్పుడు 38 సంవత్సరాలు. మా తండ్రి అప్పటి నైజామ్ రైల్వేలో పని చేసేడివారు. మా తాత ఆర్జించిన స్వంత ఆస్తిని మా తండ్రి బ్రతికి వుండగానే మా తాత నా పేరున వ్రాసినారు. మా తండ్రి మొదటి భార్య బ్రతికి వుండగానే ఆమె అనారోగ్యం దృష్ట్యా 1953లో ఇంకొక వివాహము చేసుకున్నాడు. ఈ వివాహన్ని మా తాత సమ్మతించక, అప్పుడే తన ఆస్తిని నాకు వ్రాసినారు. అప్పటికి మా తండ్రి రెండవ భార్యకు సంతానం లేదు. ఆమె గర్భవతిగా వుండగానే మా తండ్రి మరణించారట. ఇప్పుడు రెండవ భార్య కుమారునకు 35 సంవత్సరములు. మా తాత నాకు వ్రాసిన "వీలు"ను రిజిస్టర్ చెయ్యలేదు. ఇప్పుడు రెండవ భార్య కొడుకు కూడా ఆస్తినందు హక్కును కోరుతున్నాడు. వాళ్ళు మా ఇంటిలోనే ఒక భాగంలో ఉంటున్నారు. అంతమాత్రంచేత ఆస్తినందు వాటా కోరవచ్చునా? వీలునామా కాగితాలు ఇప్పుడు నేను రిజిష్టర్ చేసుకొను విధానము తెలుపవలెను. ఇంటి పన్ను, నీటి పన్ను రసీదులు నా పేరుమీద వచ్చునట్లు మార్పు చేయించినాను. నాయొక్క సమస్యకు న్యాయ సలహా ఇవ్వవలసినదిగా కోరుతున్నాను.

జవాబు : ముందుగా మీరు వీలునామా రిజిస్ట్రేషన్ చేయించండి. రిజిస్ట్రేషన్ అయినప్పుడు మీకు మీ తాత ఆస్తిమీద హక్కు ఉంటుంది. వీలునామా లేకుండా కూడా మీకు మీ తాత ఆస్తిమీద హక్కు ఉన్నది. ఇక మీ తండ్రి రెండవ భార్య మీ తల్లి బ్రతికి వుండగా వివాహం చేసుకున్నందువలన భారతీయ శిక్షా స్మృతిలోని 494 సెక్షన్ క్రింద నేరము చేసినట్లు అవుతుంది. మీ తాత ప్రత్యేకంగా వీలునామా వ్రాసినందు వలన మీ రెండవ తల్లి కుమారునకు మీ ఆస్తిమీద హక్కు లేదు. కాని మీ ఇంటిలోనే వారు ఒక భాగంలో ఉంటున్నారు కనుక మీరు వీలునామా రిజిస్ట్రేషన్ చేసిన తర్వాత వారిపై చర్య తీసుకోవచ్చును.

### ఎమ్. పి. రావ్, తిరుపతి.

ప్రశ్న : నేను చాలా పేదవాణ్ణి. ఇల్లు లేదు. కాబట్టి నా కుటుంబం ఉండటానికి బలహీనవర్గాలకు ఇచ్చు ఇల్లు ఎలా పొందాలో వివరంగా తెలుపగలరని కోరుచున్నాను.

జవాబు : మీ కులము, సంవత్సర ఆదాయము వివరిస్తూ ముందుగా ఇంటిస్థలము మంజూరు చెయ్యమని మండల రెవెన్యూ అధికారికి, మండల అభివృద్ధి అధికారికి రిజిష్టర్డ్ పోస్టులో పిటిషన్లు పంపండి. ఇల్లు కావాలని కూడా పిటిషన్లు పంపండి. మీరు స్వయంగా కూడా వారిని కలిసి పిటిషన్లు ఇవ్వండి. నిబంధనలు ప్రకారం ఇంటి స్థలం మంజూరు చేస్తారు. మీరు ఇల్లు కట్టుకొనవచ్చును. ఇక ఇల్లు కావాలంటే ప్రభుత్వం తగినన్ని నిధులు మంజూరు చేసినప్పుడు మీకు ఇల్లు కూడా కట్టించి ఇస్తారు.

### (పేరు ప్రకటించలేదు) ఇల్లందు.

ప్రశ్న : మా ఇంట్లో అద్దెకు ఉన్నవాడు 5 నెలల నుండి ఇల్లు ఖాళీ చెయ్య డంలేదు. అతని అగ్రిమెంట్ నవంబర్‌తో అయిపోయింది. అప్పటి నుండి ఇప్పటి వరకు అద్దె ఇవ్వడంలేదు. అతడు ఇచ్చిన అడ్వాన్సు కూడా అద్దె రూపంలో అయిపోయినది. ఇల్లు ఖాళీ చెయ్యమంటే తిరగబడుతున్నాడు. అసలు ఇతడ్ని ఎలా ఖాళీ చెయ్యించాలి?

జవాబు : మీ ఊరు, పేరు ప్రచురించవద్దని అంటె మీరు ఎలా ఖాళీ చెయ్యిస్తారు? అగ్రిమెంట్ నవంబర్‌తో అయిపోయింది కదా! పైగా మీకు అద్దెబాకీ ఉన్నాడు. అంతే కాకుండా మీరు నివసించడానికి కూడా ఇల్లు కావాలని ఇల్లు ఖాళీ చెయ్యించమని కోర్టులో వెంటనే దావా వెయ్యండి.

### ఎమ్. రాజకుమార్, ఒంగోలు.

ప్రశ్న : (ఎ) భర్త, (బి) భార్య. ఎ. గత పది సంవత్సరముల నుండి సి. అనే ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకొని ఆమె ఇంట్లో ఉంటున్నాడు. ఎ. తనకున్న స్థిర ఆస్తులను బి. పేరున 8 సంవత్సరముల క్రిందట ట్రాన్సుఫర్ చేశాడు. అతడు ప్రభుత్వోద్యోగి. ఇద్దరు పిల్లలు ఉన్నారు. తన అమ్మాయి పెళ్ళికి, బి. పిల్చినప్పుడు వెళ్ళాడు. వధూవరులతో ఫొటో తియ్యించు కున్నాడు. ఎ. రిటైర్ అవుతున్నాడు. గ్రాట్యుయిటీ, పెన్షన్ కోసం కోర్టుకు వెళతానని ఎ. బెదిరిస్తున్నది. ఎ. సి.లకు పిల్లలులేరు. ఎ. బి.లు విడాకులు తీసుకోలేదు. ఎ.ని బి. పిల్లలు బెదిరిస్తున్నారు. సి. స్వయంగా బ్రతుకగలదు. ఎ. కోర్టుకు వెళితే తీర్పు ఎలా వుంటుంది?

జవాబు : ముందు బి.ని కోర్టుకు వెళ్ళమనండి. ఎ. సి.లు ఏమంటారో చూడండి. తర్వాత కోర్టు తీర్పు ఎలాగైనా వస్తుందికదా!

ఆంధ్రసచిత్ర వారపత్రిక
న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..................................................................

పేరు: ..................................................................

పూర్తి చిరునామా: ..................................................................

..................................................................

# మహాభారతం ఎవరు ఎవరికి చెప్పారు?

మహాభారతాన్ని విశ్వశ్రేయమైన గ్రంథంగా, పంచమ వేదంగా విరచించిన మహానుభావుడు వ్యాసుడు. వేద వ్యాస శబ్దానికి వేదాలు విస్తరింపజేసిన వాడు అనే నిర్వచనం వుంది. ఆదిపర్వంలో - 'వి వ్యాస వేదాన్ యస్మాత్ స వేదవ్యాస ఇతి స్మృతః' అని వుంది. అంటే వేదాల్లో వున్న యజ్ఞాది కర్మలకు సంబంధించిన మంత్రాలు విస్తరింపజేయడం' అని అర్థం.

వ్యాసుడి నామధేయం (కృష్ణ) ద్వైపాయనుడు. ముందు అనంతంగాను, ఒక్కటిగాను ఉన్న బృహత్ వేదాన్ని కలియుగంలో మానవుల ఆయుశ్శక్తి-ప్రమాణం గమనించి, దయతో వారికి చదవ శక్యంగా విభజించినందు వల్ల వేదవ్యాసుడని పేరు కలిగింది.

"ఏవం ద్వైపాయనో జజ్ఞే సత్యవత్యాం పరాశరాత్।
న్యస్తో ద్వీపే సయద్బాల స్తస్మా ద్వైపాయనః స్మృతః॥
పాదా పసారిణం ధర్మం సతు విద్వాన్ యుగేయుగే।
ఆయుశ్శక్తించ మర్త్యానాం యుగాను గమ వేక్ష్యచ॥

అని ఆదిపర్వంలో పై శ్లోకానికి ముందున్న ప్రమాణం చూపించవచ్చు!

వ్యాసమహర్షి తాను స్వయంగా నడిపించిన స్వ పౌత్రులగు పాండవులన్య రాష్ట్రము / రాజ్యములను ఆక్రమించి జయము గొన్న కథను (యుద్ధానంతరం పాండవులు పాంచాల దేశాలు కూడా ఆక్రమించినట్లుంది. 'యో రాష్ట్రం క్రామతి సో అశ్వమేధేన యజతే'... 'ఏషవః కురవ ఏ షవః పాంచాలా అయం రాజా' ఇతి కాణ్వ సంహితా) 'జయము' అనే ఇతిహాసంగా రచింపజేశాడు. గంటం ఎత్తినది దించకుండా రాయగల గణపతితో స్వయంగా చెప్తూ 8,800 శ్లోకాలు గల ఇతిహాసంగా వెలువరించాడు.

'లేఖకో భారత స్యాస్య భవత్వం గణనాయకః।
మయైవప్రోచ్య మానస్య మనసా కల్పిత స్వచ॥'

అని దీనికి ప్రమాణం.

..త యుద్ధానంతరం మూడేళ్లకు స్వకర్మలు నిర్వహించుకుంటూ 8.800 శ్లోకాలున్న 'జయ' ఇతిహాసాన్ని వ్యాసుడు చెప్పినట్టు ఆదిపర్వంలో వుంది. ('అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోక శతానిచ) ఈ శ్లోకాలన్నీ అనుష్టుప్ శ్లోకాలు.

ఈ వ్యాస ఇతిహాసం 'జయము' ఆదిపర్వంలో ఉన్న ఉపచరితుని కథతో ప్రారంభమై స్త్రీ పర్వంతో ముగిసినట్టు ఆదిపర్వం 93వ అధ్యాయంలోని అనుక్రమణిక వల్ల, స్త్రీ పర్వాంతంలో గల ఫలశృతి వల్ల తెలుస్తోంది. ఇంతవరకు గణపతి లేఖకుడు.

ఆ రోజులలో రాజసూయాది యజ్ఞయాగాది క్రతువులు చేసినప్పుడు, ఆ యాగ విరమణ కాలంలో మహా ఋషుల చేత ఇతిహాస శ్రవణం విధిగా జరిగించేవారు. అటువంటి ఒకానొక యజ్ఞ విరమణ కాలంలో చెప్పదగిన విస్తృతమైన ఒక ఇతిహాసంగా వ్యాసుడు దాన్ని పెంచాడు. (భీష్మ పర్వం ప్రారంభంలో వ్యాసుడు ధృతరాష్ట్రునితో రాబోవు మహోపద్రవాలు చెప్పిన తర్వాత 'నీ పుత్రుల యొక్కయు, పాండవుల యొక్కయు గాథలు శాశ్వతంగా ఉండేలా చేస్తా'నని చెప్పడం కూడా 'జయం' విస్తరించడాన్ని సూచిస్తుంది.)

స్త్రీ పర్వంతో ముగిసిన గాథని యజ్ఞకర్మల విరమణ కాలంలో చెప్పదగిన మహా విస్తృతమైన 'జయేతిహాసం'గా చేసి, దాన్ని తన దగ్గర వేదాభ్యాసం చేస్తున్న సుమంత, జైమిని, పైల, శుకుడు, వైశంపాయనుడు అనే ఐదుగురు శిష్యులకు వేదం చెప్పినట్లుగానే చెప్పగా అందులో గాథల్ని జైమిని, వైశంపాయనుడు వృద్ధి చేశారు. (జైమిని భారతం కాస్త భిన్నంగా స్వకపోల కల్పితంగా వుండే కారణం ఇదే!)

మహాభారత యుద్ధానంతరం ఇంచుమించు నూట ఏభై ఏళ్లకు పాండవ ప్రపౌత్రుడైన జనమేజయుడు తక్షశిలా రాజ్యం జయించి, సర్పయాగం చేసిన తర్వాత, అశ్వమేధయాగం చేయడానికి ఉద్యమించే కాలంలో పురాణ పుణ్య కథా శ్రవణం కోరాడు. అప్పుడు వ్యాస శిష్యుడైన వైశంపాయనుడు అశరీరవాణి ద్వారా వ్యాసుల ఆనతి చేత ఈ 'జయ' ఇతిహాసాన్ని జనమేజయునికి చెప్పాడు.

(ఏ విధమైన పౌరాణిక వ్రతాలు చేసి విరమించినా ఆ సమయంలో కథలు చెప్పబడతాయి. వ్రత కల్పాన్నీ, వ్రత కథనీ చెప్పేవారికి వ్రతకర్త భూరి దక్షిణలివ్వాలి) వైశంపాయనుడు చెప్తున్న కథ వింటూ జనమేజయుడు ఎన్నో సందేహాలు అడిగాడు. వాటన్నిటికీ వైశంపాయనుడు జవాబులు ఇస్తూ వచ్చాడు. దాంతో జయ ఇతిహాసం విస్తరించి 24,000 శ్లోకాలైంది. జనమేజయుడు విన్న 'జయం' ఆస్తీకుని కథతో ప్రారంభమైనది. భీష్మ పర్వంలో వ్యాసుడు చెప్పిన భవిష్యద్వాణి అప్పటికే ఒక రూపానికి వచ్చింది.

## లక్ష శ్లోకాలు

అటువంటి వైశంపాయన భారతాన్ని సౌతి (వేదవ్యాస శిష్యుని పౌత్రుడు) విని కొంతకాలానికి నైమిశారణ్యంలో శౌనకాది ఋషులకు చెప్పి వారి ప్రశ్నలకు జవాబులు ఇవ్వడం వల్ల మహాభారత గాథగా లక్ష శ్లోకాలతో అలరారింది.

అదితి కశ్యపులు, వివస్వంతుడు, ఇళ, బుధుడు, పురూరవుడు, ఆయువు, నహుషుడు, యయాతి, పురు, జనమేజయుడు, దుష్యంతుడు, భరతుడు.... వీరి గాథలు, శంతనుడు, విచిత్రవీర్యుడు, ధృతరాష్ట్రుడు, పాండురాజు, వారి పుత్రుల గాథలు కలసి మహాభారతంగా అవతరించింది.

దీంట్లో ధర్మ అర్థ మోక్ష శాస్త్రాలు, పురాణ కావ్యాంశాలు ఇమిడి వున్నాయి. ఇవన్నీ ఇమిడ్చిన సౌతిప్రతిభ అద్వితీయం.

వేదేతిహాసంగా వ్యాసుడు చెప్పిన 'జయం' ఎన్నో ధర్మ శాస్త్రాంశాలు కలిసి 'సౌతి' కాలంలో మార్పు చెందినందువల్ల, కాలాంతరంలో దాన్ని పంచమ వేదంగా పరిగణించారు.

నన్నయ్యకు 1200 ఏళ్లకు పూర్వమే ఆపస్తంభ మహర్షి తన సూత్రాల్లో భారత ఇతివృత్తాన్ని పేర్కొన్నాడు. 1400 ఏళ్లకు ముందు ఆశ్వలాయన మహర్షి గృహ్య సూత్రాల్లో వైశంపాయనుణ్ని భారత ధర్మాచార్యుడుగా పేర్కొన్నాడు. వీటిని బట్టి కూడా చూస్తే వేదం కాకుండా వేరుగా చేసిన వేద విభాగం 'భారతం' అని, దీని హ్రస్వరూపం 'జయం' అనీ, గణపతి లేఖకుడుగా వ్యాస ప్రోక్తం అనీ గ్రహించవచ్చు!

స్వర్గారోహణ పర్వంలోని 5వ అధ్యాయం 44వ శ్లోకం చివరి పాదం ప్రకారం... 'జయో నమేతి హాసో నయం శ్రోత్ర వ్యామోక్షమిచ్ఛతా'- అంటే (ఇతిహాస లక్షణాలే కాక దార్శనిక తాత్విక చింతనలు కూడా వున్న) ఈ భారతాన్ని మోక్షం కోరే ప్రతి వారికీ వినిపించమని చెప్పబడింది.

# భారత మహా కవితరయం

ఆంధ్రసచిత్రవారపత్రిక

## త్వరలో ప్రారంభం!



మహా భారత... లేఖకుడు గణపతి (4వ శతాబ్దం)

**రచయిత ఎవరో మీరే ఊహించండి!**
**ఒక పోస్ట్ కార్డుమీద రాయండి.**

## మహాభారతం ఎవరు ఎవరికి చెప్పారు?

శ్రీ మదాంధ్ర మహాభారతమును శౌనకాది మహా మునులకు రౌమహర్షణి అను పౌరాణికుడు చెప్పెను.

– పి. ఆదిలక్ష్మి (నెల్లూరు)

(ఔను)

మహాభారతాన్ని వేదవ్యాసుడు వినాయకునికి చెప్పెను.

– శ్రీధర సుధాకర్ (బరంపురం)
– ఎమ్. కళ్యాణి (బెండమూర్లంక)
– కె. ఎస్. మాచన్న (తాళ్లపూడి)

(కాదు)

అభిమన్యుని మనుమడు జనమేజయునికి వైశంపాయనుడు చెప్పెను.

– వై. ప్రభాకరరావు (గణపవరం)
– గుబ్బల శ్రీనుబాబు (పూనా)

(కాదు)

నైమిశారణ్యంలో సూతుడు శౌనకాదులకు చెప్పిన దానిని వైశంపాయనుడు జైమిని మొదలైన శిష్యులకు చెప్పినట్లు వ్యాసుడు వ్రాసెను.

– శి. లావణ్యకుమారి (కొండెవరం)

కాదు.

సీరియల్

# వజ్రసంకల్పం

## సాతవాహన

ఇంతవరకూ సాగినకథ-35: విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో ధొరికిన అపురూప వజ్రాన్ని అతని దాయాది అయిన వజ్రపాణి చేజిక్కించుకుంటాడు. మణిపురం కొండల్లో వున్న వజ్రపాణి హవేలీకి యువరాణి జ్యోతిర్మయీదేవిగా ప్రవేశించిన పింకీని పులి రాజుగా పిలువబడే శక్తిధర్ అపహరించుకు పోతాడు. శక్తిధర్, విశ్వధరవర్మలకు తానొక సి.బి.ఐ. ఆఫీసర్‌నని, వజ్రపాణి వివరాలు కనుక్కొనేందుకే యువరాణిగా నాటకం ఆడుతున్నానని పింకీ తెలియచేస్తుంది.

(గత సంచిక తరువాయి)

విశ్వధర వర్మ ఉద్వేగంతో ఒక డుగు ముందుకేసి పింకీ చెయ్యి తన చేతి లోకి తీసుకున్నాడు.

"పొరబడ్డాను తల్లీ! నీ విషయంలో చాలా పొరబడ్డాను. నిన్ను హైదరాబాదులో శక్తితో వుండగా చూసి జాగ్రత్తగా ఆరాతీసి నువ్వెవరివో ఎవరి అమ్మాయివో తెలుసుకు న్నాను. నువ్వు జైలర్ సత్యం కూతురివని తెలిసి మొదట చాలా సంతోషించాను. అంత లోకే నువ్వు శక్తిని నాకు కాకుండా చేసి నీవెంట అతని తల్లి దగ్గరికి తీసుకెళ్లిపోతా వేమోనన్న అనుమానం వచ్చింది. ఇప్పు డిక్కడ హఠాత్తుగా నిన్ను శక్తితోపాటు చూసిన వెంటనే అనుమానం బలపడింది. కానీ నా అనుమానాలన్నీ నిరాధారమైనవని నువ్వు తేల్చేశావు. కౌసల్య మీద నాకు గౌరవం లేదనుకోవద్దు. ఆమె నా కోసం చేసిన త్యాగానికి నిత్యమూ నేనామెను పూజిం చినా ఆమె ఋణం తీర్చుకోలేను. కౌసల్య నా కోడలు కాదు-నా కూతురు. బహుశా...., బహుశా ఈ బండరాళ్ల మధ్య ఏళ్లతరబ డిగా జీవించి, జీవించి నిజంగా నేనే బండ రాయినైపోయానేమో! కానీ, శక్తి కేవలం నా మనవడు మాత్రమే అనుకోవద్దు. శక్తి నాకు మిగిలి వున్న ఒకే ఒక్క వంశాంకురం. అంతేకాదు, శక్తి నా శిష్యుడు. వజ్రపాణి చేతుల్లో క్రూరాతి క్రూరంగా హతమార్చబడ్డ నా వాళ్లందరి అంశలూ శక్తిలోనే చూసుకుం టాను. కౌసల్య శక్తికి కన్నతల్లి కావచ్చు. కానీ, నేను శక్తికి తల్లిని, తండ్రిని, తాతను, గురువును -అన్నీ! ఒక్క మాటలో చెప్పా లంటే శక్తి నా సర్వస్వం. ఏళ్లు గడుస్తున్న కొద్దీ బలపడుతున్న నా వజ్రసంకల్పం వెనక వున్న ప్రేరణ. నా శపథానికి కేంద్ర బిందువు. అటువంటి శక్తిని ఎవరైనా నాకు కాకుండా చేస్తున్నారన్న వూహ కలిగినా కూడా నేను భరించలేను. అందుకే నీ పట్ల నాకు భ్రమ కలిగింది. బహుశా వయసెక్కువౌతున్నందు వల్ల నా బుద్ధి కూడా మందగిస్తున్నదేమో! ఇంతవరకూ నేను క్షమించమని ఎవర్నీ అడగ లేదు. నిన్నడుగుతున్నాను. నన్ను క్షమించు తల్లీ, క్షమించు."

పింకీ ఆ మాటలకు కదిలిపోయింది. వృద్ధాప్యం మీదపడి శ్వేతకేశాలతో భీష్మాచా ర్యుడిలా కనిపిస్తున్న ఆ వ్యక్తి పట్ల ఆమె కళ్లలో అకస్మాత్తుగా అంతులేని గౌరవం తళు క్కున మెరిసింది. అంతలోనే ఆమె కళ్లు చెమర్చాయి.

"సర్! మీ సంకల్పబలం ఎలాంటిదో నాకిప్పుడిప్పుడే స్పష్టంగా అర్థమౌతోంది. ఏళ్ల తరబడి మీరనుభవించన క్షోభా, వజ్రపాణికి ఎదురునిలవగల మహాశక్తిగా శక్తిధర్‌ని రూపు దిద్దడంలో మీరు పడ్డ తపనా, ఆవేదనా కూడా అర్థం చేసుకోగలుగుతున్నాను. శక్తి ధర్ శక్తి పట్ల నాకెలాంటి అనుమానమూ లేదు. ఒక్క చేత్తో వజ్రపాణి సామ్రాజ్యాన్ని ధ్వంసం చేయగలడనడంలో కూడా నాకెంత మాత్రమూ సందేహం లేదు. కానీ, నన్ను కూడా మీలో కలుపుకోండి. దేశ వినాశనానికి కంకణం కట్టుకున్న ఆ చీడపురుగుని ఏరిపా రేయడంలో మీకు-శక్తిధర్‌కి తోడుగా వుండ నివ్వండి. ప్లీజ్!" అంది.

విశ్వధరవర్మ పెదవుల మీద చిరునవ్వు తొణికిసలాడింది.

"వజ్రపాణి దేశవినాశనానికి పథకాలు తయారు చేస్తున్నాడని నాక్కూడా తెలుసు. అయితే ఆ పథకాలు ఏమిటనేది మాత్రం స్పష్టంగా తెలీదు. ఇప్పుడు నువ్వు చెప్పిం దంతా విన్నాక అతడి పథకం ఏమిటో ఇప్ప డిప్పుడే నాకు స్పష్టమౌతోంది. సరేతల్లీ, ఇన్నాళ్లూ శక్తి ఒక్కడే నాకు రెండు చేతు లనుకున్నాను. కానీ, మీరిద్దరూ నాకిప్పుడు రెండు చేతులు. నాకు రెండు కళ్లు. సత్యం వంటి శిష్యుడ్ని పొందగలిగినందుకు ఒకప్పుడు నేను చాలా గర్వించాను. ఇప్పుడు నా శిష్యు డికి నీవంటి ప్రతిభావంతురాలు కూతురిగా పుట్టినందుకు గర్విస్తున్నాను"

ఆయన శక్తిధర్ కేసి తిరిగాడు.

"శక్తీ! ఈ అమ్మాయి విషయంలో ఇంతవరకూ నిన్ను హెచ్చరిస్తూ వచ్చాను. ఇప్పుడు అభినందిస్తున్నాను. నీకు ఈ అమ్మాయే సరైన తోడు. నరకాసురుడ్ని వధించడానికి శ్రీకృష్ణుడికి శక్తి చాలకకాదు. అయినా ఆయనకు సత్యభామ తోడైంది. ఈ పులి పిల్లతో కలిసి నువ్వు నా సంకల్పం నెరవేర్చు," అన్నాడు.

శక్తిధర్ పింకీ కళ్లలోకి చూశాడు. ఆమె కళ్లు నక్షత్రాల్లా మిలమిలా మెరిసిపోతున్నాయి. నెమ్మదిగా ఇద్దరి చేతులూ కలుసుకున్నాయి.

విశ్వధరవర్మతో కలిసి ఆకాశంలో ప్రకా శవంతంగా వెలుగుతున్న చందమామ కూడా చిరునవ్వు నవ్వుతున్నాడు.

## 27

వాళ్లు ముగ్గురూ అక్కడే ఆ బండరాయి మీదే అలాగే కూర్చున్నారు. రాత్రి నెమ్మ దిగా ముందుకు సాగుతోంది. విశ్వధరవర్మ వాళ్లిద్దరికీ ఏం చెయ్యాలో వివరిస్తున్నాడు.

"వజ్రపాణి సామ్రాజ్యం రెండు భాగా లుగా వుంటుంది. ఒకటి అతని హవేలీ. అతని సంప ద యావత్తూ ఆ హవేలీలోనే దాచిపె ట్టాడు. రెండవది అతడు స్వంతం చేసుకున్న



వజ్రాల గనులు. అతని సంపదకు జన్మస్థానం ఈ వజ్రాల గనులే."

"వజ్రపాణి సామ్రాజ్యంలో మరొక ముఖ్య భాగం కూడా వుంది," విశ్వధర వర్మ మాటలకు మధ్యలో అడ్డొస్తూ అంది పింకీ. శక్తిధర్‌తోపాటు విశ్వధరవర్మ కూడా ఆమె కేసి ఆశ్చర్యంగా చూశాడు.

"దాని గురించి బయటి ప్రపంచంలో ఎవ రికీ తెలీదు. అతనికి అత్యంత ఆప్తులైన అనుచరులకు కూడా తెలీదు. కానీ......, నాకు తెలుసు," ఆ చివరి మాట కొంచెం గర్వంగా అంది.

"ఏమిటది?" అడిగాడు విశ్వధరవర్మ.

"నక్షత్రధూళి!"

"నక్షత్రధూళా!"

"అవును, నక్షత్రధూళే! ప్రకృతి తన సంపదనంతా ఒకే చోట కేంద్రీకృతం చెయ్యడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. సమయం కలిసివస్తే వజ్రపాణిలాంటి దుర్మా ర్గుడి మీద కూడా ప్రకృతి తన కరుణా వర్షం ఏళ్లతరబడి కురిపించడం ఆశ్చర్యకర మైన విషయం. కానీ ఇది నిజం."

"కొంచెం అర్థమయ్యేలా చెప్పు," అన్నాడు శక్తిధర్.

"అప్పుడప్పుడూ అంతరిక్షం నుంచి భూమ్మీదికి నక్షత్రధూళి కురుస్తూ వుంటుంది. ఆ నక్షత్ర ధూళితో పాటే ప్రకృతి సిద్ధమైన వజ్రాలు కూడా కురుస్తుంటాయి."

"అవును. ఆ విషయం నాకు తెలుసు."

"వజ్రపాణి తల మీద ప్రకృతి ఆ నక్ష త్రధూళి రూపంలో వజ్రాలను కురిపిస్తోంది. అది నా కళ్లారా చూశాను."

విశ్వధరవర్మా, శక్తిధర్ లిద్దరూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. పింకీ చెప్తు కుంటూ వెళ్లింది-

"వజ్రపాణి తన వజ్రాల గనుల్లోంచి ఒక సొరంగ మార్గం తవ్వించాడు. ఆ సొరంగ మార్గం సూటిగా ఒక ఇరుకైన లోయలోకి దారితీస్తుంది. సరిగ్గా ఆ లోయలోనే నేను చెప్పిన నక్షధూళి కురుస్తోంది. వజ్రపాణి చెప్పిందాన్ని బట్టి మొదట ఆ నక్షత్రధూళి మీరు మీ బంజరునేలలో సేద్యం చేయడా నికి, తవ్వించిన దిగుడుబావికి సమీపంలో కురి సేది. తర్వాత అది తన దిశమార్చుకుని ఇప్పుడా లోయలో కురుస్తోంది. ఏళ్ల తరబ డిగా అక్కడే కురుస్తోంది. వజ్రపాణి సామ్రా జ్యంలో ఈనక్షత్రధూళికురిసే లోయ కూడా ఒక ప్రధానమైన భాగం."

పింకీ చెప్పినదంతా వింటూనే విశ్వ ధర వర్మ కళ్లు మూసుకున్నాడు. ఆయన కళ్ల ముందు అంత వరకూ జ్ఞాపకాల పొరల అట్టడుగున పడి వున్న ఒక దృశ్యం లీలగా కదలాడసాగింది. ఏళ్లు గడిచిపోతున్న కొద్దీ ఆయన దాదాపు మర్చిపోయిన ఒక చిన్న మాట ఆయన చెవులకు మళ్ళీ వినిపించసా గింది. ఏళ్ల క్రితం పుత్రశోకంతో దిగుడుబావి పక్కన దాదాపు అపస్మారక స్థితిలో వుండగా నిద్రలో విన్నట్టు అనిపించిన మాట!

-తన కుటుంబాన్ని హతమార్చాక వజ్ర

# పాఠకులే సెక్స్ కథలు కావాలంటున్నారా?

## టూ మచ్ ఈజ్ టూ బ్యాడ్

తెలుగు సాహిత్య రంగంలో ప్రముఖ పాత్ర వహించే దిన, వార, మాస పత్రికలు సమాజంలో శ్లాఘనీయమైన పాత్ర వహిస్తూ యన్నది అక్షరాల నిజం. కాని నేటి (కలి) కాలంలో కొన్ని పత్రికలు సెక్స్‌ని పెంచి పోషించటమే తమ ధ్యేయంగా వ్యవహరిస్తున్నారు. ఇందుకు కారణం ముమ్మాటికి పాఠకులే అని చెప్పవచ్చు.

పాఠకులు 'టూ మచ్ ఈజ్ టూ బ్యాడ్" అన్న నానుడి దృష్టిలో పెట్టుకోటం, పాఠకుల ఇష్టా



ఇష్టాల మేరకే పత్రికలు తీర్చిదిద్దు తున్నామనే మిషతో అశ్లీల సాహిత్యం ప్రచురించక ఆయా రచనలు అరికట్టడంలో సంపాదకులు ఓ తాటిపై నడవటం ఎంతైనా అవసరం. ఈ రీతిగా పత్రికల్లో 'సెక్స్' పాత్ర గూర్చి విశ్లేషిస్తే అందులో సంపాదకులు మరియు రచయిత(త్రు)ల పాత్ర అటుంచితే పాఠకులే అసలు సిసలైన మార్గదర్శకులని చెప్పక తప్పదు.

– ఎం. త్రివేణి (పెద్దపల్లి)

## మక్కువ చూపుతారు

పురుష స్వామ్య విష సంస్కృతియొక్క వికృత స్వరూపమే యీ సెక్సు కథలు. (సెక్సు సినిమాలు కూడా). ప్రకృతి పరంగా ఏర్పడుతున్న సెక్సు కోరికలు సామాజిక నైతిక విలువల స్పందనలకి కొద్దో గొప్పో సెన్సారు అవుతూ మనలోని 'అన్‌కాన్షస్ మైండు'లోకి చేరతాయని ప్రముఖ సైకాలజిస్టు సిగ్మండ్ ఫ్రాయిడ్ ఏనాడో చెప్పారు. అయితే సెక్సుకి సంబంధించిన సరయిన మౌలిక సూత్రాలు తెలీకపోవడంవల్లా, స్త్రీకి నేటి సమాజంలో వున్న చిన్న చూపువల్లా, స్త్రీ పురుషులలో నిజమైన ప్రేమలు మరుగునపడి సెక్సుకే ప్రాధాన్యతని ఆపాదించడంవల్లా ఈ సెక్సు కథలపై చాలామంది పాఠకులు మక్కువ చూపుతారు.

కాబట్టి సెక్సు కథల్నే పాఠకులు చదివేటట్టు పత్రికలు పురికొల్పకూడదు. పత్రికలు సెక్సు కథల్నే ప్రచురించేట్టు పాఠకులు ప్రోత్సహించకూడదు. యిలా రెండు వేపులా పయనం సాగినపుడే పై వ్యాఖ్య మటుమాయమవుతుంది. సమ సమాజం ఏర్పడుతుంది.

-కేశవరావు, (టిటాగడ్, వెస్ట్ బెంగాల్)

## తప్పులేదు!

సెక్స్ జీవితంలో ఒక భాగం. సెక్స్‌కి, జీవితానికి, సెక్స్‌కి, ప్రేమకు అవినాభావ సంబంధం వున్నది. అటులని పాఠకులంతా సెక్స్ పుస్తకాలే చదువుతారనుట పొరపాటు. కేవలం సెక్స్ పుస్తకాలు మాత్రమే చదువుపాఠకులు బహుకొద్ది మంది మాత్రమే. అన్ని విధాలా సాహిత్యమును చదువు పాఠకులు చాలామంది వున్నారు. సెక్స్ కథలలో ఏముందో తెలుసుకోవాలని కొందరు



చదువుతారు. కాలక్షేపం కోసం కొందరు చదువుతారు. మరికొందరు అన్ని తెలిసినా అప్రయత్నంగానే ఏమి రాశారోనని వుత్సుకతతో చదువుతారు. సెక్స్‌ను పవిత్రంగాను, విజ్ఞానంగాను ఎంచి చదివేవారు కొందరు. ఏది ఏమైనా సెక్స్ గురించి విమర్శనాత్మక దృష్టితో తెలిసికొనుట కోసం పాఠకులు సెక్స్ పుస్తకములు చదువుటలో తప్పులేదు.

ఎస్. యశోద (ఎమ్మిగనూరు)

---

పాణి ఆ దిగుడుబావిలో దొరికిన మహావజ్రాన్ని తల మీద పెట్టుకుని వికృతంగా తాండవనృత్యం చేస్తున్నాడు. అంతలో ఆకాశం ఫెటిల్లున పగిలినట్లైంది. వజ్రపాణి అనుచరులందరూ ఒక్కసారిగా భయభ్రాంతులైపోయారు.

"అది ప్రళయ సంకేతమా?" ఎవరిదో గొంతు.

అంతలో వజ్రపాణి గొంతు ఆ ప్రశ్నకు సమాధానంగా వినిపించింది. "ప్రళయ సంకేతం కాదు వజ్రసంకేతం.....! వజ్ర సంకేతం......! వజ్రసంకేతం......!"

విశ్వధరవర్మ చప్పున కళ్లు తెరిచాడు. ఆయన మొహం ఆనాటి జ్ఞాపకాలతో హఠాత్తుగా ఎర్రబడింది. పింకీ, శక్తిధర్ అంతవరకూ ఆయన మొహంలోకే చూస్తున్నారు.

"అవును తల్లీ! నువ్వు చెప్పిందంతా వింటుంటే నాకూ అంతా స్పష్టంగా అర్థమౌతోంది. విక్రమిత్రం ఆ దురదృష్టకరమైన రోజున జరిగిన ఒక విచిత్ర సంఘటనకు అర్థం ఇప్పుడు తెలుస్తోంది. అవును, నువ్వు చెప్పినట్టు ఒక్కోసారి ప్రకృతి కూడా వజ్రపాణి లాంటి దుర్మార్గుడి పక్షమే వహిస్తుంది. ఇన్నేళ్లపాటు వజ్రపాణి ప్రకృతి ఇచ్చిన అండదండల్లో విర్రవీగుతూ వచ్చాడు. అతనికి సమయం పూర్తి కావచ్చింది. ఇక ఎన్నో రోజులు లేవు. అతన్తో పాటే అతని వైభవమూ అంతరించబోతోంది. ఆ వైభవం అంతరించడానికేం చెయ్యాలో నేను చెబుతాను. జాగ్రత్తగా వినండి," అంటూ చెప్పడం మొదలెట్టాడు.

"వజ్రపాణి సామ్రాజ్యాన్ని సౌలభ్యం కోసం స్థూలంగా రెండు భాగాలుగా విభజిద్దాం. నక్షత్రధూళి కురుస్తున్న ప్రదేశంతో కలిపి వజ్రాలగనులు ఒక భాగం. ముందుగా నేను చెప్పినట్టు అతని హవేలీ ఒక భాగం. వజ్రాల గనుల్లో వజ్రపాణి ముఠాతో నేరుగా తలపడడానికి శక్తి ఒక్కడే చాలు. అయినప్పటికీ అతనికి సాయంగా వెళ్లడానికి నేనో సైన్యాన్నే తయారు చేశాను. వజ్రాల గనుల్లో వజ్రాల కోసం త్రవ్వకాలు చేసే ఒక వ్యక్తి మనకు సాయపడతాడు" అంటూ విశ్వధరవర్మ చిన్నోడి పేరు పెట్టి బిగ్గరగా పిలిచాడు. వెంటనే చిన్నమ్మతో సహా చిన్నోడు వాళ్ల ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

"ఇతని పేరు చిన్నోడు. ఆ అమ్మాయిపేరు చిన్నమ్మ. వీళ్ళిద్దరూ కాబోయే ఆలుమగలు" అంటూ పరిచయం చేశాడు విశ్వధరవర్మ.

పింకీ వాళ్లిద్దర్నీ తేరిపారా చూసింది. ఆమె తనకేసిచూస్తునే చిన్నమ్మ ముసి ముసినవ్వులు నవ్వుకుంటూ చిన్నోడి వెనకదాక్కుంది.

"దండాలు దొరసానీ," అన్నాడు చిన్నోడు.

"వజ్రాల గనుల్లో వజ్రపాణితో తలపడడంలో చిన్నోడు మనకు అన్ని విధాలా సాయం చేస్తాడు" అన్నాడు విశ్వధరవర్మ.

"కానీ, మన వాళ్లందరూ ఆ వజ్రాల గనుల్లో ప్రవేశించడం ఎలా? బయటి ప్రపంచంతో ఆ వజ్రాల గనులకు సంబంధం లేదు. అక్కడికి వెళ్ళాలంటే ఆ లోయదాటి వెళ్లాలి. వజ్రపాణి అనుమతి లేనిదే ఆ లోయ మీది వంతెన ఆపరేట్ కాదు" అంది పింకీ.

"అందుకే ఆ లోయ మీద దాడి చేయడానికి ముందు మనం దాన్ని కంట్రోలు చేసే ఆపరేటింగ్ మిషన్ని ఆక్రమించుకోవాలి" వివరించాడు శక్తిధర్.

విశ్వధరవర్మ తలూపాడు.

"అవును. ఆ లోయదాటడం మనందరికీ అసాధ్యం కావచ్చు. కానీ, శక్తిధర్‌కి మాత్రం అది కొట్టిన పిండి. క్షణాల మీద

## పాఠకుడి బలహీనతే కారణం

ఒక తరహా కథలకు అలవాటుపడిన పాఠకుడు మరొక రకమైన కథలు చదువలేక పోతున్నాడు. దానికి పాఠకుడి బలహీనతే కారణం అయి ఉండవచ్చు. లేకుంటే మరేదైనా కారణం అయిఉండవచ్చు. పాఠకుడి బలహీనతను దృష్టిలో పెట్టుకొని రచయితలు కుప్పలు, తెప్పలుగా సెక్స్ కథలు రాస్తున్నారు. ఇటువంటి కథలు పాఠకులు చదువుతున్నంతసేపూ రచయితలు రాస్తూనే



ఉంటారు. పాఠకుల్లో మార్పు రానంతవరకు రచయితల రచనల్లో మార్పురాదు. అందువలన, పాఠకుడు ఇటువంటి సెక్స్ కథలను చదవకుండా ఉన్నప్పుడే రచయితలు ఇటువంటి కథలు రాయడం మానేస్తారు.

శ్రీపాద నాగరాజు (రాజమండ్రి)

## సరికాదు

ధర్మార్థ కామ మోక్షాలలో కామం (అదే సెక్సు)ది మానవ జీవితంలో మూడవ స్థానం. అధునికత పేరుతో దాన్ని తెచ్చి మొదటి స్థానంలో వుంచితే వెగటు పుట్టి విరక్తి చెందుతారు. లేదా రోగాలపాలవుతారు. సెక్సు కథల[illegible]ంగా చేసుకుని ఇప్పుడు చాలా వార పత్రికలు బాగా పాప్యులర్ అవుతున్నాయనుకుంటున్నారు. కానీ అది కొన్నాళ్ళు మాత్రమే. సెక్సుమీద ఆసక్తి కేవలం వాన ముందు వచ్చే మెరపులా క్షణికమైనది. సెక్సు తప్ప యింకేమీ చదవరు అనటం సరైన మాట కాదు.

-ఎమ్. ఎల్. సత్యమణి, (మద్రాసు)

## సాహితీ విలువ తెలిసిన పాఠకులూ ఉన్నారు

పాఠకులు సెక్స్ కథలుంటేనే పత్రిక చదివే స్థాయికి ఈ సమాజాన్ని దిగజార్చింది ఎవరు? మొదట అతి తక్కువ స్థాయిలో సెక్స్ సాహిత్యాన్ని ఒక చిన్న టాబ్లెట్ రూపంలో మత్తు మందులాగా పాఠకుల లోనికి ముఖ్యంగా యువతరంలోనికి చొప్పించారు. కొంతమంది పత్రికారంగం వాళ్ళు. ఇప్పుడు అది ఒక పెద్ద కొకైన్ లాంటి మత్తు పదార్థంగా మారి పత్రికలో పూర్తిగా సెక్స్ కథలుంటేనే కాని చదవలేని స్థితికి తయారయ్యారు. యువతరం ఈ సాహిత్యం కోసం ఈ విధంగా ఎగబడుతుంటే సాహితీ విలువలు తెలిసిన పాఠకులు ఈ స్థితికి మనసులో కుళ్ళుతున్నారు. అసలు పోను పోను "మంచి 'సాహిత్యం" అనేది వెలువడుతుందా అనేది ప్రశ్న?

– బి. రాణి (పోరుమామిళ్ళ)

## అవమానం

పాఠకులు సెక్స్ కథలు తప్ప యింకేమి చదవరనటం మొత్తం పాఠకలోకాన్నే అవమానించినట్లవుతుంది. పాఠకులు సహజ కుతూహలంతో అనేక రకాలయిన, హారర్, క్రైమ్, సస్పెన్స్, థ్రిల్లర్, సైన్స్, ఫాంటసీ, హాస్యం, రొమాంటిక్ కథలు, నవలలు కూడ నిత్యం చదువుతారు. పాఠకుల మనస్సుల నాహ్లాదపరచి,



మరో వింత అనుభూతికి గురిచేసే ఎన్నో కథలు, నవలలు, పాఠకుల అభిమానాన్ని చూరగొని, రచయితలకు కీర్తి ప్రతిష్ఠలు ఆపాదిస్తాయి. పాఠకులలో కుతూహలాన్ని, పఠనాశక్తిని పెంపొందించే సాహిత్యాన్నే ఆదరిస్తుంది పాఠక లోకం.

–పల్లె వెంకటేశ్వరరావు (హెచ్. ముత్యాలంపాడు)

## వజ్రసంకల్పం

లోయలోకి దిగి అవతలికి చేరుకోగలడు. కాబట్టి ఆ కంట్రోల్ టవర్ని స్వాధీనం చేసుకోవడంగానీ, వజ్రాల గనుల్లో ప్రవేశించడంగానీ కష్టం కాదు" అన్నాడు.

పింకీ తృప్తిపడ్డట్టు తలూపింది.

"వజ్రపాణి వజ్రాల గనుల్ని దెబ్బకొట్టడం ఒక ఎత్తు. కేవలం అతనుండే ఆ హవేలీని దెబ్బకొట్టడం మరో ఎత్తు. ఆ హవేలీ ఒక మాయా మహల్ లాంటిది. అందులో ఎన్ని రహస్య గృహాలున్నాయో లెక్కలేదు. తన సంపదనంతా వజ్రపాణి ఆ హవేలీలోనే దాచిపెట్టాడు. ఆ హవేలీని దెబ్బకొట్టగలిగితే ఏనుగు కుంభస్థలాన్ని దెబ్బకొట్ట గలిగినట్టే" అన్నాడు విశ్వధర వర్మ.

"దాని గురించి మీరు ఆలోచించనవసరం లేదు. ఆ సంగతి నేను చూసుకుంటాను" అంది పింకీ.

"ఎలా?" అడిగాడు శక్తిధర్.

"నేను వజ్రపాణి కోటలో ఇప్పటికే పాగా వేశానని మర్చిపోతున్నావ్. వజ్రపాణికి ఇప్పటికే నా మీద చాలా నమ్మకం కలిగింది. అతని హవేలీని దెబ్బకొట్టే సంగతి నేను చూసుకుంటాను"

శక్తిధర్ తల అడ్డంగా వూపాడు.

"అదంత సులభం కాదు" అన్నాడు.

"ఏం?"

"వజ్రపాణి హవేలీలో నిజానికి రాజ్యమేలుతున్నది వజ్రపాణి కాదు. నగ్నదేవత మైలమ్మ. ఆమెను నువ్వు చూశావా?" అడిగాడు.

పింకీకి మైలమ్మ గుర్తుకొచ్చి అప్రయత్నంగా ఒళ్లు జలదరించింది.

"చూశాను. అనుకోకుండా ఒకసారి హవేలీలో చూశాను. మరోసారి వజ్రపాణి స్వయంగా నన్నామె దగ్గరికి తీసుకెళ్లాడు. కానీ, ఎందుచేతనో ఆమె మా ఎదుట పడడానికి ఒప్పుకోలేదు" అంది.

"సరే! ఆమెను నువ్వు చూశావు గదా! వజ్రపాణి హవేలీ రహస్యాలన్నీ ఆమె గుప్పిట్లో వున్నాయి. నువ్వు వజ్రపాణిని మోసం చెయ్యగలవేమోగానీ ఆ నగ్నదేవతను మోసం చేయడం అంత సులభం కాదు. ఆమెకు నీ మీద ఏ మాత్రం అనుమానం కలిగినా వజ్రపాణిని హెచ్చరిస్తుంది. ఆ మరుక్షణం నువ్వు ప్రమాదంలో పడిపోయినట్టే" అన్నాడు శక్తిధర్.

"నన్ను గురించి మీరెవరూ దిగులుపడాల్సిన పన్లేదు. ఆ నగ్నదేవత సంగతి నేను చూసుకుంటాను" అంది పింకీ.

"వజ్రపాణి హవేలీని మనం దెబ్బకొట్టగలిగితే వజ్రపాణి పతనం నిశ్చయం" అన్నాడు శక్తిధర్.

"శక్తీ! అక్కడే నువ్వు పొరబడుతున్నావు" విశ్వధరవర్మ గంభీరంగా అన్నాడు.

శక్తిధర్, పింకీ ఒకేసారి ఆయనవైపు ఆశ్చర్యంగా చూశారు.

విశ్వధరవర్మ తలూపాడు.

"అవును శక్తీ! వజ్రపాణి హవేలీని దెబ్బతీస్తే ఏనుగు కుంభస్థలాన్ని దెబ్బకొట్టినట్టేనని నేను ఒప్పుకుంటాను. కానీ, అలా చేసినందువల్ల అతను పూర్తిగా కూలిపోడు. నువ్వనుకుంటున్నట్టు వజ్రపాణి ప్రధాన బలం అతని హవేలీలోనూ లేదు, వజ్రాల గనుల్లోనూ లేదు. వజ్రపాణిని కుప్పకూల్చగలగాలంటే మనం అతనెంత మాత్రమూ వూహించని మరో చోట దెబ్బ కొట్టాలి" అన్నాడు.

పింకీ శక్తిధర్ లిద్దరూ విస్మయంతో ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

(ఇంకా వుంది)

# 42 వేల మంది నుంచి ఎన్నుకోబడ్డ లెక్కల "కిరణ్"

వచ్చే జులైలో బీజింగ్‌లో 'మాథ మాటిక్ ఒలింపియాడ్' (ప్రపంచ గణిత పరిజ్ఞాన పోటీ) జరుగనున్నది. ఈ పోటీలో అమెరికాను విజయపథంలో నడిపించగలడని అందరూ ఆశిస్తున్న కిరణ్ అనే 16 ఏళ్ల బాలుడు భారతీయ సంతతికి చెందిన వాడు కావడం... ప్రత్యేకించి అతడి పితామహులు దక్షిణ భారతంలోని ఉడిపికి చెందిన వారు కావడం విశేషం.

ఈ 'మాథమాటిక్ ఒలింపియాడ్'లో పాల్గొనే అమెరికా జట్టును ఎంపిక చేయడానికై అమెరికాలో దేశ వ్యాప్తంగా 420,000 మంది హైస్కూలు విద్యార్థులకు నిర్వహించిన పోటీలో కిరణ్ ప్రథమస్థానం పొందాడు. 'అమెరికన్ మాథమాటిక్స్ అసోసియేషన్' వారు ఈ ఘన విజయానికి గాను కిరణ్‌కి ఈ జూన్ 6న.. అతడి 16వ జన్మదినోత్సవం సందర్భంగా ఒక ఫలకాన్ని కూడా అందజేశారు.

బీజింగ్‌లో జూలై 12-13 తేదీలలో జరిగే ప్రపంచ గణిత పరిజ్ఞాన పోటీ (మాథమాటిక్ ఒలింపియాడ్)లో 60 దేశాల జట్లు పాల్గొంటాయి.

కిరణ్ తాత గారికి... దక్షిణ భారత వంటకాలకు ప్రసిద్ధిగాంచిన ఉడిపిలో ఒక హోటల్ వుండేది. కిరణ్ తండ్రి హెర్గ్ కెద్లాయ ప్రపంచ బ్యాంకికి చెందిన భారతీయ డైరెక్టర్‌కి 'కుక్' (వంట మనిషిగా) అమెరికా వెళ్లి అక్కడ స్థిరపడ్డారు. కాగా కిరణ్ తల్లి కస్తూరి ఒక రైతు కుమార్తె.

కిరణ్ పుట్టుకతోనే అసాధారణ ప్రజ్ఞ కనబరచడం ప్రారంభించాడు. అతడు రెండేళ్ల వయసులోనే పుస్తకాలు చదవడం మొదలు పెట్టేశాడు. మూడేళ్ల వయసులో అతడు అసలేమీ మాట్లాడకుండా కేవలం కొన్ని వస్తువుల్ని మాత్రమే చూస్తుండడంతో అతడి తల్లిదండ్రులకు బెంగపట్టేసుకుంది. వెంటనే వారు కిరణ్‌ని డాక్టర్‌కి చూపించారు. అయితే అక్కడ తన కన్సల్టింగ్ రూమ్‌లో కిమ్మనకుండా కూర్చున్న కిరణ్ అక్కడున్న వైద్యశాస్త్ర గ్రంథాన్ని చదివేస్తున్నాడని డాక్టర్ గ్రహించాడు. అప్పుడు ఆ డాక్టర్ ద్వారానే... కిరణ్‌లో వికసిస్తున్న అసాధారణ ప్రతిభ అతడి తల్లిదండ్రులకు తెలిసింది.

ఇటువంటి 'గిఫ్టెడ్ చిల్డ్రెన్'కి సంబంధించిన విషయాలలో స్పెషలిస్టు అయిన డాక్టర్ జీన్‌సిమ్స్ తాను ఇంతవరకు చూసిన ఇట్టి బాలల్లో కిరణ్ అత్యంత ప్రతిభాశాలి అని భావిస్తున్నట్టు చెప్పారు.

కిరణ్ నాలుగేళ్ల వయసులోనే 'వయొలిన్' మీద సంగీతం పలికించడం కూడా మొదలు పెట్టాడు. 7వ తరగతిలో కిరణ్ 'సరదా కోసం' జాతీయ స్థాయిలో నిర్వహించిన యూనివర్శిటీ ప్రవేశ పరీక్ష వ్రాసి అందులో దేశం మొత్తం మీద 2వ 'ర్యాంకు' సంపాదించి అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తాడు. కిరణ్ మంచి ఫొటోగ్రాఫర్ కూడా. ●

# • కాప్షన్‌లెస్ కార్టూన్లలో పరిణతి చెందిన సుధీర్‌ధార్ కార్టూన్లు కొన్ని













ఏకైక పురుషుడు సుధీర్ ధార్. "మీ ఆవిడ బాగానే వుంటుంది కదా! ఎందుకలా మీ కార్టూన్లలో స్త్రీని అనాకారిగానూ- లావు గానూ చిత్రిస్తారు?" అని ఎవరో ప్రశ్నిస్తే "అందంగా వున్న ప్రతి స్త్రీ మధురంగా నవ్వాలని ఎక్కడన్నా వుందా? అలాగే ఇదీనూ. అందరూ హేమమాలినీలూ- రేఖలూ కాలేరు" అన్నాట్ట సుధీర్.

సుధీర్‌కు నచ్చిన ఎడిటర్ కుష్వంత్ సింగ్. "ఏది గియ్యాలనుకుంటున్నావో అది నిస్సంకోచంగా- నిర్భయంగా గియ్యి. మనమీద వొత్తిడులు వస్తాయని నువ్వు ఆలోచించ నవసరం లేదు. మనకు పత్రికా స్వాతంత్ర్యం వుంది. వాక్ స్వాతంత్ర్యం వుంది...." అని ప్రోత్సహించడం ఎందరు ఎడిటర్లకు సాధ్యం? అన్నాడు సుధీర్‌ధార్.

నిజమే! కార్టూనిస్టులకు ఇది చక్కగా వర్తిస్తుంది.

–బి. హెచ్. ఎస్.



సుధీర్‌ధార్ 'స్వయం చిత్రం'



# అంతరాత్మ

అర్ధరాత్రి దాటింది!

అందుకు సాక్ష్యంగా కొద్ది క్షణాల క్రితమే గోడగడియారం పన్నెండు గంటలు కొట్టింది!

గదంతా నిశ్శబ్దం! స్మశాన నిశ్శబ్దం!!

దూరాన్నుంచి నక్కల అరుపులు తీలగా విన్పిస్తున్నాయి.

అతను మౌనంగా లేచి గదంతా కలయ జూసాడు.

ఏర్పాట్లన్నీ సంతృప్తికరంగా వున్నందుకు లోలోపల సంతోషిస్తూ ధైర్యంగా వూపిరి పీల్చుకున్నాడు!





# ఈవారం దెయ్యంకథ

# ఆదిరెడ్డి మాపుళ్ళు

ఆ గదిలో ఆమె అతను తప్ప మరోప్రాణి లేదు. ఉండే అవకాశం కూడా లేదు. అయినా ముందు జాగ్రత్తగా ఆ సమయమే అనువైనదిగా ఎంచుకున్నాడు. పథకం ప్రకారం కార్యక్రమాన్ని గప్‌చుప్‌గా పూర్తి చేయాలని నిర్ణయించుకున్నాడు!

భార్య భయంకర మౌనిలా నిద్రిస్తోంది! సన్నని ఆమె శ్వాస స్పష్టంగా వినిపిస్తోందతనికి. ఇక ఆలస్యం చేయడం అనవసరం అనుకున్నాడు.

కిటికీలు తలుపులు సరిగ్గా వేసాడో లేదో నని మరో సారి చెక్ చేస్కున్నాడు. ఆ తర్వాత అసలు పనిలోకి దిగేడు.

ముందుగా సీలింగ్ ఫ్యాన్ రాడ్‌కి బలమైన తాడుని కట్టి సిద్ధం చేసాడు.

టక్! టక్! టక్!

గోడ గడియారం లయబద్ధంగా శబ్దం చేస్తోంది. అది అతనికిబ్బందిగా ఒకింత గుండె గుబులుగా అనిపించింది. వెంటనే గడియారం పెండ్యులాన్ని పట్టుకుని ఆపేసాడు.

ఇంకా ఏదో శబ్దం!

సర్‌ర్‌ర్‌ర్...! సర్‌ర్‌ర్‌ర్....!!

వెంటనే తల తిప్పి చూసేడు.

టేబుల్ మీద గ్రామ్‌ఫోన్ రికార్డుపై ముల్లు చప్పుడు!

ఆమెను తొందరగా నిద్ర పెట్టడం కోసం వేసిన ఎల్. పి. రికార్డు... ఆలోచనలో మర్చే పోయేడు!

గ్రామ్‌ఫోన్ రికార్డుని తీసి మళ్ళీ ఆమె మంచం దగ్గర కొస్తుండగా గోడమీద ఏదో తపతప మని శబ్దం చేయసాగింది. బల్లి – దాని నోట్లో ఏదో పురుగు గింజుకుంటోంది.

బల్లి పట్టిన పట్టు విడవలేదు. మరుక్షణం పురుగును అమాంతం మింగేసింది. ఆ దృశ్యాన్ని చూసి అతను నెమ్మదిగా నవ్వుకుంటున్నట్టు బెడ్‌లైట్ మసక వెలుతుర్లో మెరుస్తున్న అతని పళ్ళు చెబుతున్నాయి.

ఈ రాత్రితో సీత జీవితం కూడా ఆ పురుగులాగే అంతమౌతుంది. తెల్లారే సరికి తను ఇక స్వేచ్ఛాజీవి. పెళ్ళాం చావుతో తన పీడ పూర్తిగా విరగడై పోతుంది. తను కోరుకున్న జీవితాన్ని పొందే అదృష్టం రేపటినుంచే ప్రారంభం అవుతుంది అనుకున్నాడతను నెమ్మదిగా కదుల్తూ.

"ఏయ్!... ఆగు... ఏవిఁటి నువ్వు చేస్తున్న పని!!"

ఏదో అస్పష్టమైన గొంతు బిగ్గరగా వినిపించి నట్టనిపించిందతనికి.

ఒక్క క్షణం నిశ్చేష్టుడై పోయేడు!

గుండెలు జారిపోయేయి. నరాలు భయంతో తన్నుకు పోయినట్టు భీతి చెందేడు. ఒంట్లో సన్నని వొణుకు ప్రారంభమైంది.

వెంటనే వెనక్కి తిరగ బోయేడు. కాని సాధ్యపడలేదు. గగుర్పాటుతో తనను తాను స్వాధీన పర్చుకోలేక తికమక పడిపోయేడు. అలా కొన్ని క్షణాలు నరకాన్ని చవిచూపింది ఆ గదిలోని ప్రశాంతత అతనికి.

ఎదురుగా భార్య అమాయకంగా నిద్రిస్తోంది.

ఆ మాట లెవరన్నట్టు!?

భయపడుతూనే వెనక్కి చూసేడు అతిప్రయత్నంమ్మీద.

ఎవరూ కనిపించలేదు!

అంతా తన భ్రమ అనుకుని మరో అడుగు ముందుకేయ బోయేడు.

"ఆగుఁ....! నిన్నే!" మళ్ళీ అదేగొంతు.

ఇదీ! అని స్పష్టంగా తెలియని గొంతు.

ఆడా కాదు. మగా కాదు.

అసలు మనిషి స్వరంలా లేదు.

ఈ సారి నిజంగానే భయమేసిందతనికి.

తిరిగి చూసేడు!

మళ్ళీ అదే శూన్యం!! ఎవరూ కనిపించలేదు.

ఏవిటీ విచిత్రం! కొంప తీసి గదిలో తనకు తెలీకుండా మూడో వ్యక్తి....! 'అసంభవం' అనుకుంటూనే గదంతా కిందా మీదా జాగ్రత్తగా పరిశీలించి చూసేడు! ఎవరూ కనిపించలేదు!

అతను దీర్ఘంగా ఆలోచిస్తూ ఆశ్చర్యంలో పడిపోయేడు చాలా సేపు.

ఒకవేళ దెయ్యమేమో! ఆ ఊహ అతనికి చెప్పలేనంత భయాన్ని కలిగించింది. ఎందుకంటే అతనికి చిన్నప్పట్నుంచి దెయ్యమంటే గొప్ప భయం. ఆ పేరు వింటేనే హడలిపోతాడు

అదీగాక– ఎవరో చచ్చిపోయి దెయ్యమై తిరుగుతున్నట్టు అప్పుడప్పుడూ వూళ్ళో అనుకోవడం కూడా విన్నాడు.

అవును! ఆ దెయ్యమే నేమో!! ఛ ఛ! యిదేమిటి తనిలా భయపడుతున్నాడు. ఊరికే భయపడేవాడు సుఖపడలేడంటారు. ఇంత దాకా తెగించి యిప్పుడు వెనుకంజ వేస్తే ఎలా! రేపు తను సుఖపడాలంటే యీ రాత్రి తననుకున్నది పూర్తి చేయాలి. దృఢనిశ్చయంగా అనుకుని తాడుని చేత్తో పట్టుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో అతన్ని వెనక్కి లాగుతూ భుజమ్మీద ఎవరిదో చెయ్యి పడింది.

తక్కున వెనక్కి తిరిగి చూసేడు జుగుప్సతో.

మసక చీకట్లో మనిషి ఆకారం నల్లగా అగుపించింది.

"ఎవరు నువ్వు?!" హఠాత్తుగా అన్నాడు.

ఆ ఆకారం నుంచి ఎటువంటి సమాధానం రాలేదు.

మరికాస్త దగ్గరకు జరిగి "నిన్నే...! ఎవరు....!" అన్నాడు కాస్త బిగ్గరగా.

ఆ అరుపుకి సీత ఇటు నుంచి అటు వొత్తిగిల్లింది.

అతను స్విచ్ నొక్కేడు లైట్ వేసే ప్రయత్నంగా.

ఆశ్చర్యం! బల్బు వెలగలేదు!!

మళ్ళీ స్విచ్ నొక్కేడు. వెలగలేదు.

మళ్ళీ...! మళ్ళీ...!! మళ్ళీ...!!! చాలా సార్లు ప్రయత్నించేడు.

"బల్బు వెలగదు" నల్లని ఆకారం నెమ్మదిగా అందప్పుడు ఆదోలా నవ్వుతూ.

అతను విసురుగా ఆ ఆకారాన్ని చేత్తో పట్టుకున్నాడు. ఈ సారి మరింత ఆశ్చర్యమేసింది. ఆకారం చేతికి తగలడంలేదు. మాట మాత్రం విన్పిస్తోంది.

"నే నీ చేతికి తగలను...! వినిపిస్తానంతే!"

"అంటే! నువ్వు మనిషివి కాదా!"

'కాదు దెయ్యాన్ని!"

అప్పుడు చూసాడు. ఆ ఆకారం కాళ్ళు వెనక్కి తిరిగి వున్నాయి.

ఒక్క క్షణం అతను మ్రాన్పడి పోయేడు. తనను తాను నిగ్రహించుకో లేక పోయేడు. ప్రాణాలు పోతున్నట్టు ఊపిరి సలపనట్టు... కొన్ని క్షణాలు అలాగే గడిచాయి.

ఆ తర్వాత అతనికి తెలియకుండానే ఆ దెయ్యాన్ని "ఎందుకొచ్చావిక్కడికి?!" అని ప్రశ్నించాడు.

ఆక్షణంలో అతను మరొకటి గమనించేడు.

తను మాట్లాడుతున్నప్పటికీ భార్య మంచమ్మీద నిద్రలోనే శబ్దానికి కదుల్తోంది. నిజానికి ఆ ఆకారం కంటే చాలా చిన్న గొంతు పెట్టి మాట్లాడుతున్నాడు. అయినా ఆ ఆకారం మాట్లాడినప్పుడు అణుమాత్రం కూడా ఆమెలో కదలిక కనిపించడం లేదు.

"నువ్వు చేస్తున్న అఘాయిత్యాన్ని ఆపడాని కొచ్చాను!" దెయ్యం చెప్పింది.

"నీకూ దీనికి ఏమిటి సంబంధం?!"

"అది నీ కనవసరం!"

"అయితే నన్నొదిలెయ్....! నా దారి కడ్డురాకు.... వెళ్ళిపో"

"అది కల్లో మాట!" దెయ్యం అంది.

"అంటే! నన్నీ పని చెయ్యనియ్యవా?!" ఉన్న కొద్దీ

# అంతరాత్మ

అతనిలో ఏదో తెలియని ధైర్యం ఏర్పడుతోంది. దెయ్యంతో వాదనకు దిగాడు.

"హత్య చేయడం నేరమే కాదు పాపం కూడా!"

"కావచ్చు!"

"తెలిసి ఎందుకు చేస్తున్నావు?!"

"నా కోసం...! నా సుఖం కోసం!"

"నీకేం తక్కువ...? నీ సుఖాని కొచ్చిన లోటేమిటి? అందమైన భార్య....! అందులోనూ ప్రేమించిన భార్య...!!"

"అదే నా బాధ!"

"అంటే?!" దెయ్యం అడిగింది.

అతను కొంతసేపు మౌనం వహించేడు.

"ఆమె మీద నీకేమైన అనుమానమా?!"

"అలాంటి దేమీలేదు."

"మరి!" అడిగింది దెయ్యం

"ఆమెను ప్రేమించి పెళ్ళి చేస్కోవడం వల్ల నేను చాలా పోగొట్టుకున్నాను!"

"ఏమిటవి?!"

"స్కూటరులేదు.... చేతికి మంచి వాచీ లేదు... ఉండటానికి మంచి యిల్లు కూడా లేదు."

"ఓహో...! అదా సంగతి...! అర్థమైంది...! నీ పెళ్ళికి కట్నాలూ కానుకలూ లేవన్నమాట...! యీ బుద్ధి అప్పుడేమైంది...?! ఆమెను ప్రేమించా నన్నావు...! ఆమె నీ ప్రాణమన్నావు...! ఆమె నీదైతే చాలు...! యింకేమీ జీవితంలో కోరనన్నావు కదూ...!"

"అవును...! అన్నాను...!! అప్పుడు తెలియక ఏదో అన్నాను...! యిప్పుడన్నీ తెల్సుకున్నాను... అందరలుళ్ళూ అత్తమామల దగ్గర తమ కోర్కెల్ని తీర్చుకుంటున్నారు. నాకు మాత్రం ఆ అదృష్టం లేదు. నేనడిగినా వారిచ్చే స్థితిలో లేరు... అందుకే యీమెను వొదిలించుకుని మరో అమ్మాయిని




పెళ్ళాడ్తాను...! నా సరదాలు తీర్చుకుంటాను...!"

"నీ సరదాల కోసం ఓ నిండు ప్రాణాన్ని బలిగొంటావా...! చట్టం నిన్ను శిక్షిస్తుంది!!"

"ఆ భయం నాకు లేదు... యీ హత్యను ఆత్మహత్యగా మార్చడానికి అన్ని జాగ్రత్తలూ ముందే తీసుకున్నాను...!" అతను ధైర్యంగా చెప్పాడు.

"ఎవర్నుంచి ఎలా తప్పించుకున్నా నువ్వు నా దృష్టిని మాత్రం తప్పించుకుని ఏ పనీ చేయలేవు!!"

"నువ్వా...!? నువ్వు నన్నేమీ చేయలేవు!" అతను వికటాట్టహాసం చేసాడు.

"ఏమి చేయలేనా...! అయితే కాస్కో...." అంటూ దెయ్యం ఒక్కసారి అతనిపై పడింది. గొంతు నులుముతూ పది నిమిషాలు గిర్రున తిప్పి గోడకేసి కొట్టింది.

అంతే!

అతను గిలగిలా గింజుకుని బంతిలా ఎగిరి పడ్డాడు. మరుక్షణాన్నే అదే స్పీడుతో వచ్చి దెయ్యం కాళ్ళ దగ్గర కుప్పలా పడిపోయేడు.

అతనికి ఊపిరి సలపడం లేదు. కళ్ళు తిరుగుతున్నాయి. ప్రాణం పోయిందేమో అనిపిస్తోంది. భూమి గుండ్రంగా తిరుగుతున్నట్టుగా... భయంకరమైన అగాధంలో కూరుకు పోతున్నట్టుగా... ప్రత్యక్ష నరకాన్ని చవి చూసా డతను చాలా సేపు.

"ఎలా వుంది నా తడాఖా...! ఇది కేవలం మచ్చుక మాత్రమే...!! ప్రాణం పోకుండా చంపుతాను. జాగ్రత్త...!!!

దెయ్యం హెచ్చరించింది.

అతను మారు మాట్లాడ లేదు. కుక్కిన పేనులా పడివున్నాడు. నిజానికి అతనింకా నరకయాతన నుంచి పూర్తిగా తేరుకోలేదు.

"ఇప్పుడే కాదు...! యిక ముందెప్పైనా ఆమెకు ద్రోహం తలపెట్టావో...! చూస్కో... నీ భరతం పడ్తాను...? అనుక్షణం నీ వెన్నంటి వుంటాను. నిన్నోకంట కనిపెడ్తూనే వుంటాను... నా కన్నుగప్పి చెడు తలపెడితే చంపేస్తాను...! తస్మాత్ జాగ్రత్త."

* * * * * * *

"సీతా! నన్ను క్షమిస్తావు కదూ...!" రఘు భార్యకేసి ఆర్తిగా చూసేడు.

సీత విస్మయంగా చూసింది. ఆమెకంతా అయోమయంగా వుంది. ఈయనకేమైంది? ఇంత లోనే యింత మార్పు ఎలా వచ్చింది? నిన్న సాయంత్రం నుంచి గమనిస్తోంది. ఆయన ప్రవర్తన... ఆయన ధోరణి... ఏదో అంతు తెలియని వింత పోకడలు ప్రస్ఫుటిస్తున్నాయి ఆయన ప్రతి కదలికలోనూ!

"చెప్పు సీతా! నన్ను క్షమించానని చెప్పు" రఘు ముఖం పీక్కుపోయి నీరసించి పోయింది... లోతుకు పోయిన కళ్ళు... వదనంలో ప్రేత కళ... రాత్రంతా నిద్రలేనట్టుగా యిట్టే చెబుతున్నాయి.

"అదేమిటండి...! అంత తప్పు మీరేం చేసారని"

"లేదు సీతా! నేను చాలా తప్పు చేసాను...

బామ్మ ఎంతగానో ప్రేమించే ఈచిట్టి
బంగారు పాప. వారి ఆనందం సదా నిలిచి ఉండేందుకు,
హార్లిక్స్ యొక్క పోషక శక్తిని వారికి అందించండి.
అందులో మీ కుటుంబం ఆరోగ్యంగా ఉండేందుకు
కావలసిన పోషక పదార్థాలు పుష్కలంగా ఉన్నాయి.

మంచి ఆరోగ్యపు అనుభూతి.
మంచి జీవితపు ఆనందం. హార్లిక్స్
సద్గుణాలలో పాలుపంచుకోండి.




మంచి పుష్టికరమైనది

కుటుంబపు హృదయానందం

కట్టుకున్న భార్యవి... ప్రేమించి పెళ్ళి చేసుకున్న నిన్ను అన్యాయంగా హింసించేను... కట్న కానుకలు పుట్టింట్నుంచి తీసుకురమ్మని అనరాని మాట లన్నాను... అనవసరంగా నిన్ను బాధపెట్టాను. ఆఖరికి... నిన్ను... నిజంగా నా పాపానికి నిష్కృతి లేదు!" అంటూ రఘు భార్య కళ్ళలోకి చూస్తూ కంటతడి చేసుకున్నాడు.

"ఛ! ఛ!! ఊర్కోండి!" సీత అతన్ని ఊరడించింది.

రఘు పసివాడిలా ఏడుస్తుంటే ఆమె హృదయం తరుక్కుపోయింది. భర్త తన ఎదుటే కళ్ళ నీళ్ల పర్యంతమై రోదిస్తుంటే ఎలా ఓదార్చాలో తెలియక తికమక పడింది సీత.

ఆ సాయంత్రం సీత తల్లిదండ్రులు ఊర్నుంచొచ్చేరు. వస్తూనే కూతుర్ని ఆవేదనతో కౌగిలించు కున్నారు. "నా తల్లీ! అప్పుడే నీ కెన్ని కష్టాలొచ్చేయే!" అంటూ...

"ఇప్పుడు నాకేమైందని...! ఆయన నన్ను బాగానే చూస్కుంటున్నారు!" సీత మామూలుగా అంది వాళ్ళతో.

"మాకు తెలుసమ్మా! అంత తొందరపడి బయటపడే మనస్తత్వం కాదు నీది...! రాక్షసుడు...! యిన్నాళ్ళూ నిన్నెంత హింసించేడో ...!"

"అమ్మా... ఆయనన్నంత మాటనకు...!" సీత అన్నది తల్లితో.

"ఇంకా ఎందుకు భర్తను వెనకేసు కొస్తావు... వొట్టి మనిషివి కాదన్న ఆలోచన కూడా లేకుండా నిన్ను నరకయాతనలు పెట్టాడు... నీ కోసం వూరుకున్నాం.... లేకపోతే ఆ నీచుడ్ని కోర్టుకీడ్చి...!"

"నాన్నా...!" తండ్రి మాటలు పూర్తి కాకుండానే సీత అడ్డుపడుతూ అరిచింది. వాళ్ళెందుకలా మాట్లాడుతున్నారో ఆమెకు తెలుసు. నాలుగు రోజులు క్రితం భర్త తనను చూస్తున్న తీరును పెడుతున్న బాధల్ని అన్నీ విడమరుస్తూ తల్లి దండ్రులకి పుత్తరం రాసింది... వెంటనే వొచ్చి తనను తీస్కెళ్ళమని కబురంపింది. కాని వాళ్ళొచ్చేలోగా భర్త మారిపోతాడని ఊహించలేక పోయింది సీత.

"బాగున్నారా అండి! ఎంతసేపయిందొచ్చి!" రఘు ఆఫీసు నుంచొస్తూనే అత్త మామల్ని చూసి ఆప్యాయంగా పలకరించాడు.

వాళ్ళు అయోమయంగా ఒకరి మొహా లొకరు

## దేవా(శిథిలా)లయం

నా హృదయమన్నది
ఒకపవిత్ర
నిలయం!
అందులో నీవుంటే
అది
దేవాలయం...
లేకుంటే
శిథిలాలయం!

- సలీం

# అంతరాత్మ

చూస్కున్నారు. కూతురు వైపు అదోలా చూసేరు.

రఘు అవేం గమనించే స్థితిలో లేడు. రాక రాక యింటి కొచ్చిన అత్త మామల్ని ఏ రీతిని సత్కరించాలా అని ఆలోచనలో పడిపోయేడు. పెద్దల నెదిరించి ఇంటి నుంచి బయటి కొచ్చి యిద్దరూ స్వతంత్రంగా బ్రతకడం మొదలు పెట్టిన యిన్నాళ్ళికిదే వాళ్ళు రావడం. ఈ రెండేళ్ళలో తన వైపువాళ్ళుగాని సీత వైపు వాళ్ళుగాని ఎవరూ రాలేదు. కనీసం ఎలా వుంటున్నారో ఎక్కడుంటున్నారో కూడా పట్టించుకున్న దాఖలాలు కూడా లేవు. ఇరుపక్షాల వారికి ఒకరంటే ఒకరికి అంత విముఖత వుండేది వాళ్ళ ప్రేమ నంగీకరించడానికి.

రఘు సీతలది వర్ణాంతర వివాహం. రఘు అగ్రకులస్తుడు. పైగా సీత పేదింటి పిల్ల. అదీ వాళ్ళ వైష్యమ్యాలకి కారణం.

కూతురు అనవసరపు ప్రేమలోపడి గొప్పింటి బిడ్డను కోరు కుంటోందని వీళ్ళనుకుంటే- కొడుకు నిమ్న జాతుల్తో కలిసి కులప్రతిష్ఠకు భంగం కల్గిస్తున్నాడని వాళ్ళనుకున్నారు. ఇలాంటి వాతావరణంలో తెగించి పెళ్ళి చేసుకున్నారు రఘు సీత.

"సీతా! నేనిప్పుడే బజారు కెళ్ళి కావలసినవి కొనుక్కు వస్తాను... యీలోగా వాళ్ళక్కావలసినవి చూడు!" అంటూ రఘు హడావుడిగా మళ్ళీ బయటి

కెళ్ళిపోయేడు.

మర్నాడు ఆఫీసుకి శెలవు పెట్టి ఊరంతా తిప్పాడు వాళ్ళని. చూడవలసిన ప్రాంతాలన్నీ దగ్గరుండి మరీ చూపించేడు. ఆ రెండ్రోజులూ ఓ నెల జీతం దాకా ఖర్చయింది.

అల్లుడు చేస్తున్న ఆర్భాటాలకి వాళ్ళు తబ్బిబ్బైపోయేరు అలాంటి అల్లుడ్ని అనరాని మాట లన్నందుకు లోలోపల బాధపడి పోయేరు. అందుకే వెళ్ళిపోయే ముందు–

"బాబూ! నువ్వెంత మా అమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకున్నా అల్లుడిగా నీ కోర్కెలు తీర్చాల్సిన 'బాధ్యత మాకుంది. అది మా విధి. ఇది గ్రహించడానికి మా కిన్నాళ్ళు పట్టింది!" అంటూ ఉన్న కొద్దిపాటి భూమి ఇల్లు అమ్మి తెచ్చిన డబ్బు అల్లుడు చేతిలో పెట్టబోయేరు.

రఘు ససేమిరా కాదన్నాడు. ఎంత బ్రతిమాలినా ఆ డబ్బు తీస్కోవడానికి అంగీకరించ లేదతను.

ఈసారి నిజంగా తెల్లబోయింది సీత. నిన్న మొన్నటిదాకా స్కూటరూ టీవీ యీవీ కావాలని తననేడిపించిన భర్త యిలా ఎందుకు మారిపోయాడో అర్థం కాలేదామెకు. ఏమైతేనేం అతను మారిపోయేడు.

ఏ దేవుడు పూనాడో... తన సంసారం యిక ఏ ఒడిదుడుకు ల్లేకుండా సాగిపోతుందని మనసులోనే మురిసిపోతూ దేవుడ్ని ప్రార్థించుకుంది సీత.

కాని భర్తకు పూనింది దేవుడు కాదని దెయ్యమని ఆమెకేం తెల్సు!

అయితే యింతకీ ఆ దెయ్యం ఎవరు?

ఎవరో కాదు! అతని అంతరాత్మ.

ప్రతి మనిషికి ఓ అంతరాత్మ వుంటుంది. అది మనిషి అంతరాంతరాల్లో దాగి వుంటూ మనిషి బాహ్య ప్రవృత్తుల్ని భేరీజు వేస్తూ పరిశీలిస్తుంది. అవసరమైనప్పుడు తప్ప ఎప్పుడూ బయల్పడదు. మనిషి మంచి చేసేటప్పుడు ప్రోత్సహిస్తుంది. వంచనతో ప్రవర్తించి చెడును తలపెట్టినప్పుడు నీడలా వెంటాడుతూ భయపెట్టి దెయ్యమై పట్టి పీడిస్తుంది. ఎంతటి క్రూరుల్నైనా భయకంపితుల్ని చేసి ప్రతిఘటిస్తుంది.

అందుకే అంతరాత్మను తప్పించుకుని మనిషి ఎప్పుడూ ఏ పని చేయలేడు. అదే అతని బలహీనత.

# పుస్తకాల పేజీ

*** ఉదయకిరణాలు**

రచయిత: డాక్టర్ సాకం వెంకట సుబ్బయ్య, పుటలు: 20, వెల: మూడు రూపాయలు, ప్రతులకు: డా. సాకం వెంకట సుబ్బయ్య, జయశ్రీ వైద్యశాల, 18-2-66, కొర్లగుంటరోడ్, తిరుపతి-517 501.

*** ప్రమోదూత**

కవితా సంకలనం: సంపాదకత్వం: టి. శ్రీరంగ స్వామి, పుటలు: 34, ప్రతులకు: శ్రీలేఖ సాహితి, హెచ్.నెం. 5-11-114/4, విద్యారణ్యపురి, వరంగల్-506 009.

*** శ్రీమత్స్యలింగేశ్వర శతకము**

మత్తేభమాల రచన: "అరాల", వెల: ఐదు రూపాయలు, పుటలు: 22, ప్రతులకు: మధులత బుక్స్, 29-8-11, లలితా కాలనీ, డాబాగార్డెన్స్, విశాఖపట్నం-20.

*** అరవై వసంతాలశార్వరి**

సంపాదకుడు: వాసిలి వసంతకుమార్, పుటలు: 240, వెల: 30 రూపాయలు, ప్రతులకు: మాస్టర్ సి.వి.వి.యోగా స్కూల్, H-694/2/A, గాంధీనగర్, హైదరాబాద్-500 380.

*** వెన్నెల**

స్వేచ్ఛాకవితల ఇమిడిక. కలముదార్లు: దేవరకొండ సుబ్రహ్మణ్యశాస్త్రి, రాచకొండ వేంకట సత్యసుబ్బలక్ష్మి, పుటలు: 28, వెల: ఐదు రూపాయలు, ప్రతులకు: శ్రీ కళాభారతి, బొబ్బిలి-532 558.

**మన పిల్లలకు ఎలాంటి ప్రపంచం సంక్రమిస్తుంది?**

సోవియట్ భూమి ప్రచురణలు. రచయిత: వ్యాచెస్లావ్ కతమిద్జే, పుటలు: 67, ప్రతులకు: స్వతంత్ర ఆర్టు ప్రింటర్స్, విజయవాడ-520 004.

*** సత్యసంహిత**

రచయిత: శార్వరి, పుటలు: 112, వెల: 15 రూపాయలు, ప్రతులకు: శార్వరీ పబ్లికేషన్స్, 1-3-183/40/3B, గాంధీనగర్, హైదరాబాద్-500 380.

*** స్పందన**

శ్రీ జిడ్డు కృష్ణమూర్తి జీవితం: తత్త్వం. సమర్పణ : కె. కె. రామానుజాచార్యులు, పుటలు : 149, వెల : ముప్పది రూపాయలు, ప్రతులకు: ప్రాప్తి బుక్స్, పి. బి. 5018, బీసెంట్‌నగర్, మద్రాసు-600090.

**★ మధ్యాంధ్ర యుగ చారిత్రక వ్యాసములు**

రచయిత: డాక్టర్ కొల్లూరు సూర్యనారాయణ, పుటలు: 174, వెల: పదిహేను రూపాయలు, ప్రతులకు : కొల్లూరు రాము, కొక్కిరాపల్లి (బి.పి.ఒ.) యలమంచిలి (ఎస్.ఒ.)-531055, విశాఖజిల్లా.

**★ తెలుగు పంచతంత్రము**

వచనము. మూలము : విష్ణుశర్మ పంచతంత్రము: తెలుగుసేత : వేములపల్లి ఉమామహేశ్వరరావు, పుటలు: 356, వెల: ముప్పది మూడు రూపాయలు, ప్రతులకు: వేములపల్లి ఉమామహేశ్వరరావు, కేరాఫ్ డాక్టర్ జి. వి. కృష్ణారావుగారి యిల్లు, బోసురోడ్డు, తెనాలి.



**రచయిత అడిగోపులకి శ్రీశ్రీ అవార్డు**

శ్రీ అడిగోపుల వెంకటరత్నంగారికి నాగార్జున యూనివర్శిటీ "శ్రీశ్రీ స్మారక గోల్డు మెడలు" ప్రకటించింది. వారి "పురోగతి అంచున" కథల సంపుటికి యీ పురస్కారం లభించింది.

ఈ పుస్తకంలో 15 కథ లున్నాయి. అందులో 3 కథలు కన్నడంలోకి, మరో 3 కథలు మళయాళంలోకి అనువదింపబడి ప్రచురింపబడి జనాదరణ పొందాయి. మరో రెండు కథలు రాష్ట్ర స్థాయి పోటీలలో ప్రథమ బహుమతులు గెల్చుకొన్నాయి. శ్రీ అడిగోపుల మంచి కవి కూడా - అనేక కవితా సంపుటాలు బహుమతులందుకున్నాయి.

**★ వైదికక్రాంతిపథం**

వేదోక్త పురోగమన మార్గము, సంకలనకర్త: డా. కోదూరి సుబ్బారావు, పుటలు: 92, వెల : ఐదు రూపాయలు, ప్రతులకు: గాయత్రీ ఆశ్రమము, 12-10-586/6, వ్యాసనగర్, సీతాఫల మండి, సికింద్రాబాద్-500361.

**★ శ్రీలలితా సహస్రనామ స్తోత్రమ్**

ప్రకాశకులు: పురాణపండ రాధాకృష్ణమూర్తి, పుటలు : 24, వెల : పది రూపాయలు, ప్రతులకు: పురాణపండ రాధాకృష్ణమూర్తి, జయశ్రీ టాకీసుకు కుడి వైపు సందు, రాజమండ్రి-4.

**★ మృత్యుంజయస్తవం**

రచయిత: మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి, పుటలు : 22, వెల : నాలుగు రూపాయలు, ప్రతులకు: పింగళి-కాటూరి సాహిత్యపీఠం, కేరాఫ్ మాధవి ప్రింటర్స్, కుత్బిగూడ, హైదరాబాద్-500027.

**★ తొలకరి**

రచయితలు: పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు, పుటలు : 48, వెల : ఐదు రూపాయలు, ప్రతులకు: పింగళి-కాటూరి సాహిత్యపీఠం, కేరాఫ్ మాధవి ప్రింటర్స్, కుత్బిగూడ, హైదరాబాద్-500027.

**★ కలసిన జీవితాలు**

మూలం: పన్నాలాల్ పటేల్, అనువాదం: వేమూరి ఆంజనేయశర్మ, పుటలు : 239, వెల : ముప్పది రూపాయలు, ప్రతులకు: 'స్వాతి', మందిర్‌మార్గ్, న్యూఢిల్లీ-110001.

**★ శ్రీలలితా స్తోత్ర మంజరి**

రచయిత: పురాణపండ రాధాకృష్ణమూర్తి, పుటలు : 97, వెల : పది రూపాయలు, ప్రతులకు: పురాణపండ రాధాకృష్ణమూర్తి, రాజమండ్రి-4.

O

## "డాక్టర్ భవాని"

# సినిమా

(40వ పేజీ తరువాయి)

"మే 1 నుంచి 10 వరకు ఆఖరి షెడ్యూల్ ముగించాం. ప్రశాంతతలోనే ఎంతో పట్టుదల గల సాత్వికమైన డాక్టర్‌గా శారదగారు మహాద్భుతంగా చేశారు. కరాటే మాస్టర్‌గా భానుచందర్, ఫారిన్ నుంచి వచ్చిన వనితగా వాణీ విశ్వనాధ్, పులిహోరను అమ్మే అమ్మాయిగా జయలలిత, హాస్పిటల్ నర్సుగా కిన్నెర, వార్డ్‌బాయ్ లెనిన్‌బాబుగా పరుచూరి గోపాలకృష్ణ పాల్గొన్నారు," అన్నారు వై. నాగేశ్వరరావు. ఈయన దర్శకత్వంలో డి. జగదీశ్‌రెడ్డి నిర్మించిన రవికిరణ్ వారి "డాక్టర్ భవాని" చిత్రంలో జగ్గయ్య, బాలయ్య, కాకరాల, సాయికుమార్, రాజేష్, చలపతిరావు, కిట్టు, ప్రకాశరావు, శ్రీలత, బేబీ సుజిత తక్కిన నటవర్గం. ఆంజనేయ పుష్పానంద్, పరుచూరి సోదరులు, చక్రవర్తి, ఆర్. రామారావు, నరసింహారావు, రాజా, విక్కి, జి. వి రామకృష్ణారావు, శివాజీ, బాపిరెడ్డి, పి. ఎన్. రామచంద్రుడు ప్రభృత సాంకేతిక వర్గంతో మద్దిపాటి కొండలరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

## డి.వి.ఎస్. ప్రొడక్షన్స్‌లో సుమన్, శోభన్

"జూన్ ఒకటి నుంచి ఆగస్టు రెండవ వారం వరకు రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు, డి. వి. కె. రాజు. ఈయన నిర్మాణ సారధ్యంలో డి.వి.ఎస్. రాజు నిర్మించే కొత్త చిత్రంలో సుమన్, శోభన్‌బాబు, లిజీ వగైరా నటవర్గం. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. విద్యాసాగర్ సంగీతం, జయరాం ఛాయ, కళాధర్ శిల్పం, ఎం. బాలు సంయుక్త దర్శకత్వం, బాబూరావు కూర్పుతో వై. నాగేశ్వరరావు దర్శకుడు.

## అడవి దివిటీలు

"సామాన్యులపై అయిన వాళ్ళు అన్యాయాలు, అక్రమాలు కొనసాగిస్తూంటే, ప్రతిఘటించిన వారిని నక్సలిజంగా పేర్కొంటున్నారు. బడుగు వర్గాల వారికి న్యాయం జరగడానికి ఒక అధికారి చేసే కృషికి రాజకీయ శక్తులు ఆటంకం కల్గిస్తూంటాయి. అతను న్యాయ పోరాటం కోసం తన పదవికి స్వస్తి చెప్పి తిరుగుబాటు దారుడుగా మారి తన లక్ష్యాన్ని ఎలా నెరవేరుస్తా డన్నదే ఈ చిత్రం ప్రధానేతివృత్తం," అన్నారు. ఆర్. నారాయణమూర్తి ఈయన నటిస్తూ, కథ, స్క్రీన్‌ప్లే, స్వీయ దర్శకత్వంలో నిర్మించిన స్నేహ చిత్ర పిక్చర్స్ "అడవి దివిటీలు" చిత్రం రంపచోడవరం, రాజమండ్రి, మారేడుమిల్లి పరిసరాలలో చిత్రీకరణ జరుపుకుంది. దేవదాస్ కనకాల, పురాణం [illegible] రాళ్ళపల్లి, ముక్కురాజు, రావూజీ, [illegible] రామలింగస్వామి, శాంతిలత, డబ్బింగ్ [illegible] అత్తిలి లక్ష్మి నటించారు కె. బి. [illegible] సంభాషణల కర్త. వంగపండు, సీతారా[illegible] గీతాలను విద్యాసాగర్ స్వరపరిచారు వెంకట్ రాజు. నృత్యాలు, రమేష్‌బాబు సహకార దర్శ[illegible] రాఘవ ప్రొడక్షన్, జోసఫ్ కూర్పు నిర్వహించార[illegible]

## "ఇంటింటా దీపావళి"

"హైదరాబాద్‌లో ఒకే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు. లక్ష్మీదీపక్. ఈయన దర్శకత్వంలో ఎం. సుధాకరరెడ్డి నిర్మించే జయప్రద పిక్చర్స్ "ఇంటింటా దీపావళి" చిత్రంతో చంద్రమోహన్, నవనాయిక వైజయంతి, సురేష్, ప్రభాకరరెడ్డి, సారథి, త్యాగరాజు, పృధ్వి, దివ్య, జయలత, శకుంతల, విజయలలిత, శ్రీలక్ష్మి, వినోద్‌బాల, మదన్‌మోహన్ వగైరా నటవర్గం ప్రభాకరరెడ్డి కథ, ఎల్చూరి వెంకట్రావు మాటలు, జాలాది పాటలు, శివశంకర్ సంగీతం, ఎం. సత్తిబాబు ఛాయ, మార్తాండ్ కూర్పు నిర్వహిస్తున్నారు.

**-జి.వి.జి.**



"లారీడ్రైవర్"లో బాలకృష్ణ